దేశ విఖ్యాతిగాంచిన విమల్ చీరల్లో సరికొత్త శ్రేణికై
విచ్చేయండి నేడే మంగళ్ దీప్ కి.




**మంగళ్ దీప్**
కోఠీ
హైదరాబాద్
ఫోన్: 45786

**మంగళ్ దీప్**
దాస్‌పల్లా కాంప్లెక్స్
జగదాంబ సెంటర్
విశాఖపట్నం

మా పాఠకులు, రచయిత(త్రు)లు, ఏజంట్లు, ప్రకటనకర్తలందరికీ దసరా శుభాకాంక్షలు

-సం.

## ఎక్కడ? ఎవరు?

ఆంధ్ర ప్రదేశ్‌లో మొత్తం 534 లక్షల మంది జనం ఉంటే ఇందులో సుమారుగా 312 లక్షల మందికి ఓట్లు ఉన్నాయి వీరిలో సుమారు 190 లక్షల మంది ఓటు వేశారు 1983 లో ఈ 190 లక్షలలోసుమారుగా 90 లక్షల మంది శ్రీ రామారావుకి ఓటు వేశారు. ఆరు కోట్ల మంది ఆంధ్రులు ఎక్కడ? వారి ప్రతినిధి ఎవరు?

గంటి రామలింగం, మదరాసు

## ఒక అమ్మ కథ

"ఒక అమ్మ కథ" క్రొత్త సీరియల్ కథ చాలా అద్భుతంగా వుంది రచయిత అన్నపూర్ణగార్కి మా అభినందనలు. మరియు ముఖ చిత్రం సూపర్ స్టార్ జయసుధ అత్యంత ఆకర్షణీయంగా వుంది.

బోటు సుధాకర్, చిప్పాడ ఉమా మహేశ్వరరావు, కురుపాం.

## ఎదురు చూడని పతనం

"ఎదురు చూడని పతనం" సమీక్ష వ్రాయకున్నా బావుణ్ను! ఆంధ్ర దేశమంతా వాడ వాడలా తెల్సి-పోయిన 'రాజకీయ కుళ్ళును' మీరు ఎంతో బ్యాలెన్స్‌గా, పకడ్బందీగా వ్రాశారు పాపం... దానివల్ల ఎవరికేం ఒరుగుతుంది?

(మీ ధర్మపథంలో చెప్పిన మాదిరే) ఆయా సమయాల్లో అన్యాయాన్ని వేలెత్తి చెప్పి ప్రజల్ని చైతన్యవంతుల్ని చేయగలిగిన బాధ్యత మీ పత్రికకు లేదా? వుంటే ధైర్యంగా "ఇది అన్యాయం – ఇది అధర్మం... " అని చెప్పి వుండాల్సింది

జనమంచి శివ కుమార శర్మ, కడప

## వినాయక చవితి సంచిక

వినాయకచవితిసంచిక ఆంధ్ర పత్రిక సచిత్ర వార పత్రికలో ప్రచురించిన 'పాత్ర దానం' చాల బాగుంది. మంచి కధా వస్తువును తీసుకుని, ఈనాటి సమా-జంలో అనాధ శరణాలయాలలో జరుగుతున్న అన్యాయాన్ని బయట పెట్టారు. ఈ అస్తవ్యస్తమైన వ్యవస్థలోని పరిస్థితుల మూల కారణాన్ని రూపు మాపాలంటే అభిరామ్‌లాంటి యువకులు, ఇలాటి కథలు ఎంతైనా అవసరం

ఎ విజయ, రేపల్లె




## సంతాపం

ప్రముఖ సంగీత దర్శకుడు "పెండ్యాల నాగేశ్వర-రావు" గారు మరణించారని తెలిసి మేము ఎంతో బాధ పడ్డాము. చలన చిత్ర రంగంలో "150 చిత్రా-ల"కు సంగీతం సమకూర్చి (మంచి పాటలకు) ప్రేక్షక హృదయాలలో చెరగని ముద్ర వేసిన మహా సంగీత దర్శకుడు. ఆయనలేని తీరని లోటు, ఆయనకు మా ప్రగాఢ సంతాపం తెలియ చేస్తున్నాము.

చావలి రామం, ఇతరులు, రాజమండ్రి



ఆంధ్రసచిత్రవారపత్రిక

వ్యవస్థాపకులు

దేశోద్ధారక కాశీనాధుని నాగేశ్వరరావు పంతులుగారు

స్థాపితం · 1908

శివలెంక శంభు ప్రసాద్

సంపాదకుడు :

(1938-1972)

శుక్రవారం : 12-10-84

శ్రీ రక్తాక్షినామ సం. ఆశ్వయుజ బ. విదియ

సంపుటము 77 : సంచిక 6

సంపాదకుడు ·

శివలెంక రాధాకృష్ణ

| | |
|---|---|
| విడి ప్రతి వెల | రు. 2-00 |
| ఆరు మా సాల చందా | రు. 55-90 |
| పోస్ట్‌లో ఏడాది చందా | రు. 111-80 |

ఆంధ్రపత్రిక కార్యాలయము,
గాంధీనగరం, విజయవాడ-520 003.

## విషయానుక్రమణిక

# కుటుంబ పాలననుంచి విముక్తికావాలి!




ప్రపంచ దేశాలలో భారత దేశం స్థాయి ఎలా ఉంది? శ్రీమతి గాంధీ ఎమర్జెన్సీని విధించి జైళ్లలో జనాన్ని కుక్కివేయక ముందు- బ్రిటీష్‌వారి హయాములో నిష్కారణంగా జరిగేటటువంటి సంఘటన లాంటిది జరగక ముందు- ఒక పెద్ద ప్రజాస్వామిక వ్యవస్థగా భారత్‌కు గుర్తింపుఉండేది. ఆ తరువాత నామ్‌కే వాస్తే మనది ప్రజాస్వామిక దేశమని అనుకోబడుతున్నా ప్రత్యేకించి చెప్పుకోదగ్గ గుర్తింపులేదనే భావించాలి భారతదేశంనించి ప్రపంచదేశాలు ఏదో ఆశించినా ఎన్నో కారణాల వల్ల మనమాస్థాయికి చేరుకోలేక పోయాము మనది అతి భాగ్యవంతమైన దేశం కాదు అలాగే అతి పేద దేశం కూడాకాదు అక్షరాస్యత అంత ఎక్కువా- కాదు మరీ తక్కువా కాదు. చీనా దేశానికి- వాస్తవమైనా కాక పోయినా- కమ్యూనిస్టు దేశంగా ఒక ప్రతిపత్తి ఉంది భారతదేశం విషయం వివాదాస్పదంగా అనిశ్చితంగా ఉంది. మనది పెట్టుబడిదారి వ్యవస్థ కాదు అలాగే పూర్తి సోషలిస్టు రాజ్యం కూడా కాదు స్విట్‌జర్‌లాండ్ లాగా శాంతిమంతులమని చెప్పే ఆస్కారంలేదు అయితే ముస్లిం దేశాల యుద్ధోన్మాదంమనకు లేదు మొత్తానికి ఎటూ తేల్చి చెప్పడానికి వీలుకాని పరిస్థితిలో భారత దేశం ఉన్నట్లు తోస్తుంది. బహుశా నెహ్రూ అనుసరించిన విధానాల వల్ల కాబోలు- మనదేశం అనాత్మికమై ప్రాక్పశ్చిమాల నడుమ గుర్తింపు లేకుండా ఊగిసలాడుతోందని అనుకోవచ్చును

నెహ్రూ పద్ధతి ఆయనకి మంచిగా తోచిందేమో కాని దేశానికి కాదు వ్యక్తిగత ప్రతిష్ఠ కోసం మాతృదేశం స్పందనాత్మను కోల్పోయేలా ప్రవర్తించడం దురదృష్టకరం. వ్యక్తి విషయమైనా వ్యవస్థ విషయమైనా అది వర్తించక తప్పదు సంస్కృతి పరంగా చరిత్ర పరంగా జీవకళనుకోల్పోతే ఏ వ్యవస్థా ముందుకు రాలేదు. స్వతంత్రం వచ్చి నాలుగు దశాబ్దాలు గడుస్తున్నా దేశమంతటా అస్తవ్యస్తమైన పరిస్థితి నెలకొని ఉండడానికి కారణం కూడా ఇదేనని అనుకోక తప్పడంలేదు. ముఖ్యంగా వ్యక్తిగత ప్రయోజనాల కోసం సంకుచిత మనస్తత్వాన్నిప్రదర్శించే హ్రస్వదృష్టి గల శ్రీమతి గాంధీ వంటి వారి విధానాలవల్ల పతనం తప్పదనిపిస్తోంది

శ్రీమతి గాంధీ మీద నమ్మకం మనదేశంలోనే కాక బయట కూడా బాగా తగ్గుతున్నట్లు తోస్తోంది. తరచూ ఆమె ప్రకటనలు పరస్పర విరుద్ధంగా ఉండడం పట్ల ప్రపంచ పత్రికా వ్యవస్థలో అర్థం కాని అసంతృప్తి ఉన్నట్లు కానవస్తుంది ప్రతిసారీ ఆమె వల్లివేసే విదేశీ హస్తంబాగా ప్రాచుర్యంలో ఉంది. పంజాబ్ విషయంలో విదేశాలు జోక్యం చేసుకోవడం పట్ల ఆమె ఆగ్రహాన్ని వెలిబుచ్చిన సంగతి విదితమే అయితే పారిస్‌లోని భారత రాయబార కార్యాలయానికి చెందిన త్రిపాఠీ ఒకరు ఆ విషయాన్ని శ్రీమతి గాంధీకి అనుకూలంగా ఇంటర్ నేషనల్ హెరాల్డ్ ట్రిబ్యూన్‌కు ఉత్తరం కూడా రాసారు! ఇలాంటి సందర్భాలు శ్రీమతి థాచర్ విషయంలో మచ్చుకైనా కనిపించకపోవడం విశేషించి చెప్పుకోవాలి.

ఆంధ్ర ప్రదేశ్‌లో శ్రీ రామారావు ప్రభుత్వాన్ని బర్తరఫ్ చేయడంపై శ్రీమతి గాంధీ పట్ల ప్రపంచ దేశాలలో బాగా అపనమ్మకం కలిగింది. ఒకప్పుడు భారతదేశపు మహారాణిగా శ్రీమతి గాంధీని కీర్తించిన "ది లండన్ ఎకానమిస్ట్" పత్రిక నేడామెను భారతీయులకు తలవంపులు తెచ్చిన వ్యక్తిగా పేర్కొంది. శ్రీమతి గాంధీని అపరదుర్గగా చిత్రీకరిస్తూ ఆమె చేతిలో ఆరు కపాలాలు ఉన్నట్లు ఒక వ్యంగ్య చిత్రం కూడా వేయబడింది. అందులో ఒక కపాలం శ్రీ ఎన్ టి రామారావుది. (అదృష్ట వశాత్తు ఆయన బాగానే ఉన్నారు. మళ్లీ ముఖ్యమంత్రి పదవిని చేబట్టారు.) ఎప్పుడూ నెహ్రూ కుటుంబీకులను సమర్థించే 'ది ఎకానమిస్ట్' పత్రిక కూడ శ్రీమతి గాంధీ వ్యవహారాలను విమర్శిస్తోంది.

ఇదే విధంగా అన్ని పత్రికలు రాస్తున్నాయని చెప్పడంలో తప్పేమీలేదు "లండన్ అబ్జర్‌వర్"లో అలాగ రాసి ఉంది. తండ్రిగారైన పండిట్ నెహ్రూ తరువాత తాము ఏ విధంగా అయితే ప్రధాన మంత్రి కాగలిగారో తమ తరువాత తమ కుమారుడు శ్రీ రాజీవ్‌గాంధీ కూడ ప్రధాన మంత్రి కావాలన్న విషయాన్ని శ్రీమతి గాంధీ రహస్యంగా ఏమీ ఉంచుకోవడంలేదు వ్యక్తిగతమైన లాభాపేక్షతో, పదవీ కాంక్షతో ఆమె చేసే రాజకీయ విన్యాసాలవల్ల నిజానికి సమస్యలు పెరుగుతున్నాయి. ఆమె ప్రవర్తనలో తేడా కనిపిస్తోంది ఆంధ్ర ప్రదేశ్ ముఖ్యమంత్రి శ్రీ ఎన్ టి రామారావును పదవీచ్యుతుని చేయడం యావత్ప్రపంచానికి దిగ్భ్రాంతిని గొలిపిం[illegible] కాశ్మీరు, సిక్కిమ్‌లలో ప్రభుత్వాలను పడగొట్టిన పిదప గుండెకు శస్త్ర చికిత్స చేయించుకుని అమెరికా నుంచి వచ్చిన శ్రీ రామారావును పడగొట్టడం ఆశ్చర్యంగానే ఉంటుంది. తమ ప్రమేయమేమీ లేదని శ్రీమతి గాంధీ అన్నా తెర వెనుక రాజకీయాలు నడపడంలో ఆమె మంచి దిట్టని అందరికీ తెలుసు. ఆంధ్ర ప్రదేశ్ విషయంలో . మాత్రం పదవీచ్యుతుడైనప్పటికీ శ్రీ రామారావు జాతీయ స్థాయికి ఎదగ గలగడం ఒక గొప్ప అంశంగానే చెప్పాలి. [illegible]మన్‌వెల్త్ దేశాల నాయకురాలిగా శ్రీమతి గాంధీ అభివృద్ధి చెందుతున్న దేశాల సారథిగా చెప్పుకోబడుతున్నా మాతృదేశంలో ఆమె నడుపుతున్న రాజకీయాలే పలువురినీ ఆకర్షిస్తున్నాయి.

సవుత్ చీనా మార్నింగ్ పోస్ట్ (హాంకాంగ్) లోని సంపాదకీయం కూడ శ్రీమతి గాంధీ విధానాల పట్ల అయిష్టతను వ్యక్త పరుస్తోంది.శ్రీమతి గాంధీ అనుసరిస్తున్న ద్వంద్వ వైఖరుల పట్ల నిరసన తెలుపబడింది. శ్రీలంక తమిళుల సమస్యపై శ్రీ జయవర్ధనే చర్చలు జరపడానికి సంసిద్ధత పడేటట్లు శ్రీమతి మార్గరేట్ థాచర్, శ్రీ రోనాల్డ్ రీగన్‌లకు శ్రీమతి గాంధీ ప్రత్యేకంగా విన్నపాలు చేయడం రానున్న లోక్ సభ ఎన్నికలలో తమిళుల అభిమానం సంపాదించడానికేనని ఆ సంపాదకీయంలో ఉంది అంతే కాదు స్వర్ణ దేవాలయంలో శ్రీమతి గాంధీ కసరత్తు చేసింది కూడా అధిక సంఖ్యాకులైన హిందువుల అభిమానం సంపాదించడానికేనని అందులోపేర్కొనబడింది.

ఇలాగే శ్రీమతి గాధీపై ఎన్నయినా చెప్పుకొని పోవచ్చును. శ్రీమతి గాంధీ స్థాయి- ఆమెను ఆకాశానికెత్తి స్తుతించే స్వరాజ్‌పాల్ వంటి వ్యక్తుల సంకుచిత దృష్టిలో మినహాయిస్తే- సార్వజనీనంగా బాగా దిగజారిందనిపిస్తోంది. రాజీవ్‌ని గద్దె ఎక్కించడానికి ఆమె నడుపుతున్న దమన నీతి తంత్రాలు దేశ వ్యవస్థను కలుషితపరుస్తున్నాయి. ఏక పక్ష నిర్ణయంతో జవహర్‌లాల్‌కు క్రీ.శ 1931లో లాహోర్‌లో మోతీలాల్ నెహ్రూ అధికారం అప్పచెప్పారు. పోతే జవహర్‌లాల్ ప్రధానమంత్రి పదవినే శ్రీమతి గాంధీకి వచ్చేలా చూచారు. అదే పనిని ఇప్పుడు శ్రీమతి గాంధీ చేయబోతున్నారు. కుటుంబ పాలన నుంచి బాధ్యతాయుతమైన పదవి బయట పడి సమర్థత, దక్షత ఉన్న వ్యక్తి చేతిలోకి వచ్చినప్పుడే మన భారత దేశానికి మంచి భవిష్యత్తు ఉంటుందని అనుకోవాలి. □



–మహిషాసురమర్దిని ఫోటో: బి వి రావు

# దేవీ నవ రాత్రులు

ఆశ్వయుజ శుద్ధ పాడ్యమి నుండి ప్రారంభమగు దేవీ నవరాత్రులు 'విజయదశమి' వేడుకలు తరతరాల భారతీయ సంస్కృతికి నిదర్శనములు బ్రహ్మవర ప్రభావము వలన దేవతలనందరినీ గడగడలాడించిన మహిషాసురుని నిర్జించి సమస్త లోకములకు శాంతిని ప్రసాదించిన దుర్గాదేవి వైభవమును దేవీ భాగవతమున వ్యాస భగవానుడు మనోహరంగా వర్ణించాడు

లోక కల్యాణ ప్రదాయిని ఓంకార స్వరూపిణి అయిన దుర్గాదేవి పూరించిన విజయ శంఖారావము భారతీయులకు ధర్మ వీరాలను బోధించినది పదునెనిమిది చేతులు, తెల్లని ముఖము, నల్లని కన్నులు, లేత ఎరుపు పెదవులు, ఎర్రని అర చేతులు గల్గి సింహవాహినియై శంఖ చక్రములు, వజ్రాయుధము, నూరు గంటలు గల్గిన గదయు, శక్త్యాయుధమును కవచమును ధరించి సూర్యుని యొక్క దివ్యకాంతిని గ్రహించి దుష్ట శిక్షణకై విజృంభించినది త్రిమూర్త్యాది సకల దేవతల సర్వశక్తులనూ తనలో ప్రతిష్టించుకొని శుంభ, నిశుంభ, మహిషాసురులను సంహరించి ధర్మ పరిరక్షణ చేసినది

భారత దేశంలో ఎన్నోవేల సంవత్సరాలనుండి ఈ దుర్గాదేవి ఆరాధన అత్యంత ప్రముఖ స్థానం వహించింది భారత వీరుడు, అర్జునుడు దుర్గాదేవిని సేవించి ఆమె కృపాకటాక్షము వలననే 'విజయ దశమి' నాడు ఉత్తర గోగ్రహణ సమయమున కురువీరుల నందరినీ అవలీలగా జయించగల్గాడు చరిత్రలో ఎందరో రాజులు విజయ దశమినాడు ఆయుధ పూజచేసి జైత్రయాత్రకు బయలుదేరి అఖండ విజయోత్సాహాలతో తిరిగి వచ్చేవారు ఆ పరాశక్తి మహిమలు ఎందరో మహానుభావులు పలు విధములుగా స్తుతించారు

అనేకచోట్ల దేవి విగ్రహాన్ని మృత్తికతో మలచి తొమ్మిది రోజులూ పూజించి విజయ దశమి రోజు నదీ జలాలలో నిమజ్జనం చేస్తారు అన్ని దేవాలయములలోను అమ్మవారిని రోజు కొక ప్రత్యేక అలంకారముతో పూజించటం జరుగుతుంది. ఒక్కొక్క మూర్తి సాత్వికమై సుమనోహరమై మనోజ్ఞంగా గోచరిస్తుంది. ఒక్కొక్క మూర్తి భయానకమై దుష్ట శిక్షణార్థ మవతరించిన శక్తి స్వరూపమై తేజరిల్లుతుంది.

కలకత్తాలోని కాళీమాత, భువనేశ్వర్‌లోని దుర్గామాత విగ్రహాలు వైభవోపేతమైనవి.

ఈ నవరాత్రులందు పది పన్నెండు సంవత్సరములలోపు వయస్సుగల ఆడ పిల్లలను కన్యకాపరమేశ్వరి రూపంగా భావించి పూజిస్తారు. రైతులందరూ దుర్గాష్టమి మహర్నవమి రోజులలో తమ వ్యవసాయ పనిముట్లను పూజించి తమ కార్య సాధనకు దేవి అనుగ్రహాన్ని కోరతారు

ఉత్తర భారతదేశంలో మహిషాసురుని విగ్రహాలను ఊరేగించి తగులబెడతారు ఆనందోత్సాహాలతో దుర్గాష్టమి వేడుకలు జరుపుకుంటారు.

విజయదశమినాడు సాయంత్రం ఊరి బయట జమ్మి చెట్టుకు పుష్పాలనలంకరించి శమీ పూజ చేస్తారు.

'శమీ శమయతే పాపం శమీ శత్రు వినాశినీ
అర్జునస్య ధనుర్ధారీ, రామస్య ప్రియదర్శినీ' అని పఠిస్తూ పవిత్రమైన ఆ జమ్మి పత్రాలనందుకొని నవరాత్రి మహోత్సవాలకు ముగింపు చెపుతారు.

సృష్టి స్థితి లయకారిణి, ఆనంద స్వరూపిణి అయిన "అమ్మలగన్న యమ్మ" సమస్త ప్రపంచమునకు సకల సంపత్, శౌర్య, విజ్ఞాన ప్రదాయిని.

నారీ ప్రపంచమంతా ఆ ఆదిశక్తి స్వరూపాన్ని ఆరాధించి తమయందు అంతర్గతమైయున్న అజేయమైన ఆ శక్తి స్వరూపాన్ని ఆకళింపు చేసుకొని ఆత్మ విశ్వాసాన్ని పెంచుకోవటం అత్యంత ఆవశ్యకమైన విషయం.

–పి. ఆదిలక్ష్మి

# నీకు తెలియని నిజం!

*************** రావినూతల సువర్ణా కన్నన్ ***************************

విశాలా వాసుదేవరావుల ఏకైక సంతానమైన లత ఎంగేజ్‌మెంట్ ఆ రోజు.

లత, అనంత్‌ని ప్రేమించి పెళ్ళి చేసుకోబోతున్నా రెండు కుటుంబాలు కాస్త సనాతనమైనవి కావడం మూలాన యధావిధిగా తాంబూలాలు పుచ్చుకునే కార్యక్రమం పెట్టారు.

కూతురి ఎంగేజిమెంటు కూడా పెళ్ళిలా అతి వైభవంగా చేస్తున్నాడు వాసుదేవరావు

వాళ్ళ ఆచారం ప్రకారం మగపెళ్ళివారు వచ్చి వారి గెస్ట్‌హౌసులో దిగారు

విశాల హడావిడిగా పురోహితుడికి ఏవో అందిస్తోంది. లత ఫ్రెండ్సంతా వచ్చినా ... తలుపులు బిగించుకుని ఊహాలోకంలో తేలిపోతున్న లతజోలికి పోకుండా విశాలతో కబుర్లు చెప్తూ కూర్చున్నారు

లత ప్రాణ స్నేహితురాలైన పద్మ గెస్ట్‌హౌసుకెళ్ళి అనంత్‌ని పలకరించి, డల్‌గావున్న అతన్ని కాసేపు ఆట పట్టించి మరీ వచ్చింది!

హాల్లో పురోహితులు మంత్రాలు చదువుతున్నారు.

పెళ్ళి కూతుర్ని తీసుకురండి అన్నాడో బ్రాహ్మడు.

విశాల, పద్మ మేడమీదికెళ్ళారు. హడావిడిగా లత గది తలుపులు దగ్గరగా వేసున్నాయి.

లోపల్నించి లత తీసే కూనిరాగం మధురంగా వినిపిస్తోంది

"ఆంటీ! లత మహా[illegible]ంది!" రహస్యంగాఅంది పద్మ.

విశాల చిన్నగా నవ్వింది.

హటాత్తుగా పద్మలో ఓ చిలిపి ఊహ వచ్చి విశాలకి సైగచేసి –

"లతా! .. అనంత్ వచ్చారు!" అంది రహస్యంగా

లత మాట్లాడలేదు. పాట ఆపనూలేదు

"ఏయ్! దెయ్యం! . నీక్కాబోయే శ్రీవారొచ్చారే నీతో ఏదో మాట్లాడాల్ట!" ఈసారి కాస్త బిగ్గరగా అంది పద్మ.

లత పాడేపాట ఆపేసింది! అయితే బైటకి మాత్రం రాలేదు

"ఇంకా ఏమిటాలస్యం" హడావిడిగా వచ్చాడు వాసుదేవరావు

. "ఛీ! .... ఇదెప్పుడూ ఇంతే! జగమొండి!" విసుక్కుంటూ తలుపు తోసింది పద్మ గదిలో లత లేదు బాత్‌రూమ్‌లో స్నానం చేస్తున్నట్టు షవర్‌లోంచి నీళ్ళు పడుతున్నట్టు శబ్దం అవుతోంది

"అబ్బబ్బ!! . ఇప్పుడా స్నానం!.. " విసుగ్గా అంది విశాల

"ఏమిటి?" అన్నాడు వాసుదేవరావు.

"అమ్మాయి స్నానం చేస్తున్నట్టుంది" దావిడ.

"ఏమిటమ్మా! అమ్మాయేదీ?" ఆయాసపడు.. వచ్చాడు పురోహితుడు.

విషయం మెల్లగా చెప్పాడు వాసుదేవరావు

"అదేమిటి ఇందాక తలంటి పోసుకోలేదూ?" చిరాగ్గా అన్నాడు బ్రాహ్మడు.

"అవునూ కదూ!" బిత్తరపోయింది విశాల.

గబగబ తలుపులు బాదారు

తలుపులు తెరుచుకోలేదు సరిగదా లత పలకనైనా పలకలేదు



కంగారు పడ్డారంతా

"మీరేం కంగారు పడకండాంటీ ఇలాంటి తమాషాలు చెయ్యడం లతకి అలవాటేగా. అదీగాక ఇప్పుడేగా తనపాట విన్నాం!" అంటూ ధైర్యం చెప్పి మెల్లగా పక్కకెళ్ళి వెంటిలేటర్లోంచి తొంగిచూసింది పద్మ కానీ బాత్‌రూమ్‌లో ఎవరూ లేరు, షవర్లోంచి నీళ్ళు మాత్రం ఫోర్స్‌గా పడుతున్నాయి

క్షణాలమీద తలుపులు పగలగొట్టారు లత కని-

# ఓ కనక దుర్గా

కనికరింపుము తల్లి
ఓ కనకదుర్గా!
ప్రణతులర్పింతునో
భక్తాపవర్గా!!

కన్న తల్లివి నీవె
మిన్నకుండుట తగునె?
నన్ను బ్రోచే సుప్ర
సన్నమతులెవరమ్మ? ... ... కనికరింపుము

నిన్ను సందర్శించు
కన్నులిమ్మో తల్లి!
నీ పూజలందే ప్ర
మోదమ్ము చేకూర్చు ... ... కనికరింపుము

నీ స్తోత్ర రాజమ్ము
నా శ్రోత్రముల సోక
అస్తోక సౌఖ్యంబు
నిధిలోన మున్గెదను ... ... కనికరింపుము

పూర్వ జన్మములందు
ఏ సుకృత లేశమో
నర జన్మమెత్తితిని
ఒడిగట్టనే సుకృతి ... ... కనికరింపుము

వ్యాధులెన్నో పట్టి
బాధించు దేహమ్ము
ఆధులెన్నో చేరి
వేధించు నా మనసు ... ... కనికరింపుము

నిను నమ్మి నీపైనె
భారమంతయు మోప;
నాకు నేనై నిర్వ
హింప నీ బ్రదుకంతు ... ... కనికరింపుము

పాదమొక్కటి పడవ
ఒడ్డుపైనొక యడుగు
అటు నిటూ కదలలే
కల్లాడుచున్నాడ ... ... కనికరింపుము

నీయొడిని నను జేర్చి
ఓదార్చుమో జనని!!
ఎంత యెత్తెదిగినా
పసిపాపనే నీకు ... ... కనికరింపుము

నీ దివ్య దుగ్ధమ్ము
లాని కుత్సుక బంటి
జర మృతుల నిర్జించి
అమృత పుత్రుడ నౌదు ... ... కనికరింపుము

నిన్ను నే సేవించి
శాంతి దాంతుల తోడ
జీవించు భాగ్యమ్ము
చేకూర్చుమో జనని!! ... ... కనికరింపుము

నీ సేవచే గదా!
అల గదాధరుడు తా
రామకృష్ణుండౌచు
ప్రేమామృతము పంచె ... ... కనికరింపుము

నరులెల్ల తద్రీతి
పరివర్తనము చెంద
నీ సేవలో మున్గ
జేయుమో జనయిత్రి!! ... ... కనికరింపుము

–డాక్టర్ బొడ్డుపల్లి పురుషోత్తం

పించలేదు!

"ఇంతలో ఏ మైంది?" అనుకున్న పద్మ కళ్ళు అల్లంత దూరంలో వున్న టేప్ రికార్డర్ మీద పడ్డాయి. గబగబా దాని దగ్గర కెళ్ళి స్పూల్‌ని రివైండ్-చేసి ఆన్ చేసింది

సన్నని కూనిరాగం!

అది లత గొంతే!

"అంటే తాము విన్నది టేప్ రికార్డులోని పాటన్న-మాట! ఆటోమేటిగ్గా ఆగిపోతే తమ మాటలు విని ఆపేసిందని భ్రమ పడ్డారన్నమాట! షవర్ ఓపన్‌చేసి బాత్‌రూమ్ తలుపులు బిగించి లాక్‌చేసి, ఎవరూ రాకుండా జాగ్రత్తపడిందన్నమాట! .... అయితే లత

## నీకు తెలియని నిజం

ఎక్కడి కెళ్ళినట్టు? .... ఎందు కెళ్ళినట్టు? ప్రేమిం-చిన వాడితో పెళ్ళికి సిద్ధమై ఇప్పుడు ఎందుకు మాయమైనట్టు? లేకపోతే ఎవరైనా కిడ్‌నాప్ చేస్తు-న్నారా?' ఆలోచనలు పురుగులా తొలిచేస్తున్నాయి పద్మని.

విషయం క్షణాల మీద అందరికీ తెలిసిపోయింది. లత వుంటుందనుకున్న అన్నిచోట్లా వెతికారు వాసుదేవరావు. కానీ లత జాడలేదు.

*    *    *

పద్మ, అనంత్ ఇంటి కెళ్ళేసరికి అతను తప్ప ఇంట్లో ఎవరూ లేరు. అనుకోకుండా వచ్చిన ఆమెను చూసి కాస్త బిత్తరపోయాడు అనంత్.

అతని మొహం ఎన్నో లంకణాలు చేసినట్టు వాడిపోయి వుంది! కళ్ళు లోతుకుపోయాయి!

తెచ్చి పెట్టుకున్న నవ్వుతో పద్మనాహ్వానించి కూర్చోపెట్టాడనంత్.

పది నిమిషాల తర్వాత –

"మిస్టర్ అనంత్! .... లత వెళ్ళిపోవడానిక్కారణం మీకు తెలుసుకదూ? ...." సూటిగా అంది పద్మ.

అనంత్ మాట్లాడకుండా లేచి వెళ్ళి ఓ ఉత్తరం తెచ్చి పద్మ చేతుల్లో పెట్టాడు.

చిత్రంగా ఓసారతనికేసి చూసి దాన్ని చదవడం మొదలు పెట్టింది పద్మ.

ప్రియమైన లతా!

మొత్తానికి నీ పంతం నెరవేర్చుకున్నావు! ఆనీ

# సంపూర్ణ పోషకాహారంలో అన్ని పోషక పదార్థాలు సరియైన పాళ్లలో వుండాలి...



ప్రొటీనులు
పెరుగుదలకి ముఖ్యం
పిండి పదార్థాలు మరియు క్రొవ్వు పదార్థాలు
శక్తికి
విటమిన్ ఎ
కళ్ళలో కాంతులకి
విటమిన్‌లు బి గ్రూప్
అన్ని ఇతర పోషక పదార్థాలని జీర్ణించుకోడానికి
విటమిన్ సి
రోగ నిరోధక శక్తి పెంపొందించడానికి
విటమిన్ డి
కాల్షియం మరియు ఫాస్పరస్‌లని గ్రహించేటట్లు చేయడానికి
ఐరన్
ఆరోగ్యవంతమైన రక్తానికి
కాల్షియమ్ మరియు ఫాస్పరస్
దృఢమైన ఎముకలు మరియు పండ్ల కోసం

# సిరిలాక్ సంపూర్ణ పోషకాహారాన్ని రుచికరమైన విధంగా అందజేస్తుంది

సిరిలాక్‌లో అయిదు రకాల పోషకాలు అన్నీ వున్నాయి—ప్రోటీన్లు, క్రొవ్వు పదార్థాలు, పిండి పదార్థాలు, ఖనిజాలు మరియు విటమిన్లు. మీ పాపకి ప్రతి పర్యాయమూ సిరిలాక్‌తో తయారు చేసిన ఆహారం మీరు యిచ్చినప్పుడు ఈ పోషకాలన్నీ సరియైన పాళ్ళలో చేరి వుంటాయి.




కలసికట్టుగా పని చేయడం వలన ఈ పోషకాలన్నీ హెచ్చు తగ్గులు లేకుండా ముఖ్యమైనవే. అందుకే అన్ని పోషకాలు 'సంపూర్ణం'గా వున్న సిరియల్ ఆహారం మీ పాప ఆరోగ్యానికి అత్యవసరం. ప్రతి సిరిలాక్ ఆహారం మీ పాపకి ఒక రోజుకి కావలసిన పోషక పదార్థాలలో నాల్గవ వంతుని అందచేస్తుంది. ఈ ఆహారం యిస్తున్నప్పుడు పోషక పదార్థాల కోసం మరొకటి మీరు యివ్వవలసిన అవసరం లేదు.

మీ పాపకి చనుపాలే తగినవి. అయితే పాపకి నాలుగు నెలలు వచ్చి ఘన పదార్థాలు తీసుకోడానికి సిద్ధంగా వున్నప్పుడు, మీ డాక్టర్‌ని సంప్రదించి సిరిలాక్ యివ్వడం ప్రారంభించండి.

## సిరిలాక్®
పాలు వుండనే వున్నాయి




సిరిలాక్ తయారు చేయడం ఎంతో సులభం. దీనిని ముందుగా మరగ బెట్టిన, గోరు వెచ్చటి నీటికి చేర్చండి. కలపండి. వడ్డించండి

**ఉచితం!** సిరిలాక్ పిల్లల పెరుగుదల చార్ట్
ఇందులో బరువు చార్టు, రోగనిరోధక మందుల రికార్డు, గట్టిగా ఉండే ఆహారం అలవాటు చేసేందుకు సూచనలు, యింకా ఎన్నో విషయాలు ఉంటాయి
మీ కాపీ కోసం ఈ చిరునామాకు వ్రాయండి.
సిరిలాక్
పోస్ట్ బాక్స్ నం 3 న్యూ ఢిల్లీ-110 008.

SAA/FSL/C/3151 TEL

NESTLÉ.

మర్చిపోయి . . నీ దార్న నువ్వు పో అని తేలిగ్గా అనేశావు!. కానీ. నువ్వు మర్చిపోయినంత తేలిగ్గా నేను మర్చిపోలేక పోతున్నాను లతా! నీతో గడిచిన కాలం, చల్లని నీ నవ్వు నాకు మరపు రావడంలేదు!

మొత్తానికి నీ ఒడిలో పడుకుని. . నల్లని నీ కళ్ళ-ల్లోకి చూస్తూ సర్వం మరచిన ఆ రోజులు తల్చు-కుంటే . ఇంకానువ్వు నా దగ్గరి కొస్తావనే అనిపిం-చింది.... కానీ నీ ఎంగేజ్‌మెంట్‌కి డేట్ ఫిక్సయిందని తెలిసిన రోజున . ఓహ్!.. చెప్పలేను! . . అది ఒక నరకం!

లతా! ప్రేమ ఎప్పుడూ త్యాగాన్నే కోరుకుం-దంటారు! .అందుకే.... నువ్వు కోరినట్టుగా నేను దూరంగా వెళ్ళిపోతాను. . నువ్వు అనంత్‌గార్ని చేసుకుని హాయిగా ఉండు! .. మరు జన్మంటూ వుంటే నీ వాడిగా పుట్టాలని ఆ దేవుణ్ణి వేడుకుంటూ నా శేష జీవితాన్ని ఇలా ఒంటరిగా గడిపేస్తాను! నా ప్రాణం ఆగక నీకీ ఉత్తరం రాస్తున్నాను! చదివిన వెంటనే చించెయ్యి! సదా నీ శ్రేయస్సు కోరుకునే ఒకనాటి నీ ప్రియుడు

"ఇది. ఎక్కడిది?" తడారిపోతున్న పెదవులతో అంది పద్మ

"ఆ రోజు నేనూ, లతా పార్క్‌లో ఉండగా ఓ కుర్రాడు ఇచ్చి పారిపోయాడు లతకి"

"ఇది ,. ఇది నిజం అనుకుంటున్నారా?"

"లేదు!. . కానీ మనసు కాస్త పాడైంది!"

"లత నేమైనా అన్నారా?" ఆదుర్దాగా అంది పద్మ

"లేదు!.... కానీ. . ఆ ఉత్తరం జేబులో పెట్టుకుని ఇంటి కొచ్చి మళ్ళీ చదువుతుండగా అమ్మ కంట పడి పోయింది

అమ్మ మండి పడింది! ఈ పెళ్ళి జరగడానికి వీల్లే-దంది! లతని చాలా దారుణంగా తూలనాడింది ఎలాగో నచ్చచెప్పి ఆవిణ్ణి శాంతపరిచి బైటి కొచ్చే-సరికి అక్కడ పాలిపోయిన ముఖంతో నిల్చున్న లత కనిపించింది

"రా! లతా!" అన్నాను తేరుకుని

"సారీ అనంత్! ఆ లెటర్ ఇస్తావా?" అంది మామూలుగా.

## నీకు తెలియని నిజం

ఇచ్చాను

అంతే తను వెళ్ళిపోయింది!

అసలు పెళ్ళే వద్దంటుందేమో అని భయ-పడ్డాను .. కానీ ఏం అన్లేదు కానీ చివరి కిలా చేసింది!" భారంగా నిట్టూరుస్తూ ముగించాడు అనంత్

*  *  *

హోటల్ 'రవి కిరణ్' లో ఓ మారు మూలగా కూర్చుని మాట్లాడుకుంటున్నారు ప్రవీణ, మాధవి

"మాధవీ! ... ఇంక నువ్వు లత గురించి ఆలో-చించడం మానెయ్!. ఆమె ఎక్కడున్నా క్షేమంగానే ఉంటుంది! ." అనునయంగా అంది ప్రవీణ

"లేదు ప్రవీణా! లత గురించి నీకు తెలియదు దాని మనసు చాలా సున్నితం! ఎవరో రాసిన ఉత్తరానికి అన్యాయంగా అది బలై పోయిందేమో అని నా బాధ!" కళ్ళు వత్తుకుంటూ అంది మాధవి

"ఒకవేళ నిజంగా. లత అతన్ని మోసం చేసిం-దేమో!" అంది ప్రవీణ

"నో! నో!... అలా జరగడానికి వీల్లేదు! దాని మాట కా ఇంట్లో తిరుగులేదు!. " అంది మాధవి నిశ్చ-యంగా

"అది కాదు! .. అతనంటే ముందు లైకింగ్ వుండి ... ఆ తర్వాత. . "

"ఛ! ఛ!"

"మరైతే లత ఎందుకు పారిపోయినట్టు?"

"అదే నాకూ అర్థం కావడం లేదు దానికి ఓ మేనత్త వుంది ఆవిడ దగ్గర మంచి చనువుంది! . అక్కడి కెళ్ళుంటుందేమో అని నా అనుమానం!" ఏదో ఆలోచిస్తూ అంది మాధవి .

ఇద్దరూ మరి కాస్సేపు ఆ విషయాన్నే మాట్లాడు-కున్నారు, కాఫీలు తాగుతూ.

"ఎక్స్‌క్యూజ్‌మీ!"

ప్రవీణా, మాధవీ తృళ్ళి పడి చూశారు.

ఎదురుగా ఒక యువకుడు!

"మీరు? " అంది మాధవి ఆశ్చర్యంగా

"మీరు మాట్లాడుకునే దాంట్లో విన్నా!" బాధగా నవ్వుతూ అన్నాడతను

' అంటే ? ముఖాలు చూసుకున్నారు స్నేహితు లిద్దరూ

"కూర్చోచ్చా?" అన్నాడతను మర్యాదగా.

"సారీ!. .. కూర్చోండి! . " అంది ప్రవీణ.

"నా పేరు గోవర్ధన్! మీ లతంటే పడి చచ్చే పిచ్చి-వాణ్ణి!" కూర్చుంటూ అన్నాడతను

"అంటే.. ఉత్తరం రాసింది కళ్ళు చిట్లిస్తూ అంది మాధవి.

"అవును! ... నేనే! . కానీ ఆ ఉత్తరం ఇన్ని అనర్థాలకి దారి తీస్తుందని మాత్రం ఊహించలేదు అనుకోకుండా మీ మాటలు వినకపోతే అసలీ విషయం నాకు తెలిసేదే కాదు!" అన్నాడతను.

అతని కళ్ళనిండా నీళ్ళు!

"మీకు. లత ఎలా తెలుసు?" సూటిగా అంది మాధవి

"లత పాట నన్ను ఆకర్షించింది! అనుకోకుండా ఓ రోజు పార్క్‌లో కలుసుకున్నాం నవ్వుతూ కబుర్లు చెప్పుకున్నాం!. అది ప్రేమగా మారడానికి ఎక్కువ రోజులు పట్టలేదు మా ప్రేమ సంగతి అప్పుడే ఎవరికీ చెప్పద్దని లత అనడంతో ఈ సంగతి చాలా మందికి తెలియదు.

కానీ ఒకరోజు హటాత్తుగా వచ్చి నన్ను మర్చి-పొండి! అంది లత

నేను నిర్ఘాంతబోయాను!.... ఎన్నో విధాల బ్రతి-మాలాను!.... కానీ ఆమె మనసు కరగలేదు

కులాలు వేరైన కారణంగా తన వాళ్ళు ఒప్పుకో-లేదనీ, ఇంకెప్పుడూ తన కంట పడవద్దనీ నిర్దయగా చెప్పింది. చేసేది లేక, ఆమెని మర్చిపోలేక ఇలా ఇంత దూరం వచ్చేశాను! ఇంక ఆగలేక వచ్చే రోజు వుత్తరం రాసి పంపించాను. కానీ . " అతని కంఠం గద్గదమైంది.

అతని కళ్ళల్లోని నిజాయితీని గుర్తించారు మాధవీ, ప్రవీణ

"ఇప్పటికే మీరు లతని ప్రేమిస్తున్నారా?" హటాత్తుగా అంది మాధవి






"ఇప్పటికీ కాదు!.... ఎప్పటికీ లతే నా ప్రాణం!" ఆరాధనగా అన్నాడు గోవర్ధన్.

"అయితే లత ఎక్కడున్నా వెతికి తెచ్చి మీ కాళ్ళ దగ్గర పడేస్తాను!..... నిజమైన ప్రేమంటే ఏమిటో చూపిస్తాను!" ఆవేశంగా అంది మాధవి.

"అవును! . . తెలియకపోతే తెలియ చెప్పాలి!లతని త్వరలో తెచ్చి మీకు చూపిస్తాం!" అంది ప్రవీణ కూడా.

వాళ్ళిద్దరికీ లతంటే ఒక విధమైన చిరాకని-పిస్తోంది.

"కానీ.. . లత. .. "

"మీరూరుకోండి గోవర్ధన్! అంతా నేను చెప్తాగా!" అంది మాధవి.

లత కనిపిస్తే ఎలా తెలపాలో అడిగి తెలుసుకుని లేచారు ప్రవీణ, మాధవి.

* * *

అనుకున్నట్టే లత మేనత్త ఇంట్లోనే ఉంది. వెంటనే హోటల్ 'నాగ ప్రియ'కి అయిదింటికల్లా రమ్మని ఫోన్ చేసింది మాధవి గోవర్ధన్‌కి.

హోటల్ నాగప్రియ అతి సందడిగా ఉంది!

గోవర్ధన్ రాగానే ఆప్యాయంగా ఆహ్వానించి కూర్చోబెట్టారు మాధవి, ప్రవీణలు

"లత ఏదీ?" ఆతృతగా అడిగాడు అతను.

మూలగా వున్న రూమ్ కేసి చూపించింది మాధవి నవ్వుతూ

"మీరు కూర్చోండి!.. . ఆమె న్నే పిల్చుకొస్తాను! మిమ్మల్ని చూసి ఆశ్చర్యపోవాలి!" అంది ప్రవీణ.

హోటల్ కాన్ఫరెన్స్ హాల్లో చాలా మంది చేరారు. అందర్నీ అతనికి పరిచయం చేశారు.

"మీరు చాలా హడావిడి చేశారు! ... లతకి కోపం వస్తుందేమో!" చుట్టూ వున్న వాళ్ళని ఇబ్బందిగా చూస్తూ అన్నాడు గోవర్ధన్.

"ఫరవాలేదు. దాని కా సంగతి బాగా తెలియాలి!" అంది మాధవి

"అవును! ... ప్రేమంటే ఆటలు కాదు!" అన్నాడు ప్రవీణ అంకుల్ సీరియస్‌గా.

"అంకుల్!. . లతని తీసుకురానా?" అంది ప్రవీణ.

"ఊఁ! ఇంకా ఆలస్యం దేనికి!" నవ్వాడాయన. ప్రవీణ లత వున్నగదిలోకి నడిచింది.

గోవర్ధన్ ఆతృతగా ఎదురు చూస్తున్నాడు.

"గోవర్ధన్ గారికి తొందరగా వున్నట్టుంది!...." తమాషాగా నవ్వింది మాధవి.

తన ఆతృతకి సిగ్గు పడ్డాడు గోవర్ధన్.

"నిజంగా మీరు చాలా అదృష్టవంతులు మిస్టర్ గోవర్ధన్!... బంగారు బొమ్మలాంటి అమ్మాయితో పాటు..... దేవాలయంలాంటి అత్తవారిల్లు కూడా దొరికింది!" అన్నాడు అంకుల్.

ఇబ్బందిగా కదిలాడు గోవర్ధన్.

"సరిగ్గా చెప్పడంకుల్!.... ఆ అత్త వారిల్లు ఎలా వుంటుందో!" కొంటెగా అంది మాధవి.

## నీకు తెలియని నిజం

"ఐనో! ఐనో!" అన్నాడు గోవర్ధన్.

"అబ్బే!.... మీకు తెలియదు!.... అంకుల్! ఇంక ఆయన్ని ఇబ్బంది పెట్టకండి!.... పాపం! తెలుసు-కోవాలని చాలా కుతూహలంగా ఉన్నారు!"

అంది మాధవి.

"అలాగే!...." అంటూ పక్కగా నిల్చున్నతని కేసి చూశాడాయన.

"మిస్టర్! ... " అంటూ అతను జేబులోంచి బేడీలు తీసి గోవర్ధన్ చేతికి తగిలించాడు.

"వాట్ నాన్సెన్స్!" అరిచాడు గోవర్ధన్

"పెళ్ళి!" వ్యంగ్యంగా అంది మాధవి.

"మోసం. లతని తీసుకొస్తానని చెప్పి.... "

"లత కూడా వచ్చిందిరా ఫూల్!...." ఉరుముతూ వచ్చాడు అనంత్.

"మీరు...."

"ఓ!.... నీకు తెలియదుకదూ! లత కాబోయే భర్త ఆయన!" అంది మాధవి.

"అంటే.... నా లత నాకాకుండా చేసిన వాడివి నువ్వే-నన్నమాట!" కోపంగా చూస్తూ అన్నాడు గోవర్ధన్.

పక్కున నవ్వింది మాధవి.

"ఎందు కానవ్వు!...." బింకంగా అన్నాడతను.

"మరేం లేదు.. లత నిన్ను ప్రేమించిందనడానికి సాక్ష్య మేమైనా వుందా?" సవాల్ చేశాడు అనంత్!

"మా మనసులే సాక్ష్యం!.... ముందామెను పిల-వండి. నిలదీసి అడగండి!" అన్నాడు గోవర్ధన్ ఆవే-శంగా.

"పిలుస్తాను! ఆమె చేత చెప్పిస్తావా?" తీక్షణంగా అంది మాధవి.

"ఆ!...." బింకంగా అన్నాడతను.

"ఇదిగో! నేనే లతని! నా పూర్తి పేరు మాధవీ లత.... నాతో నీ ప్రేమ కథ ఎలా సాగిందో చెప్పు!" నిప్పులు కురిపిస్తున్న కళ్ళతో అంది మాధవి.

బిత్తరపోయాడతను.

"ఆశ్చర్యంగా వుంది కదూ!.... అర్థమయ్యేలా నేను చెప్తాను!" అంటూ ప్రవీణ చెప్పడం ప్రారంభించింది.

నీ ఉత్తరం చూసి లత నిర్ఘాంత పోయింది అనంత్ తల్లిగారన్న మాటలు విని బాధ పడింది ఇప్పుడు పెళ్ళి జరిగినా ఆవిడ దృష్టిలో తను అను-మానితురాలిగానే నిల్చిపోతుంది. అందుకే ఎంగేజ్-మెంట్ రోజున ఎవరికీ చెప్పకుండా నా దగ్గరి కొచ్చింది. విషయం చెప్పింది.

అన్నిటికన్నా చిత్రం ఏమిటంటే నా ఫ్రెండ్ మాలతికి గోవర్ధన్ బాగా తెలుసు. ఈ ఉత్తరం చూసి అతని రైటింగ్‌గాఅనుమానించింది.

సమయం చూసి అతన్ని మాకు చూపించి ప్లాన్ వివరించి, తను పక్కకి తప్పుకుంది. ఆ పైమేం పన్నిన వలలో అతను తేలిగ్గా పడిపోయాడు." ముగించింది ప్రవీణ.

"అవును! ఇంత మందిని పిలుస్తామని ఏమాత్రం అనుమానించినా అతను ఇక్కడి కొచ్చేవాడు కాదు!" అంది మాధవి.

"ఎందు కిలా చేశావ్?" అన్నా రెవరో.

"నేను చెప్తాను! . . ఇతని తమ్ముడు సూర్యం ఓ దోపిడీ కేసులో పట్టు పడ్డాడు కానీ నిర్దోషిగా బైటి కొచ్చేశాడు. అయితే.. . నేనా కేసు మరొకరి కోరికపై తీసుకుని.. . అతన్ని జైలుకి పంపాను ... ఇతనికి తమ్ముడంటే ప్రాణమనీ నా మీద పగ తీర్చుకుంటా నన్నాడనీ విన్నాను. కానీ అది నే నంతగా పట్టించుకోలేదు. ఇతను ఏదో లత అలవాటుగా ఒకటి రెండు తెలుసుకుని.... ఇలానాటకం ఆడాడు! నిజానికి లతని ఇత నెప్పుడూ చూడలేదు. ఉత్తరం కూడా లోకల్ వాళ్ళచేత ఇప్పించాడు పార్క్ కి పంపి ... " ముగించాడు వాసుదేవరావు.

తలవంచుకున్న గోవర్ధన్ కళ్ళ నుంచి రెండు నీటి చుక్కలు రాలాయి

మాధవీ, ప్రవీణలు బాధగా చూశారతనికేసి

"అయామ్ సారీ!" గొణిగింది మాధవీలత అతని కేసి చూస్తూ

"నేనే సారీ చెప్పాలి!... అనవసరంగా మీ పెళ్ళి చెడగొట్ట ప్రయత్నించినందుకు నన్ను క్షమించండి మాధవీ!" సంకెళ్ళున్న చేతుల్నే జోడించాడు గోవర్ధన్

జరిగిందానికి బాధపడింది అనంత తల్లి

"మిస్టర్. . గోవర్ధన్ ... " ఏదో అనబోయిన మాధవి, మాలతిని చూసి ఆపేసి–

"రండి మాలతీ!.... మీ ప్లానంతా సక్సస్!" అంది అప్పుడే మాలతి నాహ్వానిస్తూ

"మాలతి కళ్ళు వాచి వున్నాయి

"ఏం జరిగింది మాలా!" అంది ప్రవీణ కంగారుగా.

"మీ కందరికీ తెలియని ఒక రహస్యం వుంది ప్రవీణా! గోవర్ధన్ నా కాబోయే భర్త!.... నా ప్రాణం! నా సర్వస్వం!" అంది మాలతి రెండు చేతుల్లోనూ మొహం దాచుకుంటూ

నిర్ఘాంతపోయా రంతా.

"వర్ధన్! ... నన్ను తిట్టు!... కొట్టు! చంపెయ్యి! నేను చేసిన ద్రోహం సామాన్యమైంది కాదు!.. . ఒక పిల్ల పెళ్ళి తప్పిపోయింది. దానివల్ల ఆ పిల్లే కాక ఇంటిల్లిపాదీ బాధపడతారని ఈ పని చేశానే తప్ప నిన్ను నేరస్థునిగా నిలబెట్టడానిక్కాదు గోవర్ధన్. నన్ను నమ్ము!" అతని రెండు చేతులు పట్టుకుని ఏడుస్తూ అంది మాలతి.

"ఇందులో నీ పాత్ర చాలా తక్కువ మాలతీ! నిజానికి నేను చేసిన పని చాలా నీచమైందని నాకు తెలుసు.. . కానీ ..." అతని కళ్ళు చెరువులే అయ్యాయి

"పదండి! సర్!" అన్నాడు అంకుల్ అన్న ఎస్. పి. తో. భారంగా కదిలా డాయన

అందరి కళ్ళూ శ్రావణ మేఘాలయ్యాయి. ☐

# డాక్టర్ సలహాలు





డాక్టర్ కె. వెంకటేశ్వరరావు

## ఎం. ఎస్. ఎన్. – విజయవాడ

నేను రెండు నెలలుగా ఆస్టోకాల్షియం మాత్రలు చప్పరించుచున్నాను. దీనివల్ల ముందు కాలంలో ప్రమాదం ఉన్నదా?

★ వీటివల్ల పెద్ద ప్రమాదమేమీ లేకపోయినా, వాడవలసిన అవుసరం ఉన్నదీ లేనిదీ వైద్యులు నిర్ణయిస్తే మంచిది కదా!

## ఎస్. ఎస్. – నాసిక్

బొల్లి మచ్చలు అంటువ్యాధా? బొల్లి వున్న వాళ్లని ముట్టుకుంటే మనకూ ఆ వ్యాధి వస్తుందా? కుటుంబ సభ్యులలో ఒకరికి వుంటే మిగతావారికి వస్తుందా? బొల్లి మచ్చలను పూర్తిగా నివారించటానికి వీలవుతుందా?

★ బొల్లి మచ్చలు అంటు వ్యాధి కాదు. అందువల్ల మచ్చలు ఉన్నవారి ముట్టుకొంటే ఆ రోగం రాదు. వంశ-పారంపర్యంగా ఈ రోగం రాగల అవకాశం ఉన్నది. దీనిని నివారించటానికి ప్రత్యేక మందులుగాని, చికిత్సా విధానం గాని లేదు.

## టి. ఎన్. ఆర్. – గుడారి

నాకు అప్పుడప్పుడు గుండెల్లో నెప్పి వచ్చుచున్నది. వారానికి, పది రోజులకి ఒకసారి వచ్చి రెండు నిముషములు వుంటోంది. మా వూరి హాస్పటల్‌లో మాత్రలు ఇచ్చినారు. అయినా తగ్గ లేదు. ఈ నెప్పి దేని వలన వచ్చినది? ఏమి చేస్తే తగ్గుతుంది.

★ గ్యాస్ట్రైటిస్ అనే రోగం ఉన్నవారికి ఇలా తరచూ నెప్పి రావటం జరుగుతుంది. ఎక్కువగా కారం, పులుపు, మద్యం సేవించేవారికి, నిర్ణీత వేళల్లో భోజనం చేయనివారికి ఇలా గ్యాస్ట్రైటిస్ అనే రోగం వస్తుంది. కొన్నాళ్లపాటు అలక్ష్యం చేస్తే కడుపులో పుండు ఏర్పడే అవకాశం ఉంటుంది. వైద్యులు పరీక్ష చేసి యాంటాసిడ్ మాత్రలు వాడతారు. సిమెటిడిన్ అనే మాత్రల వాడకం వల్ల త్వరగా ఉపశమనం కలుగుతుంది. కానీ వీటిని వైద్య పరీక్షానంతరం, సలహా మేరకు వాడవలసి ఉంటుంది. □




ఆంధ్రా : తెలుగుచిత్ర కంబైన్సు, సంగీతం: విజయభాస్కర్ దర్శకత్వం: ఎస్.పి.ముత్తురామన్

# దేదీప్య

## కంచుమర్తి వెంకటేశ్వరరావు

### 5

పరీక్షలు దగ్గరవడంతో అవంతి, దేదీప్య చదువుల్లోపడ్డారు. పరీక్షలయ్యేవరకు పెళ్లి ప్రసక్తి ఎత్తలేదు బలరాం. పరీక్షలయ్యాయి.

రెండు నెలలు గడిచాయి.

అమ్మాయి నచ్చింది. తాంబూలాలు తీసుకోడానికి మంచిరోజు మీరు వ్రాస్తే వస్తామని అప్పటికే రెండు ఉత్తరాలు వ్రాసారు వాళ్లు. ఉత్తరం వచ్చినప్పుడల్లా ఇంట్లో గొడవ తప్పడం లేదు. పరీక్షలని, ఆరోగ్యం బాగాలేదని ఇలా ఏదో ఒక సాకు వ్రాస్తూ వాయిదా వేస్తున్నాడు బలరాం.

అవంతిని ఎలాగైనా ఒప్పించాలనుకున్నాడు. అతనిలో మొండివైఖరి ప్రవేశించింది.

''అవంతీ... ఇప్పటికీ వాళ్లు రెండు ఉత్తరాలు వ్రాసారు. మనకు దగ్గరవాళ్లు, మంచివాళ్లు కాబట్టి మన సంబంధం వదులుకోవడం ఇష్టంలేక అన్నిసార్లు అడుగుతున్నారు. మన నిర్ణయం ఇప్పటికైనా చెప్పడం మంచిది. నేను ఈ సంబంధం ఖాయం చేస్తున్నాను. రేపే వాళ్లకు లెటరు వ్రాస్తాను తాంబూలాలు పుచ్చుకోడానికి, ముహూర్తాలు చూపించడానికి రమ్మని.''

తండ్రి మాటలకు అడ్డుపడింది అవంతి.

''నాన్నా, ఇదివరకే నా నిర్ణయం చెప్పాను. దయచేసి ఈ విషయమై మరోసారి అడగవద్దు.''

అవంతి పట్టుదల విడువలేదు.

''అవంతీ ... ఇంతవరకూ ఆచారాలు, వ్యవహారాలు, సాంప్రదాయాలు దాటని కుటుంబం మనది. వాటిని ఇంతవరకు పదిలంగా కాపాడుకుని వస్తున్నాను. వాటిని ఈ వేళ నీవు కాలరాచి గౌరవానికి అప్రతిష్ట తెస్తే చూస్తూ సహించను.

### (గత సంచిక తరువాయి)

మన కులం వాడిని ప్రేమిస్తే సంతోషంగా అంగీకరించేవాడిని. అంతేగానీ ఎవడినో ప్రేమించి వాడితోనే పెళ్ళి జరిపించాలంటే భరించలేను. నీ తర్వాత దేదీప్య పెళ్ళి చేయాలి.''

బలరాం ఎన్ని రకాలుగా చెప్పినా అవంతి తన నిర్ణయం మార్చుకోలేనని ఖచ్చితంగా చెప్పేసింది.

''అవంతీ... ఆఖరిసారిగా చెబుతున్నాను. ఈ సంబంధానికి నువ్వు ఒప్పుకుని తీరాలి. లేదా కాళ్ళు కట్టయినా సరే ఈ పెళ్ళి జరిపిస్తాను.'' అన్నాడు బలరాం గట్టిగా.

అప్పుడే బయట నుండి పరుగెత్తుకుంటూ లోపలకు వచ్చింది. ఆ రోజు టెన్త్ క్లాస్ రిజల్ట్సు వచ్చాయి. దేదీప్య ఫస్టు క్లాసులో పాసైంది. ఈ విషయం చెప్పడానికి ఎంత సంతోషంతో వచ్చిందో అంత నీరుకారిపోయింది.

అమ్మా, నాన్న అక్కమీద విరుచుకు పడుతున్నారు.

అక్క శూన్యంలోకి చూస్తూ నిలబడి ఉంది.

ఎలా చెప్పాలి ? భయం వేసింది దేదీప్యకు నాన్న అవతారం చూసి.

అయినా చెప్పాలి.

''నాన్నా... నేను ఫస్టు క్లాసులో పాసయ్యాను '' అంది నెమ్మదిగా దేదీప్య పేపరు అందిస్తూ.

''ఆఁ ఉద్ధరించావు. కొడుకులు లేరని మిమ్మల్ని అల్లారుముద్దుగా పెంచితే మీరు మాకే ఎదురు తిరిగి మీదారి మీరు చూసుకుంటున్నారు. పెద్ద చదువులు చదివించి మంచి సంబంధాలు చూసి పెళ్ళిళ్ళు చేసి అబ్బాయిల్లేరనే బాధ మరచిపోదామని మీమీద ఎన్నో ఆశలు పెట్టుకున్నాం. అమ్మాయిలు ఆణిముత్యాలని సంబరపడి మీ అచ్చటా ముచ్చటా చూసి సరదా పడాలన్న ఎన్నో కలలు కన్నాం. వాటిని కన్నీటి పాలు చేసి మమ్మల్ని అసమర్థులుగా తయారు చేస్తున్నారు. ఈరోజు నీ అక్క... రేపు నువ్వూ అంతే. అంతా మా ఖర్మ. కొడుకులు లేరనే బాధకంటే మీరే ఎక్కువ బాధకు గురి చేస్తున్నారు.''

పేపరు దేదీప్య మీదకు విసిరి వెళ్ళిపోయాడు బలరాం.

దేదీప్య అలాగే నిలబడిపోయింది.

అవంతి నెమ్మదిగా దేదీప్య దగ్గరకువచ్చింది.

''దేదీప్యా...''

అక్కపిలుపుతో తేరుకున్న దేదీప్య అవంతిని కౌగలించుకుని ఏడ్చేసింది.

ఆ సాయంత్రం దేదీప్యను తీసుకుని బజారుకు వెళ్ళింది. దార్లో హోటలుకు తీసుకెళ్ళి దేదీప్యచేత స్వీటు తినిపించి సినిమాకు తీసుకెళ్ళింది.

ఆ రోజంతా అక్క దగ్గరే కబుర్లు చెబుతూ నిద్రపోయింది.

### 6

రెండ్రోజులు తర్వాత బయటకు వెళ్ళిన అవంతి చీకటి పడినా ఇంటికి రాలేదు. రాత్రి తొమ్మిదయింది.

''ఏవండీ... అవంతి ఇంకా రాలేదు.''

అంది పార్వతమ్మ భయంగా.

బలరాం ఆ రాత్రంతా తిరిగాడు అవంతి కోసం... తెలిసిన అవంతి స్నేహితురాళ్ళింటికి వెళ్ళి అడిగాడు. ఎవరికీ తెలియదు అవంతి ఎక్కడకు వెళ్ళిందో...

ఏ అర్ధరాత్రో ఇంటికి వచ్చాడు బలరాం.

పార్వతమ్మ, దేదీప్య వరండాలోనే కూర్చుని వున్నారు.

''ఏవండీ... అవంతి కనిపించిందా.''

''లేదు'' అంతకంటె మరేం చెప్పలేక పోయాడు బలరాం.

పార్వతమ్మ ఏడుపు మొదలు పెట్టింది.

''ఇదేం ఖర్మరా భగవంతుడా. చెట్టంత కూతురు ఎక్కడకు వెళ్లింది. నలుగురికి తెలిస్తే ఏమనుకుంటారు.''

నాలుగు రోజులు గడిచాయి.

అవంతి జాడ తెలియలేదు.

**జరిగిన కథ—1 :** బలరాం, పార్వతమ్మల రెండవ కూతురు దేదీప్య. స్కూల్లో అక్క పోలికలతో నున్న పాపను చూస్తుంది దేదీప్య. ఏడేళ్ల క్రిందట ఇల్లువదిలిన అక్క అవంతిని గురించి తెలుసుకోవాలనే ఆశతో శిరీషకు ట్యూషన్ చెప్పను అంగీకరిస్తుందామె.

అప్పటికీ కొందరడిగారు పెద్దమ్మాయి ఏదని.

ఏం చెబుతుంది ?

''చుట్టాలింటికి పంపించాం.'' అంటూ సర్ది చెబుతుంది.

నెల రోజులు గడిచాయి.

అవంతి జాడ తెలియలేదు.

దేదీప్య కాలేజీలో చేరింది.

బలరాం, పార్వతమ్మ అవంతి వెళ్ళినప్పటి నుండి బెంగగా ఉంటున్నారు. కొందరు చాటుగా అవంతి గురించి అంటున్న మాటలు పార్వతమ్మ చెవిలో పడ్డాయి.

''పెళ్ళి కావలసిన పిల్లను ఎన్నాళ్ళు చుట్టాలింట్లో ఉంచుతారు.''

''ఆఁ మనకు అలాగే చెబుతారు. ఆ అమ్మాయిని ఒకబ్బాయితో ఒకసారి మావారు సినిమాహాలులో చూసారట, వాడితో లేచిపోయి ఉంటుంది.''

''లేచిపోదు మరీ... ఆ మధ్య అమ్మాయిని చూడ్డానికి ఎవరో వచ్చారు కదా...నేనుచేసుకోను మొర్రోమంటూ గోల పెట్టింది. ఆ తండ్రి బలవంతంగానైనా ఈ పెళ్ళి చేస్తాడని వాడితో లేచిపోయింది.''

సూటి పోటి మాటలు పార్వతమ్మ గుండెకు తగిలేవి.

నెలలు, సంవత్సరాలు గడుస్తున్నాయి.

అవంతి జాడ తెలియలేదు.

''అవంతి దూరమవ్వడానికి కారణం మీరే''

బాధ కలిగినప్పుడల్లా పార్వతమ్మ భర్తమీద విరుచుకుపడేది. బలరాం భార్యను ఓదార్చేవాడే తప్ప మరేం మాట్లాడేవాడు కాడు.

దేదీప్య డిగ్రీ పాసయింతర్వాత కాన్వెంటులో టీచరుగ చేరింది.

కాలం ఎ వ రి కో స మూ ఆగదు. విధి నిర్వహణలో తనకు తానే సాటంటూ ముందుకు సాగిపోతూ నే ఉంది.

## 7

గతంలోంచి వాస్తవానికి వచ్చిన దేదీప్య టైము చూసింది.

పదకొండు గంటలయింది.

దేదీప్య అక్క ఫొటో చేతుల్లోకి తీసుకుంది.

శిరీష రూపం, నవ్వులు కళ్ళముందు మెదిలాయి.

అక్కా ...

బాధగా గుండెల కదుముకుంది ఫొటోను.

ఏ అర్ధరాత్రో నిద్రపట్టింది.

*    *    *

స్కూలు నుండి శివప్రసాద్ గారింటికి బయలుదేరింది దేదీప్య. ఆరోజు శిరీష స్కూలుకు రాలేదు.

దారంటా ఆలోచనలన్నీ శిరీష గురించే.

శిరీషలో కొట్టొచ్చినట్లు కనబడుతున్న అవంతి పోలికలు.

శిరీష అవంతి కూతురా...కాదా...

ఈ నిజం తెలుసుకోవాలి. ఎలా ?

కారు హారను వినబడడంతో ప్ర క్క కు తప్పుకుంది.

దేదీప్య ప్రక్కన కారాగింది.






నెల్లూరు 'కళాప్రియ' ఆధ్వర్యంలో పద్మశ్రీ వేదాంతం సత్యనారాయణ బృందంవారి 'భామా కలాపం' నృత్య ప్రదర్శన సందర్భంగా జరిగిన సభలో ప్రసంగిస్తున్న శ్రీ శర్మ, ముఖ్య అతిథి సబ్ జడ్జి శ్రీ నారాయణరెడ్డి, సంస్థ అధ్యక్షుడు శ్రీ పి. వెంకటరావు, కార్యదర్శి శ్రీ ఎం. శంకర్ ప్రసాద్‌గార్లని చిత్రంలో చూడవచ్చు.

---

శివప్రసాద్ నవ్వుతూ డోరు తెరిచాడు రండన్నట్లు.

దేదీప్య రెండు క్షణాలు ఆలోచించింది ఎక్కాలా వద్దాని. అప్పటికే కొందరి చూపులు వాళ్ళమీద పడడం గమనించిన దేదీప్య మాట్లాడ కుండా కారులో కూర్చుంది.

''దేదీప్యగారూ ... శిరీష మిమ్మల్ని చాలా పొగిడింది. లెసన్స్ బాగా చెబుతున్నారని.''

శివప్రసాద్ మాటలకు దేదీప్య మాట్లాడ లేదు.

కారును స్వీటు స్టాలు దగ్గర ఆపి స్వీట్సు కొన్నాడు.

''ఇంటి కెళ్లేటప్పుడు ప్రతిరోజు మా శిరీషకు స్వీట్సు తీసుకెళ్లడం నా అలవాటు.''

తనే చెప్పాడు కారును పోనిస్తూ.

దేదీప్య చూపులన్నీ రోడ్డుమీదే ఉన్నాయి.

శివప్రసాద్ మధ్య మధ్యలో దేదీప్యను చూస్తున్నాడు.

ఏమిటీ ఈ మొద్దావతారం ఒక మాటా లేదు మంతీ లేదు అనుకున్నాడు శివప్రసాద్.

ఇంటికెళ్ళేసరికి శిరీష నీట్‌గా తయారయి కూర్చుంది.

దేదీప్య కాఫీ త్రాగింతర్వాత లెసన్స్ ప్రారంభించింది.

ఒక గంటయింతర్వాత శివప్రసాద్ మేడ మీంచి క్రిందకు వచ్చాడు. తెల్లటిలుంగీ, లాల్చీ.. కండలు తిరిగిన శరీరం... విశాల వక్షస్థలంపై దట్టంగా అలుముకున్న వెంట్రుకలు అతని మగసిరిని చాటి చెబుతున్నాయి.

పేపరు చదువుతూ కూర్చున్నాడు.

దేదీప్య ఓరకంట అతన్ని చూసింది.

మరిక అక్కడ ఉండలేకపోయింది.

గబ గబ లెసన్స్ చెప్పి వస్తానంటూ లేచింది.

# ''దేదీప్య''

''జస్ట్ వెయిట్ మిమ్మల్ని డ్రాప్ చేస్తాను.''

శివప్రసాద్ మాటలకు వెళ్లగలనని చెప్పి బయటపడింది.

## 8

ఆదివారం

దేదీప్య స్నేహితురాలు సరళ ఇంటికి బయలుదేరింది ఉదయం. సరళ కాన్వెంటులో టీచరు. సరళ ఎవ్వరితోనూ ఎక్కువ మాట్లాడదు. ఎప్పుడూ ఏదో ఆలోచిస్తూ కూర్చునే సరళను మాటల్లోకి దింపి రిలీఫ్ నిచ్చేది దేదీప్య.

సరళ అదొక తరహా మనిషంటారు చాలా మంది. ఆమెగురించి రకరకాలుగా చెప్పుకుంటారు. మెడలో మంగళసూత్రం ఆమె కు పెళ్లయిందనే నిజం చెబుతుంది. అయితే సరళ ఒంటరిగా ఉంటుంది. స్కూల్లో టీచరుగా చేరి సంవత్సరమైంది.

సరళ భర్త ఎక్కడున్నాడు ?

ఎందుకు ఒంటరిగా ఉంటుంది ?

ఇటువంటి విషయాలపై చుట్టుపక్కల అమ్మలక్కలు అప్పుడప్పుడు చర్చించుకోవడం సరళకు తెలుసు.

ఎవరేది అడిగినా ఓ నవ్వు విసిరి తలవంచుకుని వెళ్లిపోయే సరళ మనస్తత్వం ఎవరికీ అర్థమయ్యేది కాదు.

సరళను అందరూ దూరంగా ఉంచేవారు. కారణం సరళ నల్లగా ఉంటుంది. ఆమె ముఖంలో కాస్తంత కళ తప్ప మరే అందం లేదు. అందంగా లేని సరళ పట్ల ఎవరూ ప్రేమ చూపించేవారు కాదు. ముక్తసరిగా రెండు ముక్కలు మాట్లాడి తప్పించుకునేవారు తోటి మేడమ్‌లు.

అందమైన అమ్మాయి పట్ల ఈ సభ్య ప్రపంచం ఎంత మూర్ఖంగా ప్రవర్తిస్తుందో తలచుకుంటే బాధ కలుగుతుంది.

ఈ అందం ఎందుకు? నలుగురి కళ్లల్లో, మాటల్లో పడడానికే. మనస్ఫూర్తిగా ప్రేమించ లేరు. వాళ్లకు కావలసింది అందం. పై మెరుగులకు భ్రమపడి వలలు విసురుతారు. గేలాలు వేస్తారు. తమ వైపు లాక్కోడానికి ప్రయత్నిస్తారు.

వలలో పడిన తర్వాత చేతిలో ఘుముడ్చుకుని ఆ అందాన్ని ఆస్వాదించి వదలివేస్తారు. మరో అందం కనబడగానే దారి మళ్లిస్తారు.

అందంగా ఉంటే ఒక నష్టం...అందంగా లేకపోవడం కూడా ఈ గ్రుడ్డి ప్రపంచంలో నష్టమే. పై రంగులకు మురిసిపోయే ప్రపంచం అందంగా లేనివారిని సూటిపోటి మాటలతో అవహేళన చేస్తుంది.

అందం లేకపోవడం మన తప్పా ?

అందంగా పుట్టడం మన గొప్పా ?

ఆలోచిస్తూనే ఇంటిదగ్గరకు వచ్చింది.

సరళ గురించి తెలుసుకోవాలి.

సరళను ఓదార్చాలి అనుకుంది దేదీప్య.

సరళ కుర్చీలో ఒక ఫోటోను దీక్షగా చూస్తూ కూర్చుంది.

'సరళా'

దేదీప్య పిలుపుకు ఉలిక్కిపడి ఫోటోను టేబిల్లో పెట్టి రా దేదీప్యా అంది సరళ.

''ఏమిటి చాలా సీరియస్‌గ ఆలోచిస్తున్నావు.''

''ఏముంది ఆలోచించడానికి.''

అలా ఒక్క మాటతో సంభాషణ త్రెంచే సిందేగాని సరళ బుగ్గలమీద ఉన్న కన్నీటి చారికలు చాలాసేపటి నుండి ఏడ్చిందన్న నిజం చెబుతున్నాయి.

''సరళా... నీలో నువ్వే ఎందుకలా బాధ పడతావు. మనకున్న బాధలను ఆప్తులైనవారికి చెప్పుకుంటె కొంత ఉపశమనం కలుగుతుంది. అంతేగాని సమస్యలను మనలోనే ఉంచుకుని కుమిలిపోతుంటే పరిష్కారాలు దొరుకుతాయా.''

''నా కెవరున్నారు. పుట్టించిన భగవంతుడే అన్యాయం చేసాడు. అందం చందం ఇవ్వకుండా అనాకారిగా పుట్టించాడు. చాదస్తాల పేరుతో నా బ్రతుకును చిన్నప్పుడే నాశనం చేసారు అమ్మా, నాన్న. అందంగా లేనని అందరూ దూరంగా ఉంచారు నన్ను. జరగరానిది జరిగింది. దానివలన ఆనందం కాక ఆవేదనను సంపాదించాను. కొంత వయసు వచ్చేసరికి ఏ లోపం వలన నన్ను దూరంగా ఉంచారో తెలుసుకున్నాను. అనాకారితనాన్ని పోగొట్టుకుని కొత్త అందాన్ని ఎలాగూ సంపాదించలేను. చదువుకుంటె కొంత దగ్గర కావచ్చునని చదువులో పడ్డాను. ఈ రోజు చదువు, ఉద్యోగం ఉన్నా నా అనే వారందరికి దూరమయ్యాను. నా కెవ్వరున్నారు... ఎందుకు బ్రతకాలి.''

**R. SUDHIR**
Sales Executive

**CONCOMP LTD**
No. 9003, M.G. Road, Bangalore
Telephone : 145862, Telex : 0345-7502

# సుధీర్ తెలుసుగా... ఇప్పుడు ఇతడు శ్రీ సుధీర్, సేల్స్ ఎక్జిక్యూటివ్!



మీ మొదటి ఉద్యోగం. హర్షించి, గర్వించతగ్గ గొప్ప క్షణాలు. మొదటి-మొదటి సంపాదన తెచ్చే సంతోషం. మీరు ఇప్పుడు ఒక క్రొత్త వ్యక్తి. చక్కటి వాచ్ కొనాల్సిన సమయం ఇదే. మీరు పెట్టే డబ్బుకు తగిన విలువ అందించే వాచ్. అదే హెచ్ఎమ్టి వాచ్. కొని గర్వించవలసిన సమయం.

హెచ్ఎమ్టి నచ్చినది ఎంచుకోడానికి వీలుగా 120 కంటే ఎక్కువ మోడల్స్ అందిస్తుంది. విశ్వసనీయం. సుదృఢం. ఖచ్చితం. సమయ సూచనలో ఉత్కృష్టం.



**ఉద్యోగంలో ముందుకు రావడానికి మంచి తోడు.**

వాచ్ డివిజన్




దేశానికి సమయాన్ని సూచించువారు
ఫ్యాక్టరీలు
బెంగళూరు(I & II)
శ్రీనగర్, తుంకూరు

**hmt వాచ్‌లు**
**అందులో ఒకటి మీకోసమే ప్రత్యేకం.**

CLARION/HMT/84196/TEL







# "దే దీ ప్య"

సరళకు ఏడుపు ఆగలేదు.

దేదీప్య సరళ తలను లాలనగా నిమిరింది.

"సరళా...అందరూ అందంగాపుడతారా... అందంగా ఉన్న అందరిలోనూ అంత అందమైన మనసు ఉంటుందా... చూడు. నీకు ఎవరూ లేరని నువ్వనుకుంటున్నావు. బంధువులకన్నా నిజమైన ఆత్మీయతను కురిపిస్తారు స్నేహితులు. నువ్వు లేరనుకుంటే నేను లేనట్లే."

నిష్టూరంగా అంది దేదీప్య.

ఆ మాటకు చలించిపోయింది సరళ.

సరళ రెండు చేతుల్తో దేదీప్యను పట్టుకుంది.

"దేదీప్యా... నువ్వలా అనవద్దు. నా బాధలో ఏదో అనేసాను. నాకు నీ కంటె మంచి ఆప్తులు ఎవరూ లేరు. నేను బాధలను మరచిపోయి అప్పుడప్పుడు నవ్వగలుగుతున్నానంటే నీ వలనే. నీ స్నేహం కూడా లేకపోతే నా బ్రతుకు మరీ దుర్భరమయ్యేది" అంది సరళ.

"అయితే...నీ బాధ ఏమిటో చెప్పు."

దేదీప్య మాటలకు మధ్యలోనే అడ్డు పడింది సరళ.

"ఆదివారం నా కథ చెప్పి నీకు బోరు కొట్టించను. ఈ రోజు నువ్వు ఇక్కడే భోంచేయాలి. ఇద్దరం సినిమాకు వెళదాం."

సరళ మాటలకు కాదనలేకపోయింది దేదీప్య.

కాఫీ త్రాగింతర్వాత వంట చేసారు ఇద్దరూ.

కబుర్లు చెప్పుకుంటూ భోంచేసి రిక్షాలో సినిమాకు వెళ్ళారు.

టికెట్ బుకింగు దగ్గరకు వెళ్ళింది సరళ.

గోడమీద ఉన్న బొమ్మలను చూస్తూ నిలబడింది దేదీప్య.

"టీచర్." శిరీష పిలుపు.

వెనక్కు తిరిగి చూసింది.

శివప్రసాద్ శిరీషను నడిపించుకుని వస్తున్నాడు. దేదీప్య చూసి శిరీష అతని చేతులు విడిపించుకుని దేదీప్య దగ్గరకు వచ్చింది.

టిక్కెట్టు తీసుకొని వచ్చిన సరళ శివప్రసాద్‌కు నమస్కరించింది.

"శిరి ఒకటే గోల సినిమాకు తీసుకెళ్ళమని. అరే! నిలబడిపోయారు. పదండి లోపలకు."

అని బుకింగు దగ్గరకువెళ్ళి టిక్కెట్లు తీసుకుని వచ్చాడు.

నలుగురూ లోపలకు వెళ్ళారు.

శివప్రసాద్ ప్రక్కన శిరీషను కూర్చోబెట్టి తర్వాత దేదీప్య, సరళ కూర్చున్నారు.

సినిమా చూస్తున్నంతసేపు శిరీష ఏవో ప్రశ్నలు వేస్తూనే ఉంది. ఓపిగ్గా జవాబులు చెబుతుంది దేదీప్య. మధ్య మధ్య శివప్రసాద్ చూపులు తనవైపు మళ్ళడం గమనించకపోలేదు దేదీప్య.

తల్లి పిల్లలకు జోలపాట పాడే సీనది. తల్లి ఊయల ఊపుతూ కమ్మగా పాడుతుంటె పాప ఆ పాటకు మురిసిపోతూ, కేరింతలు కొడుతూ నెమ్మదిగా నిద్రపోయింది.

శిరీష ఆ దృశ్యాన్నే చూస్తుంది.

ఆ చిన్న మనసులో చిన్న ఆలోచన కలిగింది.

"డాడీ... నన్నుకూడా మమ్మీ అలా ఊయలలా ఊపి పాట పాడిందా... మరి మన ఇంట్లో మమ్మీ లేదేమిటి."

అప్రయత్నంగా శిరీష అడిగిన ప్రశ్నకు శివప్రసాద్ ముఖం పాలిపోవడం అంతచీకట్లోనూ స్పష్టంగా కనిపించింది దేదీప్యకు.

అతను జవాబుకోసం చెవులు రిక్కించింది. అతని నుండి ఆ ప్రశ్నకు జవాబువస్తే తన ఆరాటానికి కొంత ఉపశమనం కలుగుతుంది. శిరీష అవంతి కూతురా... కాదా... అన్న విషయం తెలుసు ంది.

చాలాసేపటి వరకు శివప్రసాద్ నుండి జవాబు రాలేదు.

ఇంతలో ఇంటర్వెల్ ఇవ్వడంతో బయటకు వెళ్ళిపోయాడు. ఆలోచనలన్నీ ఆ ప్రశ్న గురించే. సరళ ఏదో మాట్లాడుతుంది గాని దేదీప్య ఆ, ఊ తప్ప మరేం మాట్లాడడం లేదు.

బయట నుండి శివప్రసాద్ డ్రింక్సు పంపించాడు. సినిమా ప్రారంభమైన పది నిముషాలకు లోపలకు వచ్చాడు.

సినిమా చూడటంలో లీనమైన శిరీష మళ్ళీ అడగలేదు.

శివప్రసాద్ మాట్లాడలేదు.

నిరాశ కలిగింది దేదీప్యకు.

కొంతసేపటికి శిరీష చిటికెన వేలు చూపిస్తే దేదీప్య చిన్నగా నవ్వి బయటకు తీసుకుని వెళ్ళి వచ్చింది.

ఆ చీకటిలో దేదీప్య కాలు శివప్రసాద్ కాలుమీద పడింది.

చివుక్కున తలెత్తి చూసాడు.

చూపులు కలిసిన ఆ చీకటిలో కూడా దేదీప్య కళ్ళల్లో కాంతిరేఖలు స్పష్టమయ్యాయి.

"సారీ..." అంది దేదీప్య.

నవ్వి ఊరుకున్నాడు శివప్రసాద్.

సినిమా అయింతర్వాత బయటకు వస్తూ దేదీప్య, సరళను కారులో డ్రాప్ చేస్తానన్నాడు.

థేంక్స్ చెప్పి రిక్షా ఎక్కారు.

సరళను ఇంటి దగ్గర దిగబెట్టి ఇంటి కెళ్ళింది దేదీప్య.

"ఏంటమ్మా... ఉదయమనగా వెళ్ళావు. ఇప్పుడా రావడం."

వరండాలోనే అడిగాడు బలరాం.

"సరళతో సినిమాకు వెళ్ళాను నాన్నా." అంది దేదీప్య.

**(ఇంకా ఉంది)**

**ఎం. ఎస్. ఆర్. – సాలూరు**

మగవాడి పతనానికి కారణం స్త్రీ అంటాను నేను. అది నా అనుభవం కూడానని చెప్తున్నాను.

★ అలా చెప్పండి. ప్రతివారూ స్వీయానుభవమే కొలబద్దగా ఆలోచించి- యిలాంటి స్టేట్‌మెంట్లు పారేయరు!

**కె. ఆర్. ఎస్. – దువ్వ**

నేను ఎవంతోనూ అతిగా మాట్లాడను. అంతా నాకు గర్వం అని విమర్శిస్తారు.

★ అతిగా కాదు మితంగానేనా చిరు- నవ్వుతో పల్కరించడం- సభ్యత.... మాట్లాడాలి. కాని అతిగా అనవసరపు విషయాలు వదిలేయాలి.

**తాజున్నీసా – చల్లపల్లి**

స్త్రీ కోరుకునేది- కట్నం తెచ్చే కోడల్ని.

★ కాదు. సవితి రాకూడదని!

**ఎం. బి. ఆర్. – గుంతకల్లు**

సగం తెలుగు సగం యింగ్లీషు మాట్లాడువారిని ఏమని గౌరవించవలెను.

★ నన్ను గౌరవించినట్లే !!

**అనంత – మచిలీపట్నం**

అనుభవం గొప్పదా? అనుభూతి గొప్పదా?

★ అనుభవం క్షణికం. అనుభూతి శాశ్వతం. కాదా?!

**కె. వి. ఎల్. – పూళ్ల**

నవ్వే ఆడదాన్నీ ఏడిచే మగవాడిని నమ్మకూడదంటారెందుకు ?

★ నవ్వుతూ యీమెగారూ ఏడుస్తూ ఆయనగారూ కొంపలు ముంచకలరని !

**కె. వి. ఎస్. పి. – శ్రీశైలంప్రాజెక్టు**

ఆరోగ్యమే మహాభాగ్యం అనే పాత సామెత అందరికీ ఎలా వర్తిస్తుంది- డబ్బున్నవాడే ఆరోగ్యవంతుడు కదా?

★ పొరపాటు. డబ్బున్నవాడికే రోగా- లెక్కువ! సన్నపడాలని రాగి గంజి తాగు- తున్నా నంటే- మా డాక్టరేమన్నారో




తెలుసా? 'రాగి గంజి తాగి రోజంతా ఎండలో కూలి పని చేస్తారు జనం తెలుసా? దానికి అంత పోషక శక్తి వుంది' అన్నారు. ఆరోగ్యం డబ్బులో లేదు. శరీర- తత్వంలోనూ, తినే తిండిలోనూ వుంది.

**పి. యు. ఎమ్. – కాశీబుగ్గ**

ఐ హేట్ యు, అనేవారి చేతనే ఐ లౌయూ అని అనిపించుకుంటే థ్రిల్ వుంటుంది కదూ ?

★ ఏమో- మళ్లీ ఐ హేట్ యు అనవద్దా?!

**వై ఆర్. – ఉయ్యూరు.**

నేనొక అమ్మాయిని ప్రేమించాను. ఆ అమ్మాయి గాఢంగా ప్రేమించింది. ఇద్దరం సరదాగా షికార్లకూ సినిమాలకీ తిరిగాం. జీవితాన్ని పంచుకోవాలను- కున్నాం- కాని 'మా అమ్మ నాన్న ఒప్పు- కోడం లేదు- నన్ను మర్చిపో' అంది...

★ శుభం. మరిచిపోండి హాయిగా. షికార్లూ సినిమాలూ తిరగడాలూ- చేయడానికి ముందే- మీ అమ్మ నాన్నల మనస్తత్వాలు మీరు గ్రహించే ప్రయత్నం చేయరా?

**నాయుడు – హెన్నూరు**

సృష్టిలో మరువలేనిది, జీవితాంతం వుండేది స్నేహం అని నా అభిప్రాయం. మరి మీరు ?

★ రోజులు మారాయి. స్నేహాలకీరోజు కారణాలుంటాయి. అవసరాలుంటాయి. చిన్ననాటి స్నేహాలు- మరిచిపోలేనివి. ఎప్పుడో ఎక్కడో మిగిలిపోతూ వుంటాయి. అవి చాలా అపురూపం- అందుకే.

**కె. టి. ఎస్. – హౌరా**

నేటి సినిమాల కారణంగా యువ లోకం చెడిపోతోందంటాను- నిజమేనా?

★ చెడిపోయిన యవలోకాన్నే- సినిమాలో చూపించే ప్రయత్నమేమోనని ఎందుకనుకోరు? సినిమాల్లేకపోతే యువలోకం చెడిపోదని గ్యారంటీ వుందా?!

నేటి కొత్త సినిమాలపై మీ అభి- ప్రాయం.

★ చూడ్డం మానేశాను. □

**చిత్తూరులో జూపిటర్** బాలానంద కేంద్రంవారి ఆధ్వర్యంలో జరిగిన రాష్ట్ర స్థాయి **నృత్య పోటీలలో** ప్రదర్శించిన "శ్రీ పద్మావతీ శ్రీనివాస కళ్యాణం" సంగీత **నృత్య** నాటకంలో ఒక దృశ్యం.



# దసరా అల్లుడు...

పెళ్ళి పందిరిలో పురోహితుడు అలసి పోయేలా మంత్రాలు చదువుతున్నాడు. పీటలమీద కూర్చున్న త్రినాధరావు కళ్ళలోను, త్రిపుర సుందరి కళ్ళలోను సంతోషం, ఆనందం వగైరా, వగైరా, కొట్టవచ్చినట్లు కనబడుతున్నాయి.

నవ వధూవరుల సంతోషానికి కారణం లేక-పోలేదు.

'నీ పెళ్ళి కళ్ళారా చూడకుండానే కన్ను మూస్తాను ఏమిటో రా నాన్నా!' అని కలవరిస్తూనే తల్లి కళ్ళు మూసినా, తను కలలు కంటున్నట్లు అయినింటి లక్షాధికారి మహేశ్వరరావుగారి అల్లుడే అయ్యాడు అని త్రినాధరావులో ఆనందం చోటు చేసుకుంటే, నాన్న వచ్చిన సంబంధాలన్నీ కాదు, కూడదు పొమ్మంటు-న్నాడు వేనికా అనుకున్నా అత్త, ఆడపడచు పోరు లేని నెలకి మూడు వేలు సంపాదించుకుంటున్న త్రినాధరావుతో పెళ్ళి జరిపించడం మహానందంగా ఉంది త్రిపుర సుందరికి.

"ఆ! కడుగు బాబు! బాగ కడుగు. బావగారి కాళ్ళు ఎంత బాగ కడిగితే అంత కట్నం ఇస్తారు" అన్న పురోహితుడి హాస్య ఛలోక్తులతో ఈ లోకంలోకి వచ్చి పడ్డాడు త్రినాధరావు.

మేనత్త అయిన మహాలక్ష్మి "త్రిరు!... బావ మరిదికి కంచంలో నూట పదహార్లు వెయ్యరా బాబు" అని మేనత్త అనడం చూసి వళ్ళు మండిపోయింది త్రినాధరావుకి.

అయ్యో! నా మతి మండ! మా త్రిరు పెద్ద ఆఫీసరుకదూ? అలాంటి, అలాంటి వాడి పెళ్ళి ఏమిటి? అన్నయ్యే బ్రతికివుంటే ఎంత ఘనంగా చేసేవాడో. త్రిరు రెండువందల పదహార్లు వెయ్యరా" అంది గర్వంగా మరోసారి మహాలక్ష్మి, ఇంకా త్రినాధ-రావుకి మొదటిసారి వచ్చిన కోపం పోకుండానే.

బావమరిది భార్గవ కళ్ళు చేటంత చేసుకుని, పళ్ళెంలో బావ ఎంత వేస్తాడా అని చూస్తున్నాడు

త్రినాధరావుకి ఒక్క నిముషం ఏం చేయాలో తోచలేదు. తక్కువ వేస్తే పిసనారి వాడని ఎక్కడ కనిపెడ్తారో జనం అని "అది కాదత్తా.... నాన్న చెబుతు, చెబుతూనే పోయారు గుర్తుందా?"

మన ఆనవాయితీ ప్రకారమే చేసుకోరా పెళ్ళి, నేను మా బావమరిదికి అర్ధ నూట పదహారు వేసానురా త్రిరు అనేవారు" అని చప్పున జేబులో నుండి అర్ధ నూట పదహార్లు వేసాడు త్రినాధరావు.

"ఒక్క నిముషం మేనత్త మహాలక్ష్మికి మేనల్లుడు ఏం చెబుతున్నాడో అర్థం కాలేదు. అన్నయ్య ఆనందరావు పెళ్ళిలో బావ మరిదికి ఏం వేసాడా అన్న ఆలోచనల్లో పడిపోయింది. పాపం ఆవిడకు ఎంతకు గుర్తు రాలేదు. అప్పుడు ఆవిడకు మేనల్లుడి పిసినారితనం గుర్తు వచ్చి "ఓరి భడవా? ఘటికుడివే" అనుకొంది మనసులో!

మహాలక్ష్మి ఈ ఆలోచనల్లో ఉండగానే మూడు ముళ్ళు త్రినాధరావు త్రిపుర సుందరి మెడలో వేసాడు.

*    *    *

గదిలో అమ్మ లక్కలు త్రిపుర సుందరి కొంగుకి తులం బంగారం అయినా కట్టమనేటప్పటికి త్రినాధ-రావు గుండె ఆగినంత పని అయింది.

త్రిపుర సుందరి మాత్రం కొంటెగా త్రినాధరావు వంక చూడసాగింది.

అక్కడ చేరిన అమ్మ లక్కలు పెళ్ళి కొడుకు త్రిపుర సుందరి కొంగున ఎంత కడతాడా అని ఆత్రుతగా



చూస్తున్నారు.

"అత్తా! చెప్పవేం! అలా చూస్తావేం? అమ్మ నీతో ఎప్పుడు చెప్పేది గుర్తు లేదూ? మాకు ఆనవాయితీ లేదు బాబు కొంగున బంగారం కట్టడం, మా అమ్మ వాళ్ళు కొంగున బంగారం కట్టవద్దు అంటున్న మా అత్తగారు ఐదు తులాల బంగారం కొంగున కట్టారు. మా వాళ్ళందరూ పుణిస్త్రీ చావులే, నేను మాత్రం కలకాలం మీ నాన్నతో కాపురం చేయకుండా, బోడి ముండను అయ్యాను అని చెప్పి బాధ పడుతుండేది-

కదూ?" అని త్రినాధరావు అంటుండగానే....

త్రిపుర సుందరి కెవ్వున అరచి తన పొడవైన వాలు జడను ముందుకు వేసుకొని ప్రేమగా నిమురుకొని నా కొంగున బంగారం కట్టద్దూ" అని పిచ్చి ధ్వనిలా అరచి వెనక్కి నాలుగు అడుగులు వేసింది.

అక్కడ చేరిన అమ్మ లక్కలు మాత్రం ఇదెక్కడి విడ్డూరం అని విస్తుపోసాగారు.

"అయ్యో! అల్లుడుగారు! ఇంకానయం! మీకు బాగానే గుర్తుంది లేని అనవాయితీలు చేస్తే చెరుపు అపుతుంది. పోనీ ఆకు, చెక్క కట్టేయండి" అంది అత్తగారు ఆదిలక్ష్మి.

మేనత్త మహాలక్ష్మి మాత్రం వదిన వరలక్ష్మి ఎప్పుడు తనతో చెప్పిందాఅని ఎంత గుర్తు తెచ్చుకున్నా గుర్తు రాలేదు అంతలోనే ఆవిడకు మేనల్లుడి పిసినారితనం గుర్తు వచ్చి 'ఒరి సన్నాసి ఎంత లేసి అబద్దాలు ఆడుతున్నావ్' అని గుండెల-మీద చెయ్యి వేసుకోకుండ ఉండలేక-పోయింది.

కాపురానికి పంపిస్తున్న కూతురు త్రిపుర సుందరితో అత్తగారు బయలుదేరడం చూసి మతి పోయింది త్రినాధరావుకి.

గున్నఏనుగులాంటి అత్తగారిని చూస్తుంటే అవిడ క్రింద రోజు ఎంత ఖర్చు అవుతుందో... ఆవిడ మకాం ఇంట్లో ఎనాళ్ళు వేస్తుందో అని కంగారు పడిపోసాగాడు త్రినాధరావు.

గవర్నమెంటు ఇచ్చిన బంగళా, భర్త పేరు త్రినాధరావు ఎక్సిక్యూటివ్ ఇంజనీరు అన్న నేమ్ ప్లేటు చూడగానే త్రిపురసుందరికి ఎక్కడలేని గర్వం వచ్చేసి చప్పున తల మీద కొమ్ముల బయలు దేరాయి.

అత్తగారు ఆదిలక్ష్మి మాత్రం కూతురు అదృష్టానికి తెగ మురిసిపోయి, భారీ శరీరాన్ని భారంగా లాక్కుంటూ బంగళాలోకి భారంగా ప్రవేశించారు.

ఒక్కొక్క గది చూసుకుంటూ లోపలికి వస్తున్న అత్తగారు, త్రిపుర సుందరి వైపు కొంచెం ఇబ్బందిగా చూడసాగాడు త్రినాధరావు.

హాలులో రెండు ఏనాటివో తాతలనాటి వాలు కుర్చీలు, తరువాత డైనింగ్ హాలులో గోడకు చేరబెట్టి నాలుగు పీటలు, అటు ప్రక్కనే రాగి బిందెతో నీళ్ళు, లైఫ్‌బాయ్ సబ్బు, కాల్గేట్ పళ్ళపొడి, వంటింట్లో డొక్కు కిరసనాయల్ స్టౌ, నాలు సీమ వెండి గిన్నెలు, స్టీలు కంచాలు, చూసి అత్తగారికి, త్రిపురసుందరికి మతి పోయింది.

నెలకి మూడు వేలు సంపాదించుకుంటున్న భర్త మరీ ఇంత పిసినారితనంగా ఉండడం చూసి ఆశ్చర్య మనిపించింది

"రా సుందూ! ఇది మన బెడ్ రూమ్!" అని చూపెడు-తున్న గదిలో పూర్వం కాలం నాటి పందిరి కోళ్ళ మంచం దగ్గర కుర్చీ వేసి, మంచం ఎక్కడానికి ఉండడంతో, కెవ్వున కేక వేసింది త్రిపుర సుందరి!

"ఏమయిందే అమ్మా!" అని గాభరగా ఆయాస



ండుతూ వచ్చిన తల్లిని పెన వేసుకొని 'చూడే అమ్మా, ఈ మంచం, ఎంత ఎత్తుగా ఉందో' అని కోపంగా ర్త వైపు చూసి "ఛీ! మీరు ఇంత పిసినారులు ఏమిటి? దీనిమీదా మనం పడుకోవడం! అమ్మో! నాకు ళ్ళు తిరుగుతాయి" అంది భయంగా!

"సుందూ! నాకు సెలక్షన్‌లు అంత బాగ తెలియవు, ఆడ వాళ్ళకి బాగ తెలుస్తాయి కదూ? నువ్వు చ్చినాక, నీకు నచ్చినవే కొనవచ్చు అని, అవీగాక ఈ ంచం తర తరాలనుండి అచ్చొచ్చిన మంచం" అని త్రినాధరావు అంటుండగానే....

"మై గాడ్! ఆ మాట మాత్రం అనకండి. సాయంకాలం బజారుకి వెళ్ళి డబుల్ కాట్ కొనుక్కుందాం" అంది త్రిపుర సుందరి.

త్రినాధరావు పై ప్రాణాలు పైనే పోయినాయి. "లేదు సుందూ! మీ నాన్నగారు అమ్మాయిని తీసుకొని వెళ్ళి, సెలక్షన్ చేయించి ఇంటికి కావలసిన సామానులు కొని, పంపిస్తాను తరువాత అని పెళ్ళికి ముందరే నాతో చెప్పారు.... అప్పుడు నీకు ఏ సామానులు కావాలంటే అవి కొనుక్కో హి. హీ" అన్నాడు పళ్ళు ఇకిలిస్తూ త్రినాధరావు.

ఆదిలక్ష్మికి ఎక్కడలేని కోపం వచ్చింది. కూతురంటే ఎంత ఇష్టమయితే మాత్రం సామానులు కొని ఇవ్వడం దగ్గర నుండి ఒప్పుకున్నారన్నమాట తన భర్త. ఇంకా నయం! ఇల్లరికం వచ్చి నెత్తిమీద

# దసరా అల్లుడు

సవాలు చేస్తానని అల్లుడు అంటే అందుకు తగుదునమ్మా అని ఒప్పుకునేవాడేమో తన భర్త! అనుకొంది.

*　　*　　*

కొత్త పెళ్ళాంతో రోజులు హుషారుగా గడుస్తున్నా అత్తగారు ఆదిలక్ష్మి తీరని సమస్యయి కూర్చుంది త్రినాధరావుకి... తను ఒక్కడు ఉన్నప్పుడు నెలకి నాలుగు వందలు కూడ ఖర్చు కానిది నెలకి వెయ్యి రూపాయలు ఖర్చు అవుతుంటే ప్రాణం గిల గిల కొట్టుకుంటుంది త్రినాధరావుకి. సినిమాకి బయలు దేరినా, షికారుకి బయలు దేరినా అత్తగారు బయలు దేరుతుంటే రెండేసి రిక్షాలలో వెళ్ళడం. ఒకవేళ ప్రభుత్వ వాహనంలో బయలు దేరినా అత్తగారికి సినిమా టిక్కెట్టు తీయడానికి త్రినాధరావు మనసంగీకరించడంలేదు.

"ఏమండీ! అప్సరలో 'అపరాధి' సినిమాకి వెళదాం అండి" అనేటప్పటికి ఆలోచనలనుండి ఈ లోకంలోకి వచ్చాడు.

"ఈ రోజు టి. వి. లో పిక్చరుంది కదూ? రేపు వెళదాంలే సుందూ! అన్నట్టు అత్తయ్యగారు లేకపోతే మావయ్యగారికి ఇబ్బంది కదూ? పాపం మన కోసం ఎన్నాళ్ళు ఆవిడను ఉంచుకుంటాం?" అన్నాడు బాధను వీలయినంత వరకు పైకి వ్యక్తం చేస్తూ త్రినాధరావు.

"అయ్యో! మీరు అనవసరంగా మా నాన్నగారి గురించి బాధ పడకండి. మా నాన్నగారికి ఏం లోటు ఉండదు. కావలసినంత మంది పనివాళ్ళు.... అమ్మో! మా అమ్మ లేకపోతే వంట ఎవరు చేస్తారండి. నాకు చేత కాదు" అంది త్రిపురసుందరి భయంగా గుండెలు మీద రెండ చేతులు వేసుకొని.

భార్య మాటలు వింటుంటే వళ్ళు మండిపోయింది". అయితే మీ అమ్మగారు మన కూడ ఎప్పుడూ...." అని త్రినాధరావు మాట పూర్తి కానే లేదు.

"ఉండమని బ్రతిమిలాడు తున్నానండి" అంది గారం పోతూ త్రిపుర సుందరి.

త్రినాధరావుకి మతిపోయినంత పని అయింది.

*　　*　　*

"సుందూ! రేపు సాయంకాలం మనం మైసూరు వెళ్ళడానికి రిజర్వేషను చేయించాను బట్టలన్నీ సర్దు" అన్నాడు.

"అబ్బా! మీరు.... మీరు.... ఎంత మంచి వారండి. మీ గురించి ఏమిటో అనుకున్నాను. అసలు మా ఊరిలో అందరు మీ గురించి ఎంత హేళనగా మాట్లాడేరో తెలుసాండి? లక్షలు పోసి తెసినారి అల్లుడిని తెచ్చుకున్నావు ఏమిటి మహేశ్వరరావుగారు అని! మా అమ్మకి ఈ సంగతి తెలిస్తే పొంగి పోతుంది.

ఏమిటో నే ఎంత ఆసి_ ఉన్నా ఏ ఊరులు చూడడం పడలేదు. నీతోనయిన ఆ కోరిక తీరాలి. పెద్ద పిల్ల ఎంత రమ్మని వ్రాసినా అంత దూరం ఏం వెళతానూ అంటుందండి" అని సంతోషంతో చెంగున గెంతతూ వెళ్ళబోతున్న భార్యని "సుంధూ!" అని కంగారుగా చేయి పట్టుకున్నాడు.

"ఏమిటండి!" అంది.

"అబ్బే! ఊరు వెళుతున్నాది మన ఇద్దరం! ఆ ఫీసు పని కదూ? పై మనుష్యులు ఎవరిని ఎలౌవ్ చేయరు" అన్నాడు

"అయితే మా అమ్మండీ" అంది బాధగా!

మీ అమ్మగారిని ఈ రోజు మీ ఊరు వెళ్ళే బస్సు ఎక్కించేద్దాం! మనం ఊరి నుండి వచ్చాక తీసుకు రావచ్చు!" అన్నాడు.

కూతురు చెప్పినది విని ఆదిలక్ష్మికి వళ్ళు మండిపోయింది. ఎంత ఆఫీసు వాళ్ళు పంపిస్తే మాత్రం. ఇంకో మనిషి టిక్కట్టు కొని ట్రైన్ ఎక్కితే వద్దంటరా వాళ్ళు అన్న ఆలోచన రావడమే తడవుగా 'హరి నీ పిసినారితనం నాశనం అయిపోను. కన్న వాళ్ళు కూడ లేకుండా ఒంటరిగా ఏకాకీ బ్రతుకు బ్రతుకుతున్న వాడికి మనుష్యుల మీద ప్రీతి, అభిమానం ఎక్కడనుండి వస్తాయిలే. అయ్యో!ఎంత అవమానం' అని తెగ బాధ పడిపోయాగావిడ

తల్లిని బండి ఎక్కించి వచ్చిన త్రినాధరావుని చూసి "ఏమండీ మైసూరులో ఈ కాలంలో చలి ఎక్కువగా ఉంటుంది అనుకుంటాను. రెండు స్వెట్టర్లు కొనండి" అంది త్రిపుర సుందరి.

"అలాగే కొందాం! ఉండు మా ఆఫీసుకి వెళ్ళి రిజర్వేషను ఎంత వరకు వచ్చిందో కనుక్కొని వస్తాను" అని బయలు దేరాడు త్రినాధరావు!

"పాపం అమాయకురాలు సుందు! మైసూర్ ప్రయాణం నిజం అనుకుంటుంది. గున్నటేనుగులా అత్తగారు అర్థ శేరు పాలలో కాఫీ పొడి వేసుకొని, కాఫీ త్రాగుతుందా? మంచి ప్లాన్ వేసి పంపేసాను అని హాయిగా ఊపిరి పీల్చుకున్నాడు త్రినాధరావు.'

కూని రాగం తీస్తూ ప్రయాణానికి బట్టలు సర్ద సాగింది త్రిపుర సుందరి.

* * *

"సుందూ! మన ప్రయాణం కేన్సిల్ అయింది" అని నవ్వుకుంటూ చెబుతున్న త్రినాధరావుని చూస్తుంటే వళ్ళు మండిపోయింది త్రిపుర సుందరికి.

"ఏమిటి మీరు చెబుతున్నది? కేన్సిల్ ఏమిటి? అమ్మో! మీరు... ఎంత పిసినారులు. ఖర్చులు కూడ అవుతాయని.. ." అని కోపంగా అంది.

"లేదు సుందూ! . . నేనేం కేన్సిల్ చేయలేదు ... నాకన్న సీనియర్‌ని పంపుతున్నారు. వచ్చే ఏడు మనం వెళదాం అయినా అలా కోపం తెచ్చుకుంటావు ఏమిటి? ఇన్నాళ్ళకి ఇంత ఇంటిలో మనం ఇద్దరం మన మధ్యన ఎవరు లేకుండా? ఓహ్! వ్వాట్ ఏ లక్!.... అయినా సుందూ? కాశ్మీరు వెళ్ళినా, కొడై-కెనాల్ వెళ్ళినా. ఊటీ వెళ్ళినా.. నీతో గడిపిన క్షణాల ముందు ఆ ప్రయాణాలు ఏపాటి?" అని త్రిపుర సుందరి చెయ్యి పట్టుకొని దగ్గరకు తీసుకో-బోయాడు త్రినాధరావు.

"ఛీ!.... ముందు మీరు చేయి వదలండి. . ఇది అంతా మీ ప్లాన్ అయి ఉంటుంది: మా అమ్మను పంపించడానికి" అని అలిగి మంచం ఎక్కి పడుకొంది త్రిపుర సుందరి

* * *

"ఏమండీ! మిమ్ములనే! నన్ను మా ఇంటికైన పంపించండి. లేకపోతే మా అమ్మను వెళ్ళి తీసుక రండి వెధవ వంట నాకు చేత కాదు" అని కూర దించుతుంటే గిన్ని తగిలి కాలిన చేయి వంక చూసి కళ్ళ నీళ్ళు పెట్టుకుంది త్రిపుర సుందరి

"సుందూ! బంగారు సుందరివి కదూ? మీ అమ్మ-గారు ఎందుకు? నేను . నేను... నీకు సహాయం చేయనా? చూడు వాళ్ళు ఎలా చూస్తున్నారో? ఆ వంట ఇంటి కిటికీలు మూసేయ్ ఐదు నిముషాలలో అయిపోతుంది వంట" అన్నాడు

ఒక్క నిముషం అయోమయంగా త్రినాధరావు వంక చూసి మీరు... మీరు ... సహాయం చేస్తారా? ఛీ!... ఛీ! .. ఎవరైనాచూస్తే నవ్వుతారు ఒక వంట మనిషిని పెట్టకూడదూ? మా నాన్న సర్వ భోగాలు అనుభవించే ఇంటికి కోడలిని చేస్తాను అన్నారు మీ సంబంధం కుదిరినాక మీ ఆయన పెద్ద ఆఫీసరు... కుర్చీలో కాలు మీద కాలు వేసుకొని కూర్చోవడమే నీ పని.... ఇంటి నిండా నౌకర్లు ఉంటారు.... నా బంగారు తల్లి అదృష్టవంతురాలు అన్నారు కాని ఇక్కడ ఇలా బాధ పడుతున్నాను అని ఆయనకు తెలియదు" అని కళ్ళ నీళ్ళు పెట్టుకుంది త్రిపుర సుందరి

"సుందూ! ఇప్పుడేం తక్కువయింది నీకు వంట చేయడం అంతగా చేతకాకపోతే మంచం మీద పడుకొని పత్రిక చదువుకో! ఒక్క అర గంటలో వంట చేస్తాను" అని లుంగీ పైకి ఎగ్గట్టి వంట చేయడానికి సిద్ధమవుతున్న భర్త వంక ఆశ్చర్యంగా చూసి "మీకు వంట చేయడం చేతనవునా?" అంది.

"ఇదేం బ్రహ్మ విద్య అనుకుంటున్నావా?" అని సొరకాయ చక చక తరిగి స్టవ్ వెలిగించి "సుందూ! పాలు పోసి కూర వండనా? దప్పళం చేయనా" అని అడుగుతున్న భర్త వంక చూస్తుంటే.... భర్తలా కాకుండా వంట వాడిలా కనిపించాడు త్రిపుర సుందరి కళ్ళకు.

చేత్తో నుదురు మీద కొట్టుకొని 'ఇదెక్కడి కర్మరా బాబు' అనుకొంది మనసులో త్రిపుర సుందరి

* * *

"సుందూ!... సుందూ!" అని హుషారుగా పిలుస్తూ వస్తున్న త్రినాధరావు వైపు కోపంగా చూసి ..

"సుందూ లేదు .. సందూ లేదు.... ఏం పెట్టక పోయినా ఇదొక్కటి మాత్రం నేర్చుకున్నారు.... నా పూర్తి పేరు పెట్టి పిలవండి...." అని కయ్‌మంది త్రిపుర సుందరి.

"ఏమిటోయ్! కోపంగా ఉన్నావ్. మంచి వార్త ఏమిటో చెప్పనా.... మనం మధ్యాహ్నం బండికి ఉరు వెళుతున్నాం" అన్నాడు.

కోపాన్ని ఒక్కసారి మరచిపోయి, "ఏ ఊరు" అంది.

"మీ ఊరే.... ఏకంగా ఇరవై రోజులు శెలవు పెట్టే-సాను" అన్నాడు.

"నిజంగానా?" అంది సంతోషంతో!"

అంతలో పోస్టుమెన్ అందించిన కవరు అందు-కున్నారు త్రినాధరావు, త్రిపుర సుందరి.

చిరంజీవి అల్లుడు త్రినాధరావుగారికి,

చిరాయువుగా దీవించి మావయ్య మహేశ్వరరావు వ్రాయునది మీ ఇరువురు సుఖంగా, హాయిగా ఉన్నారని తలిచెదను. మా పెద్దమ్మాయి అనురాధ ఫారిన్ నుండి వచ్చినది వచ్చిన దగ్గర నుండి మీ





**తిరుమల తిరుపతి దేవస్థానంవారు వినాయకచవితి సందర్భంగా తిరుపతిలోని అన్నమాచార్య కళామందిరం ప్రాజెక్టు అధికారి శ్రీ కామిశెట్టి శ్రీనివాసులు నిర్వహణలో జరిగిన భక్తి సంగీత కార్యక్రమంలో పాల్గొన్న కళాకారులు శ్రీయుతులు బాలకృష్ణ ప్రసాద్, రామనాథన్, ఉదయశంకర్, లోకాభిరాం ప్రభృతులని చిత్రంలో చూడవచ్చు.**

పంపతులను చూడాలని ఆశ పడుతున్నది మీ అత్తగారు ఆదిలక్ష్మి కూతురుమీద బెంగతో మంచం దిగడం లేదు. కావున, మీరిరువురు వెంటనే బయలు-దేరి రండి దసరా పండుగ కూడ దగ్గర పడుతున్నది కదా? పండగకి వచ్చినట్టు ఉంటుంది, మీ రిద్దరు కొద్ది రోజులు మాతో సరదగా గడిపినట్టు ఉంటుంది. అమ్మాయికి నా ఆశీస్సులు.

ఇట్లు
మహేశ్వరరావు

"చూసావా లెటర్! ఇంకేం! దసరా పండక్కి అల్లుడికి పిలుపు కూడ వచ్చేసింది...." అని "సుందూ! నేను స్నానం చేయడానికి వెళుతు-న్నాను .... అన్నట్టు ఒక్క మాట. నా గురించి ఎవ్వరైనా వస్తే మాత్రం నువ్వు .... నువ్వు..." అన్నాడు.

"ఏమిటండీ" అంది భర్త మాటలు అర్థం గాక.

"అబ్బే!... ఏం లేదు సుందూ! శలవు ఐదు రోజుల-కంటే దొరక్క పోతే.... నీ కోసం..... అదే నువ్వు మీ ఊరు వెళితే ఎంతో ఏడుస్తావని.... మీ అమ్మగారి పరిస్థితి బాగా లేదని, టెలిగ్రాం వచ్చిందని చిన్న అబద్ధం చెప్పి ఇరవై రోజులు శలవు పెట్టేసాను. అందుకని ఎవరైనావస్తే మీ అమ్మకు బి. పి. చాలా ఎక్కువై పరిస్థితి బాగా లేదని నువ్వు కూడా...."

"ఏమండీ!" అని గట్టిగా అరచింది త్రిపుర సుందరి.

"ఛీ!.... ఛీ!.... లీవు లేకపోతే పోయింది. అవేం మాటలు" అంది కోపంగా. అప్పటికే త్రినాధరావు బాత్ రూమ్‌లోకి దారి తీశాడు.

భలే బాగ తప్పించుకున్నాడు. దసరా మాముళ్ళ నుండి. లెకపోతే ప్రొద్దున్న లేచి ఆఫీసుకి వెళ్ళే వరకు వెధవలు ఒకటే దణ్ణాలు! ఎందుకో అనుకున్నాడు. తీరా సీటులో వెళ్ళి కూర్చున్నాక ఒకొక్క యూనియన్ వర్కర్సు ఒకొక్క లిస్టు తయారు చేసి "దసరా మామూళ్ళకు నాలుగ రోజుల్లో బయలు దేరుతాం సార్" అని లిస్టు తనకి చూపెడతారా?

ఆఫీసర్సు లిస్టులో ఏకంగా వంద రూపాయల-నుండి యాభై రూపాయల వరకు దసరా వమూళ్ళు వ్రాసి ఉంది. తేరగా డబ్బు వస్తుంటే తీసుకోవడం చేదు ఏమిటి? సిగ్గు లేకపోతే సరి! ఎంత లేదన్నా ఇంట బయట దసరా మామూళ్ళు ఐదారు వందలు దాటుతుంది. సార్! మీరు ముందుగా మీ చేత్తో దసరా మామూళ్ళు ఇస్తే ఇక బయలు దేరుతాం సార్ అంటరా? అందుకే ఏకంగాఇప్పటినుండి శలవు పెట్టే-సాడు. ఏ అక్కు పక్షి ఇక తనని అడగలేదు.

బాత్ రూంలో నుండి వస్తున్న త్రినాధరావుకి హాలులో ఘొల్లున్న ఏడుస్తున్న భార్య త్రిపుర సుందరి గొంతు వినిపించింది.

"అయ్యో! బాధ పడకమ్మా! నాకు ఇప్పుడే తెలిసింది. పెళ్ళయి ఇంకా ఎంత కాలమో కాలేదు, సంతోషంగా దసరా పండుగకి వెళ్ళవలసింది. అయినా మా ఆఫీసు వాళ్ళం దుర్గాదేవిని గ్రాండ్‌గా పెడుతున్నామని మీ కొత్త దంపతులను దసరాకి ఇక్కడే ఉండమందాం అనుకున్నాం. అమ్మగారికి కాలు, చేయి పడిపోయిం-దట కదూ? ఎంత ఘోరం అని తనపై అధికారి గొంతు వినిపించి అవాక్కయిపోయాడు త్రినాధరావు.

"అవునండి.. నాకు చాలా భయంగా ఉంది మా అమ్మగారి గురించి" అని బలవంతాన్న దుఃఖాన్ని తెచ్చుకొని కళ్ళ వెంట నీరు తెచ్చుకోవడానికి ప్రయత్నిస్తూ "అమ్మో! ఎంత పెద్ద అబద్ధాలు ఆడారు. ఉండండి మీ పని చెబుతాను" అని కసిగా అనుకొంది మనసులో త్రినాధరావు గురించి త్రిపుర సుందరి

బస్సులో అలిగి అటు తిరిగి కూర్చున్న భార్యని చూస్తుంటే నవ్వు వచ్చింది త్రినాధరావుకి.... 'ఎంత సేపు ఉంటుంది కోపం పుట్టి నిల్లు చూడగానే పోదూ' ఉరుకున్నాడు

అల్లుడు, కూతురిని చూడగానే ఆదిలక్ష్మి, మహేశ్వరరావు, అనురాధలు పొంగిపోయారు.

"బావ నీకు, మీ ఆయనకు బట్టలు, వాచీలు పంపారో" అని త్రిపుర సుందరికి తెచ్చి ఇచ్చింది అనురాధ

* * *

దసరా పండగొచ్చింది.

క్రొత్త అల్లుడికి క్రొత్త బట్టలు.... క్రొత్త వెరయిటీ స్వీట్సుతోను.... గౌరవం చేసారు అత్తవారు.

"అల్లుడుగారూ! ఉత్తరంలో స్కూటరు కొన-నక్కరలేదు. దసరా వచ్చినప్పుడు స్కూటరు డబ్బు ఇచ్చేయండి. ప్రభుత్వ వాహనాల్లో సినిమాలకి, షికార్లుకి, బజార్లుకి వెళతాం, ప్రభుత్వ వాహనాలు ఉన్నంత కాలం మాకు ఏ ఇతర వాహనాలు అవసరం లేదని వ్రాసారు కదూ? ఇదిగోండి స్కూటరు డబ్బు" అని డబ్బు తెచ్చి అల్లుడి చేతిలో పెట్టి "నీ అమ్మ కడుపు బంగారం కాను, భగవంతుడు ఎలాంటి పిసినారి వాడిని నాకు అల్లుడు చేసాడు" అని మనసులో అనుకొని, "డబ్బు జాగ్రత్తగా పెట్టిలో పెట్టుకోండి అల్లుడుగారు" అన్నాడు మావగారు మహేశ్వరరావు ఏడ్వలేక నవ్వుతూ!

మొగుడు తనకు తెలియకుండా ఉత్తరం వ్రాసాడా? స్కూటరు వద్దు అని. ఆశ్చర్యపోతూ, అమ్మో! అమ్మో! ఎంత తెలివైనవాడు, రోజు రోజుకి మీ పిసిరినారితనం ఎక్కువయిపోతుంటే నేను చూస్తూ ఊరుకుంటాను అనుకున్నారా? ఉండండి మీ పిసినారితనం పోగొడతాను" అనుకొంది ఆవేశంగా త్రిపుర సుందరి.

# దుర్గ

సమ్మెలూరేగింపులు జరిపించు నాయకుల్
జనుల స్థితి గతుల జాలిఁ గనరు
పదవుల కోసమై పలుదార్లఁ బడు ప్రజా
ప్రతినిధులే ప్రజా వాక్కు వినరు
దుర్జన ఘాతుకాదులు మితి మీరినన్
బేలలౌ లోకులు మేలుకొనరు
దిక్కుతోచక యుంటిమి దేవి! దుర్గ!
ఎంత కాలము మము పరీక్షింతువిటుల?
కాళి! కరుణాంతరంగవై కదలి రమ్ము
ఇలను ధర్మ సంస్థాపన సలుపరమ్ము

—మహాబాష్యం న. శ్రీహరేష్

"సుందూ! దసరా వేషాలు వాళ్ళు వచ్చారు. భలే బాగ గెంతుతున్నారు. రా చూద్దాం" అని గదిలోకి వచ్చిన త్రినాధరావు మంచంమీద బోర్లా పడుకుని ఏడుస్తూ వెక్కిళ్ళు పడుతున్న త్రిపుర సుందరిని చూసి ఆశ్చర్య పోయి, "సుందూ! ఏమయింది" అన్నాడు కంగారుగా త్రినాధరావు.

త్రిపుర సుందరి ప్రక్కనే క్రొత్త చీర, జాకెట్టు పడేసి ఉంది.

"ఇంకా ఏం కావాలండి. జరగకూడనిదే జరిగింది. ఛీ!.... ఛీ!.... ఇంత అవమానం జరిగాక ఇంకా ఎందుకు బ్రతికి ఉన్నానో. నా భర్తని, నా ఊపిరిలో ఊపిరి.... నా ప్రాణంలో ప్రాణం. నాలో సగం అయిన మిమ్మలను అంతలేసి మాట లన్నాక ఇంకా నేను బ్రతికి ఉండడం వ్యర్థం" అని ఘొల్లుమని ఏడ్వసాగింది.

"సుందూ! నా బంగారం సుందూవి కదూ? నన్ను అన్న వాళ్ళు ఎవరు? వాళ్ళేంటే అన్నారులే!.... నువ్వు అలా ఏడవకు. నువ్వు అలా ఏడుస్తుంటే నా గుండె తరుక్కు పోతుంది" అన్నాడు బాధగా.

"ఇంకా ఏడుపు కాక ఏముందండి. ఈ రోజే పదండి మన ఇంటికి. ఇక ఈ ఊరి మొఖం చూడను. అయ్యోయ్యో! ఎంతంత మాటలు అన్నారు. అడిగితే అయిపోతుందా? తిడితే తీరిపోతుందా? మరచి పోదామంటే మరుపు వస్తుందా? మచ్చ పడి-పోయిందండి మీ మీద.... ఇంత అవమానం జరిగి-నాక ఇంకా నేను బ్రతికి ఉండడం అనవసరం" అని ఘొల్లుమని ఏడ్వ సాగింది త్రిపుర సుందరి.

అప్పటికే అక్క అనురాధ, అత్తగారు ఆదిలక్ష్మి, మావగారు మహేశ్వరరావుగారు 'త్రిపుర సుందరి తల్లీ! ఏం జరిగిందమ్మా" అని వాళ్ళు త్రిపుర సుందరి ఏడుపు చూడలేక ఘొల్లుమని ఏడ్వసాగారు.

"సుందూ!" అన్న వాళ్ళు ఎవరో చెప్పు' అన్నాడు ఆవేశంగా.

"దసరాకదా అని తలంటుకొని క్రొత్త చీర జాకెట్టు వేసుకొని, కొత్త రకం పిండి వంటలు పుస్తకం చదివి అక్కా, నేను కలిసి స్వయంగా చేసిన మైసూర్ హల్వా, గులాబ్ జామ్, జంతికలు, బందరు మిక్చర్, తొక్కుడు పకోడి, హల్వా పాయసం, చేసినవి పట్టుకొని మునసబు, కరణం గారింటికి వెళ్ళాను. వాళ్ళు.... వాళ్ళు...." అని ఘొల్లుమని ఏడ్వసాగింది.

"ఏమన్నారే వాళ్ళు! చెప్పమ్మా. మా బంగారు చెల్లివి కదూ" అంది అనూరాధ.

"ఇంకా ఏమనాలే అక్క! మా ఆయనకు మీ ఆయనకు నక్కకు నాగలోకానికి ఉన్నంత తేడా ఉందట. మీ ఆయన దర్జా ముందు, జల్సా ముందు, ధాన ధర్మాల ముందు మా ఆయన గడ్డి పరక అట. మగాడంటే మీ ఆయన అట! నీ కోసం.... నిన్ను సంతోష పెట్టడం కోసం ప్రతి పండగకి ఇండియా వస్తాడట. నువ్వు, మీ ఆయన దుర్గాదేవిని దర్శించు-

# దసరా అల్లుడు

కోవడానికి వస్తే చూడ ముచ్చటగా ఉంటుందట మీ జంట.... ఎంత అదృష్ట వంతురాలు మీ అక్క. ప్రతి దసరా పండగకి మెడలో కొత్త నెక్లేసు పెట్టు-కుంటుంది. పాపం నువ్వు చాలా దురదృష్టవంతు-రాలివి. మీ అక్కకి బంగారంలాంటి భర్త అయితే, నీకు పట్టి పిసినారి మొగుడు అయ్యాడు" అని, "ఏమ్మా!.... నిన్ను సరిగా చూసుకుంటాడా? పెళ్ళిలోనే అతని పిసినారితనం తెలిసిపోయింది. పండుగకి కొత్త చీర అయినా కొన్నాడా?" అని మునసబుగారి భార్య అంటే కరణంగారి భార్య వేళాకోళం చేయ-డానికి "మీ ఆయనను క్రొత్త నెక్లేస్ చేయించండి అని అడక్కపోయావా? పిసినారి మనిషి నిజం అనుకొని గుండె ఆగిపోగలడు" అని ఘొల్లున నవ్వి "మీ ఆయన పిసినారితనం పోవాలని దుర్గాదేవిని దణ్ణం పెట్టుకో" అని నవ్విందే అక్కా! ఇంత అవమానం జరిగాక ఇంకా నేను బ్రతికి ఉండడం ఎందుకే" అని ఘొల్లుమని ఏడ్వసాగింది త్రిపుర సుందరి.

"సుందూ! నువ్వు ఏడ్వవద్దు. నా గురించి ఇంత ఘోవరంగా అనుకుంటున్నారా? వాళ్ళందరి నోళ్ళు మూసేలా క్రొత్త నెక్లేసు కొంటాను తొందరగా తయారవ్వు నెక్లేసు పెట్టుకొని వాళ్ళందరి దగ్గర వెళ్ళు అప్పుడు నాగురించి ఏమంటారో" అన్నాడు ఆవేశంగా త్రినాధరావు పిసినారితనం మరిచిపోయి

"మరిదిగారు! ఇప్పుడిప్పుడే ఈ పల్లెటూళ్ళో నెక్లేసు ఎలా దొరుకుతుందండి. . దసరాకి అని మా ఆయన కొత్త నెక్లేసు నాకు ప్రజంట్ చేసారుకదూ? ఆ నెక్లేసు మీరు తీసుకోండి.... ఆయనకు నేను చెబు-తాను లెండి" అని గబ గబా లోపలికి వెళ్ళి నెక్లేసు పెట్టె తెచ్చి త్రినాధరావు చేతిలో పెట్టింది.

మూత తెరచి చూసాడు త్రినాధరావు.

తెల్ల రాళ్ళు ఒంటి పేట నెక్లేస్. దానికి జిగేల్ మంటు మెరిసిపోతు లాకెట్.... రాళ్ళు జిగ్ జిగ్ మంటూ మెరిసి పోతుంటే....

"అబ్బా ఎంత బావుందో నెక్లేస.... అక్కా థాంక్స్! నీ కని చేయించిన నెక్లేస్ నా కిచ్చేవు. నువ్వు ఎంత మంచి దానివే" అని నెక్లేసు పట్టుకుని తుర్రుమని లోపలికి పరిగెత్తింది త్రిపుర సుందరి.

"సుందూ! తొందరగా రా! నీ నెక్లేసు చూసి వాళ్ళందరి నోళ్ళు మూత పడి పోవాలి!" గంభీరంగా అన్నాడు త్రినాధరావు శరీరం దహించుకుపోతుంటే!

క్రొత్త చీర, జాకెట్టు వేసుకొని, రాళ్ళ నెక్లేసు పెట్టుకొని వచ్చి, "రండి... తొందరగా వెళ్దాం. దుర్గా దేవిని దర్శించి, మునసబు, కరణంగారి ఇంటికి వెళ్దాం! అంత లేసి మాటలంటరా? నా మొగుడంటే ఏమనుకున్నారో" అంది గర్వంగా త్రిపుర సుందరి.

"ఓసి పిచ్చి మొఖమా! నెక్లేస్ చూపెడితే సరిపోదే. మా అక్కతో ఫారిన్ నుండి మా ఆయన డైమండ్ నెక్లేస తెప్పించారు. మీ రందరూ పిసినారి వాడు అన్నారు.... మీ మొగుళ్ళు డైమండ్ నెక్లేస్ ఈ జన్మలో కొనగలరా? దీని ఖరీదు ఎంతో తెలుసా? పాతిక వేలు" అని దర్జాగా చెప్పు మరిదిగారి గురించి అంత నీచంగా అనుకుంటారా?" అని అంది అనూరాధ.

పాతిక వేలు అన్న శబ్దం వినగానే మూర్ఛపోబో యాడు త్రినాధరావు. "డైమండ్స్ నెక్లేసా? పాతికవేలే! ఇంకా తను రెండు వేలు ఉంటుందేమో తన మీద పడిన మచ్చ చెరిపివేసుకోవచ్చు అనుకున్నాడు. ఈ ఆపద నుండి తప్పించుకోవడం ఎలాగు?" అని ఆలో





మహేశ్వరుని వాత్సల్యం

తపస్సు చేసే వారికి బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు ముగ్గురూ వరాలు ఇవ్వడం ఉన్నది. ఆ త్రిమూర్తులలో శివుడు సులభుడు- తన్నెదిరించినా, నిందించినా కూడా, తర్వాత స్తుతిస్తే కోరిన వరం ఇస్తాడు. స్తుతులకు పొంగిపోవడం వల్లనే అతనికి ఉబ్బు-లింగడని పేరు వచ్చింది.

తన్నడ్డగించిన నందీశ్వరుణ్ని ఆక్షే-పించి, **రావణుడు** దురహంకారంతో, "నువ్వెంత? నీ ప్రభువైన ఆ మహేశ్వరు-డెంత? మీరున్న యీ కైలాసాన్నే తలక్రిందులుగా చేయగల సమర్థు-డను నేను!" అని నందీశ్వరునితో వాదించిన తర్వాత పలికి కైలాస పర్వ-తాన్ని చేతులలో ఎత్తివేయడానికి సిద్ధపడ్డాడు. ఆ దశగ్రీవుడు తన యిరవై చేతులనూ, ఆ పర్వతం క్రింద పెట్టి తన బలమంతా చూపి కదలించసాగి-నాడు. ఆ పర్వతం కొంత చలించింది. దాని చరియపై ఉన్న వృక్షాలు పడిపోయాయి. ఆ పర్వతం పై నివసిస్తున్న ప్రాణికోటికి ఎంతో భయం కలిగింది. పర్వత శిఖరం పయి, తన భర్త అయిన పరమేశ్వరుని ప్రక్కనున్న పార్వతీ దేవి భయంతో వణికిపోయింది. పరమేశ్వరుడు తర్వాత చలనానికి కారణం దురహంకార-పూరితుడైన రావణుని దుశ్చేష్టయే అని తెలుసుకుని, చిరునవ్వు నవ్వుతూ "నీవేమీ భయపడనక్కర లేదు" అని భార్యకు ధైర్యం చెప్పి, రావణునికి తగిన శాస్తి చెయ్యదలచి, తన ఎడమ కాలి బొటన వ్రేలితో, తానున్న చోటనే అదిమెను. దానికి, పర్వతము క్రింద-నున్న రావణుని చేతులు చితికి, బయటికి లాగి కొనుటకును సాధ్యము కాకుండెను. **అతని** గర్వము పూర్తిగా నశించెను. తన్ను రక్షింపవలెనని ఆ రాక్షసరాజు శివుని పెక్కు విధముల స్తుతించెను. ఆ స్తుతులకు పొంగి, మహేశ్వరుడు రావణుని అపాయము నుండి తప్పించి, వరము వేడుకొను-మని పలుకగా, రావణుడు తనకు చిర జీవితమును కోరెను. ఆ దేవ దేవుడట్లే వరమిలిచ్చి, "ఇదిగో! నీవు కోరిన వరమిచ్చుచున్నాను. కాని, నీవు అవినీతిగా ప్రవర్తించిన యెడల ఆ వరము ఫలించదు. అది తిరిగి మమ్మే చేరును!" అనెను.

ఆ రావణుడు అవినీతికి పాలుపడి వేదవతిని బలాత్కరించదలచుటచే ఆమె శాపమునకు గురియై, ఆమె రూపాంతరమగు సీతాదేవి కారణ-ముగా రామునిచే చంపబడెను.

**–బులుసు వేంకట రమణయ్య.**

చించి, "హ . హ . హ వదినగారు మీరు తీసుకోండి అక్కడకు వెళ్ళినాక కొంటాను. అయినాఎవరో ఏదో అన్నారని, అన్నయ్యగారు మీమీద ప్రేమతో చేయించిన నెక్లెస్ సుందూ తీసుకుంటే ఏం బావుం-టుంది?" అన్నాడు త్రినాధరావు....

"అయ్యో! మరదిగారు ఎంత అమాయకులండి మీరు. నేనేమైనా పరాయి దానినా.... నాన్న ఇచ్చిన స్కూటరు డబ్బు ఇప్పుడు ఇచ్చేయండి. మిగిలిన డబ్బు తరువాత ఇవ్వవచ్చు. మీరు, నా చెల్లెలు పరాయి వారటండి? ఆమాత్రం ఆగననుకున్నారా" అంది తెలివి తేటలు చూపిస్తూ అనురాధ.

"అబ్బబ్బ!.... ఏమిటండి మీ మొహమాటం!అక్కా! ఆయన గురించి గొప్పలు చెప్పుకోవడం కాదు గాని పరాయి సొత్తు అంటుకోవడం అంటే ఎంత అభిమానమో! మా అక్క చాలామంచిదండి, రండి, బయలుదేరుదాం" అంది గారాలు పోతూ త్రిపుర సుందరి

అప్పటికే త్రినాధరావు 105 ° డిగ్రీలు జ్వరం వచ్చిన వాడిలా అయిపోయాడు.

త్రినాధరావు, త్రిపురసుందరి బయలు దేరారు.

## దసరా అల్లుడు

దుర్గాదేవిని చూస్తూ భక్తితో త్రిపుర సుందరి కళ్ళు మూసుకొని దణ్ణం పెట్టుకో సాగింది.

"దుర్గాదేవి! నేను ఆడిన నాటకం విజయవంతం చేసావు ఆయనచేత నెక్లెసు కొనిపించడం నిజంగా ఒక గొప్ప కార్యం చేసినట్లే! పిసినారితనం వదిలి పోయింది..... "మనసులోనే అనుకొని.... నవ్వుకో సాగింది కళ్ళు మూసుకునే త్రిపుర సుందరి.

దుర్గాదేవికి చేతులు జోడించి దణ్ణం పెడు-తున్నా..... త్రినాధరావుకి దుర్గాదేవి బదులు పాతిక వేలు డబ్బు కనిపించ సాగింది.

దసరా ఉత్సవాలు జరుగుతున్నాయి

"ఏమండీ! ఇటు చూడండి! వాళ్ళు వేషాలు ఎంత బాగ వేస్తున్నారో? మాట్లాడ రేమిటండి" అంది త్రిపుర సుందరి.

"వాళ్ళందరి నోళ్ళు మూయిస్తాను అన్నాను గాని నా నోరు మూత పడిపోయింది" అనుకొని దసరా వేషగాళ్ళతో పాటు పిచ్చి పట్టిన వాడిలా అరుస్తూ, కేకలు వేస్తూ, నా పాతిక వేలు" అని అరవాలనిపిం-చింది త్రినాధరావుకి.... . కాని నోరు పెగలడం లేదు

ఇంటి దగ్గర .

"అమ్మా! నీ ప్లాన్ సక్సస్! పాపం! అల్లుడిని ఏలగా దెబ్బ తీసావ్" అంది నవ్వుతూ అనూరాధ!

"నీ పగ చల్లారిందా ఆదిలక్ష్మి..... పాపం! అల్లుడి పిసినారితనం వదిలిపోయింది...." నవ్వుతూ అన్నాడు మహేశ్వరరావు.

"ఆ.... అత్తగారు అని లేకుండా ఖర్చు అవుతుందని అబద్ధం ఆడి బస్సు ఎక్క-స్తాడా? అమ్మాయి అంతా చెప్పింది. ఆడంగక్కలా వంట చేస్తాడట. చేత్తో పది పైసలిచ్చి పూలు కూడా కొనడట స్కూటరు కూడ వద్దని డబ్బు తీసుకుం-టాడా? ఏది పిసినారితనం మంట కలసి పోను. దసరాకి అల్లుడు వచ్చాడు.... అమ్మాయికి చీర అయినా కొన్నాడా అంటే ఏం చెప్పను? ఇన్నాళ్ళు కాపురం చేసింది చేత్తో పది పైస లిచ్చి పూలు కూడ కొనలేదు. పని మనిషి బదులు అతనే అమ్మాయికి సహాయం చేస్తున్నాడు, పిసినారి అల్లుడు అని నలుగురికి చెప్పి నవ్వుల పాలు అవ్వమంటారా? అందుకే దసరా కొచ్చిన అల్లుడు పాతిక వేలు పెట్టి నెక్లెసు కొన్నాడు నా కూతురికి" అని గర్వంగా చెబుతాను....

"అత్తగారు ఆదిలక్ష్మి అంటే ఏమనుకున్నాడో అల్లుడు " అని పగలబడి నవ్వసాగింది □

# పిల్లలు వారి మానసిక ప్రవృత్తులు



డాక్టర్ (శ్రీమతి) జయానాగరాజ
మానసిక వేత్త

# పిల్లలు - దొంగతనాలు.....

**మా** నాయనే. ఎక్కడినుండి తెచ్చావు ....? ఎలా తెచ్చావు? అని నాలుగు మామిడి పిందెలు తెచ్చిన తన కొడుకు ప్రయోజకత్వానికి మురిసిపోతూ అడిగిన తల్లికి . "ప్రక్కింట్లో లేదూ మామిడి చెట్టు ... బళ్ళోనుంచి వస్తూవుంటే మెల్లిగా గోడెక్కి తెంపాను ఆయన తరుముకొచ్చాడు లే .... నే చేతికందకుండా పారిపోయి వచ్చాను ." అని




పేరుడిలా పోజుపెట్టి చెప్పే కొడుకును చూచి జీవితంలో "తప్పు ఒప్పు" అనే పదాలకు అర్థం చెప్పి తాను చేసింది మంచి పనికాదని, సంఘ విరుద్ధమని, చట్ట నిబంధనలకు వ్యతిరేకమని ఛక్కగా తెలియజేసేబదులు దొంగతనం చేసే కొడుకుని చూచి మురిసిపోతే "వంకాయలనాడు లేనిది వురి తీస్తున్నప్పుడు వచ్చిందా ...." అన్న కధలాగా వుంటుంది మన పిల్లల కథ కూడా. ప్రక్కింటి వారి మామిడికాయలనుంచి శ్రీన స్నేహితుల క్లాసు పిల్లల పెన్నులు పుస్తకాల వరకూ వచ్చిన దొంగతనం నాన్న జేబులోంచి అమ్మ ఆవాల డబ్బాలోని చిల్లరవరకూ ప్రాకిపోతుంది. చేతికందిన డబ్బుతో చెడు సహవాసాలు సినిమాలు, సిగరెట్లు, తనలాగే దొంగతనం చేసి తెచ్చిన డబ్బుతో జలసా, చేసేవారితో నేస్తం కలపడం జరుగుతుంది. దొంగతనం అలవాటు పడితే అదో వ్యసనం లాంటిది. చిన్నతనంలో నాంది పలికిన ఈ దొంగ అలవాటుకు శ్రీ కృష్ణ జన్మస్థానంలో మగళం పాడుతుంది మరి. అప్పుడు 'చేతులు కాలినాక ఆకులు పట్టుకున్నట్లు' ఏడుస్తే లాభముండదు చిన్నప్పుడు తెలియక తెచ్చిన వస్తువులను, అలా చేయరాదని చెప్పకుండా తియ్యకూడదని "స్వపర బేధాలు' నేర్పి ఆ తెచ్చిన వస్తువులను పిల్లల చేతే తిరిగి ఎవ్వరకు చెందుతుందో వారికి యిప్పించి వేస్తే చిన్నతనంలోనే ధర్మబుద్ధి (మోరల్ సెన్స్) ఏర్పడుతుంది మనకు చెందని వస్తువులు తేవడం తప్పనే గ్రహింపు కలుగుతుంది. పిల్లల పుట్టుకతో దొంగలు కారు .. దొంగల బిడ్డలు దొంగలూ కారు .. కాని "మీ నాన్న పచ్చి దొంగ ఇంక నీ కెటువంటి బుద్ధులొస్తాయి లే ." అనడంలో నిజంవుంది. అంటే ఆ బిడ్డ పెరిగే వాతావరణం కలుషితం .... ఇంగిత జ్ఞానంలేక చట్ట విరుద్ధంగా జీవించేవారు తమ బిడ్డలకు అదే నేర్పుతారు. చిన్న చిన్న ముంతలు గిన్నెల దొంగతనంనుంచి జేబులు కత్తిరింపువరకు. మరి దొంగ అలవాటనేది తల్లిదండ్రులు తెలియకో తెలిసో నేర్పినదేగాని వారికి స్వతహాగా వచ్చింది కాదుగా. దీనికి కూడా మరల క్రమ శిక్షణ యివ్వలేని తల్లిదండ్రులే కారణం □

**– (వైవారం :
పిల్లలు – అబద్ధాలు)**

సీరియల్

# శ్రావణి



మాడుగుల కృష్ణకుమారి

45

(గత సంచిక తరువాయి)

"హలో కైలాష్ ! మళ్ళీ ఇంత త్వరగా నిన్ను చూస్తాననుకోలేదురా" అని ఆనందంగా ఆహ్వానించాడు శ్రీహరి.

"ఒక్కడినేకాదురా ఈసారి నా శ్రీమతిని కూడా వెంటపెట్టుకుని మరీ వచ్చాను. పక్క ఫూరిలో తెల్సినవాళ్ళ పెళ్ళి అని వచ్చాం. ఇంత దూరం ఎలాగూ వచ్చాంకదా ఓసారి నిన్నుకూడా చూసిపోదామని ఇక్కడికి వచ్చాం. ప్రమీలా, వీడే నా ప్రాణమిత్రుడు శ్రీహరి. ఈవిడగారే, నా శ్రీమతి ప్రమీల. ఏమీ తోచనప్పుడు తెల్లకాగితాలు నలుపు చేస్తూండటం ఈవిడ హాబీ" అన్నాడు ఛలోక్తిగా ఇద్దరికి పరిచయం చేస్తూ.

సమయానికి అమ్మకూడా ఇంట్లోలేదు, కాఫీ తెస్తానని ప్లాస్కు తీసుకుని వెళ్ళబోతున్న అతనికి అడ్డుపడుతూ,

"ఎందుకండీ ? చిటికెలో నేను కాఫీ చేసుకువస్తాను" అని చనువుగా కొంగుదోపి వంటగదివైపు వెళ్ళింది ప్రమీల.

"అమ్మ ఎక్కడికి వెళ్ళింది ?" అన్నాడు కైలాష్.

"తన మాట వినలేదని కోపంవచ్చి యాత్రా స్పెషల్ వెడుతుంటే వెళ్ళింది."

పది నిముషాల్లో కాఫీ కప్పులు తెచ్చింది ప్రమీల.

"మొదటిసారిగా మా ఇంటికి వచ్చారు. ఇలా మీకు శ్రమ."

"అన్నయ్య ఇల్లు చెల్లెలికి పరాయిదెలా అవుతుంది చెప్పండి ?" అంది ప్రమీల.

ఆమెవైపు అభిమానంగా చూశాడు శ్రీహరి.

"మా ఆవిడ వరుసలు చాలా క్విక్‌గా కలుపుతుందిలే. ఎంతయినా రాసే చెయ్యికదు" అని నవ్వి ఎలా వుందిరా నీ బిజినెస్?" అన్నాడు.

"దానికేంరా. లాభాలు బాగానే వస్తున్నాయి. మరొక బ్రాంచ్‌కూడా ఓపెన్ చెయ్యాలనుకుంటున్నాం. ఎంత డబ్బు వచ్చి ఏం ప్రయోజనంరా. ఎవరికోసం ఇదంతా ? సంసారమే లేని నాకు సంపాదన ఎంత పెరిగితే మాత్రం ఏమిటీ. మగవాడి సంపాదన పెరుగుతుంటే ఇంటి ఇల్లాలి అదృష్టమంటారు. అనుభవించవల్సినవాళ్ళే లేనపుడు నాకు ఎంత డబ్బు వచ్చినా ఒకటే" అన్నాడు విరక్తిగా.

"బాధపడకురా మంచి రోజులు రాకపోవు."

"ఏదో నీ మిత్రుడినన్న అభిమానంతో అలా అంటావేకానీ, నా జీవితంలో ఆనందం కనుచూపుమేర కూడా కన్పడటము లేదురా."

"అలా వర్రీ అవకు శ్రీహరి. నిజంగా నీకు మీ ఆవిడ మీద అణు మాత్రం కూడా ప్రేమ చావలేదు. కేవలం ఉన్నదల్లా కోపం మాత్రమే. ఆరోజు ఆవేశంతో ఇంటి నుండి పంపావేకానీ ఆ క్షణం నుంచి ఆమె జ్ఞాపకాలను మరువలేక నువ్వుపడే మధన నేను గమనించలేదనుకోకు." అన్నాడు కైలాష్.

"అవును అన్నయ్యగారు శ్రావణి నిర్దోషి" అంది చటుక్కున ప్రమీల.

నీకెలాతెల్సునన్నట్లుగా చూశాడు శ్రీహరి.

"ఎంతయినా ఆడ మనసు కదు అందుకని అలా అంది." అని సర్దిచెప్పాడు కైలాష్.

"చూడండి నేను ఒక్కమాట చెపుతాను వినండి. పెళ్ళి కాకముందు ఏ ఆడపిల్లయినా జీవితం గురించి ఎన్నెన్నో కలలుకంటుంది. కానీ, తనకు పెళ్ళి నిశ్చయమయిందని తెల్సిన మరుక్షణం నుంచి ఆమె మనసులోని ప్రేమనంతా కాబోయే భర్తమీదనే నింపుకుంటుంది. మూడు ముళ్ళు పడ్డాక ఆ ప్రేమ, మరింత పటిష్టమవుతుంది. పెళ్ళికాకముందు ఎలాటి గతచరిత్ర వున్నా, అది మంచికానీ, చెడుకానీ ఏది జరిగినా, సరే ఏదోవేళలో భర్తకి చెప్పకుండా వుండదు. మంచి అయితే ముందే చెపుతుంది. ఏదన్నా చెడు జరిగితే,అదామె మనసులో అనుక్షణం కలచేస్తూనే వుంటుంది. ఎంత దాయాలనుకున్నా దాయలేదు. తనను ఎంతగానో ప్రేమించే భర్త సహృదయి తను గ్రహించిననాడుమాత్రం, అనుక్షణం తన మనసులోనే మెదిలే సంక్షోభాన్ని తప్పకుండా విప్పి చెప్పేస్తుంది. ప్రేమించే పుణ్యమూర్తిని, అన్యాయం చేస్తున్నానన్న మధన ఆమె అంతరాంతరాల్లోంచి పెల్లుబికివస్తుంది. పర్యవసానం ఏదయినాసరే అనుభవించక తప్పదని గట్టి నిర్ణయానికివచ్చి తెగేసి చెపుతుంది.

ఒక్కసారికానీ, ఒక్కరోజుకానీ, ఒక్క క్షణంగానీ మీరు శ్రావణి ఏ విషయానికయినా బాధపడుతున్నట్లుగానీ, అది మీకు చెప్పలేక తనలోతనే సతమత మవుతున్నట్లుకానీ మీకు ఎప్పుడయినా అన్పించిందా ?" అంది ప్రమీల శ్రీహరి ముఖంలోకి పరిశీలనగా చూస్తూ.

"లేదు. పెళ్ళయినది మొదలు నా ఇంటికి వచ్చాకఎప్పుడుశ్రావణిఒకేలావుండేది. పుట్టింట్లో ఏమోకానీ శ్రావణి నా అర్ధాంగి అయ్యాక ఆమెకు ఏ చిన్న విషయంలో కూడా బాధ, లోటు అంటే ఏమిటో తెయకుండా జరిగిపోయింది. ఎప్పుడన్నా సరదాకి కూడా ఆమెచెప్పే కబుర్లలో పొరపాటున కూడా పరాయి మగవాడి ప్రసక్తి తెచ్చేది కాదు. అందుకే ఏనాడు నాకామె మీద ఎలాంటి సన్నపాటి అనుమానం కూడా రాలేదు. పైకి నమ్మకంగా, ప్రేమగా నటిస్తూనే మెత్తని కత్తితో గొంతు కోసే రకమని డాక్టరు చెప్పిననాడే తెల్సుకున్నాను" అన్నాడు.

"మీరు శ్రావణిని ప్రేమగా చూసేవారా" అంది ప్రమీల.

"లోకంలో ఏ భర్త తన భార్యని ప్రేమగా చూడడు ?" అన్నాడు శ్రీహరి తిరుగు ప్రశ్న వేస్తూ.

"అదే పొరపాటు. దేశంలో భర్తలందరూ భార్యలను ప్రేమగా చూసి తమ బాధ్యతలను సక్రమంగా నిర్వర్తించినాడు రెస్క్యూ హోమ్స్, శరణాలయాలకు తావుండదు. ఏ స్త్రీ కూడా అనాథగా తయారవదు. ఉదాహరణకు జరిగింది నిజం కానీండి అబద్ధం కానీండి మీరు ఆవేశంలో మీ భార్యను పుట్టింటికి పంపారు. ఇక్కడ రైలెక్కించారు. అంతవరకే మీరు చేశారు.

**జరిగిన కథ—9** శ్రావణి తన పెళ్ళికి ముందు జరిగిన సంఘటనలు చెపుతూ తనను తన బావ ఏ విధంగా అల్లరి పెట్టిందీ ప్రమీలతో చెప్పసాగింది. శ్రావణి చెప్పినదంతా విన్న ప్రమీల ఆమె జీవితం నాశనం కావడానికి కారణం ఆమె బావే అని గ్రహిస్తుంది. ఎలాగైనా ఆమె బ్రతుక్కోక దారి చూపాలని నిర్ణయించు కొంటుంది. కైలాష్ తన స్నేహితుడైన శ్రీహరి భార్యే తనింట్లో ఉన్న శ్రావణి అని తెలుసుకొంటాడు. శ్రీహరి భార్య స్మృతులతో అశాంతి పాలవుతాడు. శ్రావణి సమస్యను భార్య ప్రమీలతో కలసి పరిష్కరించాలనుకొంటాడు కైలాష్. శ్రావణికి వైద్యం చేసిన శతభిషాచారి దగ్గరకు వెళుతాడు. అక్కడ శేషుని చూస్తాడు. కైలాష్ శేషుతో స్నేహం పెంచుకొంటాడు. తాగుడు మైకంలో తన రహస్యాలన్నీ కైలాష్‌కు చెప్పడం మొదలుపెడతాడు శేషు. శ్రావణి జీవితం నాశనం కావడానికి శేషే కారణం అని తెలుసుకొంటాడు కైలాష్. ప్రమీల, కైలాష్‌లు కలసి శ్రీహరి దగ్గరకు బయలుదేరుతారు.

ఆమె పుట్టింటికే చేరిందని మీరు ఎందుకను కోవాలి. జరిగింది భరించలేని అభిమానవంతురా లయితే, ఏ ఆత్మహత్యకో పూనుకుందని మీరు ఎందుకనుకోరు ? ఒక బాధ్యతగల భర్తగా మీ రామెకు పుట్టింటిదగ్గర విడిచి జరిగింది ఆమె తల్లిదండ్రులకి చెప్పటం మీ కనీస కర్తవ్యం కాదా ? మరి మీరాపని చేశారా ?'' అంది సూటిగా శ్రీహరి ముఖంలోకి చూస్తూ.

జరిగింది పునశ్చరణ చేసుకున్న శ్రీహరికి ప్రమీల మాటలు నిజమే అన్పించాయి. నిజంగానే శ్రావణి అభిమానవంతురాలు. ప్రమీల అన్నట్లుగా ఏ ఆత్మహత్యకో తలపడితే...ఒక్కసారిగా అతని గుండెలు దడదడలాడినాయి.

''మా అమ్మాయి శ్రావణి మరణానికి కారణం నువ్వే'' అని నిలదీసి ఆమె తల్లి దండ్రులు అంటున్నట్లుగా తోచింది. నిజమే ఆనాడు మరొక మాటకు తావియ్యకుండా కోపంతో రైలెక్కించాడు. శ్రావణిని పుట్టింటికి పంపినినాటి నుంచీ, నేటివరకు ఎవ్వరూ ఆమె గురించి రాలేదు. కొంపదీసి అక్కడ వారు శ్రావణి అత్తవారింట్లోనే వుందని అనుకోవటం లేదుకదా. నిజంగా శ్రావణి పుట్టింటికి చేరినట్లయితే జరిగింది తనవారికి చెప్పకుండా వుంటుందా? అది విన్న ఆమె తల్లిదండ్రులు, కూతురు దోషి అనో లేక నిర్దోషి అనో సమర్ధించటానికి ఎట్టి పరిస్థితిలో రాకుండా వుండరు. ఇంతకాలం ఇక్కడివాళ్ళెవరు రాకపోతే శ్రావణి గతం వారికి కూడా తెల్సునని, అది దాచిపెట్టి తనతో పెళ్ళి జరిపించారని అందుకే వాళ్ళు ముఖం దాటేశా రని, తనిన్నాళ్ళు అపోహపడ్డాడు. ఒక్క రోజు కూడా ప్రమీల అన్నట్లుగా ఆ ఆలోచన తనకి రాలేదు.

ఒకవేళ శ్రావణి తరుపు వారెవరయినా వచ్చి ఆమె ఏదని అడిగితే తనేం చెపుతాడు ? ఒకవేళ తను నిజం చెప్పినా నమ్మరు. కావాలనే తను శ్రావణిని ఏదో చేశానని నామీదనే నిందవేస్తారు. ఆ పరిస్థితి ఊహించుకుంటేనే భరించలేకుండా వుంది శ్రీహరికి.

ఏది ఏమయినాసరే తనొక్కసారి శ్రావణిని చూడాలి. తప్పదు తర్వాత సమస్య తరువాత. ముందు తను అర్జంటుగా ఆమె ఊరు వెళ్ళి ఆమెను చూడాలి. ప్రమీల మాటలు పదే పదే మనసులో మెదులుతుంటే, తన మనసు కూడా ఏదో కీడును శంకిస్తోంది. తన ప్రేమాను రాగాలతో ఓలలాడించిన తన భార్య ఇంక లేదను కోవటానికి అతని మనసు అంగీకరించటంలేదు. ఎప్పుడెప్పుడు ఆమెని చూస్తానా అని అతని మనసు తహతహలాడసాగింది.

''ఏమిట్రా అలాగే వుండిపోయావు'' అని కైలాష్ భుజం తట్టేవరకు ఆలోచనలలో వుండి పోయిన శ్రీహరి తేరుకుని.''—

''నేను అర్జంటుగా శ్రావణిని చూడాలి'' అన్నాడు ఉద్వేగంగా.

విస్తుపోయాడు కైలాష్.

మళ్ళీ శ్రీహరి నోటినుంచి అదే మాట ''నేను అర్జంటుగా శ్రావణిని చూడాలి.''

''నేను పూర్తిగా చెప్పకుండానే అప్పుడే మనసు మారి భార్యను చూడాలనుకోవటంలేదు కదా?'' ఇప్పటివరకు శ్రావణిని గురించి ఒక్క మాటయినా మాట్లాడనివాడు ఇంత సడన్‌గా భార్యని చూడాలనుకోవటంలోవున్న అంతరార్థం ఏమిటో అర్థంకాని ప్రమీల ఒక్క నిముషంపాటు ఆలోచించింది. శ్రావణి ఆత్మహత్య మాట తను సూచాయిగా అంది. అది నిజమో కాదో తేల్చు కోవటానికి కాదుకదా ఆమెను చూడాలను కోవటం. అదే అయివుండవచ్చు అనుకుంది. వెతకపోయిన తీగ కాళ్ళకు చుట్టుకున్నట్లుగా వుందిప్పటి పరిస్థితి అనుకుంది ప్రమీల.

కానీ కైలాష్‌కు మాత్రం విషయం ఏ






ఇటీవల చిత్తూరులో నైటో ప్రిన్స్ మ్యూజికల్ ఆధ్వర్యంలో ప్రముఖ సినీ సంగీత దర్శకుడు శ్రీ రమేష్ నాయుడుకి ఘన సన్మానం, 'సంగీత స్వరార్ణవ, బిరుదు ప్రదానం జరిగిన సందర్భంగా తీసిన చిత్రం.

మాత్రం అర్థం కాలేదు. అంతా గందరగోళంగా వుందతనికి.

మళ్లీ ప్రమీలే కల్పించుకుని...

ఎందుకయినా మంచిదని శ్రీహరితోపాటు కైలాష్‌ను కూడా వెళ్ళమంది.

బయలుదేరేముందు కైలాష్‌ని పిలిచి ఏదో చెప్పింది రహస్యంగా.

**46**

తూరుపు రేఖలు విచ్చుకుంటుండగానే రైలు దిగారు మిత్రులిద్దరు.

# శ్రావణి

కాలక్షేపానికి కైలాష్ ఏదో కబుర్లు చెపుతున్నా శ్రీహరి మనసుకి ఆ మాటలేం పట్టటం లేదు. అన్య మనస్కంగా వున్నాడు.

"శ్రావణిని చూసి నీతో తెచ్చుకుంటావా" కైలాష్."

ఏ సమాధానం చెప్పలేదు శ్రీహరి.

ఆ చిరుగాలిలో దారి తిన్నగాలేని రోడ్డు లాంటి దానిమీద నుంచి నడవటం వింతగా ఉంది శ్రీహరికి. ఏమిటి తను చేస్తున్న పని, ఒకవేళ శ్రావణి ఎదురుపడితే తనేం మాట్లాడ కలడు. తనిలా రావటంలో తప్పు చేయటం లేదు కదా. ముందు కైలాష్‌ని పంపి ఆమె క్షేమంగా వుందో లేదో చూడవల్సింది అని ఒక వైపు అన్పించినా, మరొకవైపు తాళికట్టిన బంధానికి ఈ జన్మకి ఆమే కదా నా జీవన సహచరిణి, ఆమె క్షేమం తనకు ముఖ్యం కాదా? అటువం టప్పుడు తెల్సుకోవటం కర్తవ్యమని వివేకం హెచ్చరించింది.

తనిప్పుడు భార్యకోసం వస్తున్నానని చెపితే కైలాష్ ఏమనుకుంటాడోనన్న సంకోచం ఒక పక్క.

ఆలోచనలతో మనసంతా అలజడిగావుంది.

శ్రావణితో పెళ్ళయాక ఒకటి రెండుసార్లు మాత్రమే ఆ వూరు వచ్చిన శ్రీహరికి అత్త గారి ఇల్లు మాత్రం బాగా గుర్తుండిపోయింది.

ఇంటి దాపుకయితే వచ్చారు కానీ లోపలికి వెళ్ళటానికి, తటపటాయిస్తూ నిలబడిన శ్రీహరిని చూసి కైలాష్ చనువుగా లోపలికి నడిచాడు.

"ఎవరుకావాలి బాబూ ?" అన్నాడు లక్ష్మయ్య అపరిచిత వ్యక్తిని చూస్తూ.

"మీతోనే పనుండి వచ్చాం. బయట మీ అల్లుడు శ్రీహరి వున్నాడు" చెప్పాడు.

"అల్లుడా. అమ్మాయి పోనేపోయింది.

# సంప్రదాయాల సర్వోత్తమ సృష్టి ...ఆప్కో

సంప్రదాయ కూచిపూడి నృత్య కళాభారతికి
ఈనాటికి హారతిపడుతూనే వున్నారు
నర్తకీమణులు. ఆంధ్రప్రదేశ్‌లో మరుగున
పడుతున్న మహోన్నత కళను
పునరుజ్జీవింప చేస్తోంది ఆప్కో.
పట్టుదారాల ప్రాభవాన్ని
ప్రకటించే ఆప్కో సిల్కు
వస్త్రాలు అందుకు
ప్రత్యక్ష సాక్ష్యాలు. అవే
శోభాయమానమైన
కొత్తకోట చీరలు.

ఆప్కో

అందుకోండి! ఆప్కోవారి పండుగ కానుక.

kiron-apco-84gl

ఇంకా అల్లుడెందుకు'' అని సన్నగాగొణుక్కుంటూ బయటికి నడిచాడు.

మామగారి వెంట లోపలికయితే వచ్చాడు కానీ ఏంమాట్లాడాలో, ఎలామాట్లాడాలో అర్థం కాని శ్రీహరి గుటకలు మింగుతూ కూర్చున్నాడు.

కైలాషే ముందుగా కల్పించుకుని 'మీ అమ్మాయి...' అన్నాడు.

''ఇంకా ఎక్కడి అమ్మాయి నాయనా, దానికెప్పుడో నూరేళ్లు నిండిపోయినాయి. నువ్వు కాదన్నావన్న అభిమానంతో ఓ కాగితం రాసిపెట్టి దాని దారది చూసుకుంది'' అంటూ అక్కడే కూలబడి ఏడుపు మొదలు పెట్టింది శాంతమ్మ.

పిచ్చిగా చూడటంతప్ప మరేం మాట్లాడ లేదు లక్ష్మయ్య.

ఒక్కసారిగా నిశ్చేష్టుడయ్యాడు శ్రీహరి. కళ్లనీళ్లు గిర్రున తిరిగాయి. గొంతు పొడారి పోయింది. ఏదీజరగదని అనుకున్న తన నమ్మకం వమ్ముఅయింది. జరగకూడదని దేముడిని ప్రార్థించిన ప్రార్థనలు విఫలమయినాయి. అయిపోయింది. కేవలం పుట్టింటికి పంపి నందుకే శ్రావణిలా నిండుప్రాణాలు తీసుకుంది. తన కారణంగా భార్య ప్రాణత్యాగం చేసుకుందన్న ఆలోచన అతని మనసుని కలిచివేస్తోంది. ఆఖరి సారిగా స్టేషనులో తనవైపు దీనంగా చూస్తూ ఏదో చెప్పాలని ఆరాటపడిన భార్య ముఖమే అతని కళ్లముందు కదలాడసాగింది.

కొన్నినిముషాలపాటు భయంకర నిశ్శబ్దం అలుముకుందా ఇంట్లో.

ఆ వృద్ధ దంపతులు పడేబాధ చూస్తుంటే కైలాష్ మనసు ఒక లిప్తపాటు చలించిపోయింది. నిజంగా వీరందరూ అనుకున్నట్లుగా శ్రావణి చనిపోయుంటే ఏ పాపం ఎరగని ఒక అభాగ్యురాలి ఆత్మాహుతికి కారకుడు శ్రీహరే అయ్యుండే వాడు.

ఆ నిశ్శబ్దాన్ని చీలుస్తూ కైలాషే అన్నాడు. ''ఏదో భార్యాభర్తల మధ్య స్పర్థలు

## శ్రావణి

వచ్చాయి. కానీ అమ్మాయి ఇంత తొందరపడు తుందని మేము అనుకోలేదు.''

శాంతమ్మ కోపంగా ఏదో అనబోయింది కానీ లక్ష్మయ్య అడ్డు తగులుతూ—

''చూడుబాబు! మావల్ల అపరాధం జరిగిపోయింది. మా అమ్మాయికి, మాకు దాంతో పాటు నీకుకూడా రుణం తీరిపోయింది. దాన్ని కన్న నేరానికీ, నీకు కట్టబెట్టిన నేరానికి మాకు మిగిలిందల్లా ఈ గర్భశోకమే.'' అన్నాడు మరొక మాట ఎక్కువ మాట్లాడకుండా అల్లుడి చేతులు పట్టుకుని కన్నీటితో.

బంధాలు ఏర్పడ్డాక, రుణాలు అంత సులభంగా తీరవులెండి అన్నాడు కైలాష్.

కళ్ళప్పగించి చూడటంతప్ప ఏమీ మాట్లాడలేదు శ్రీహరి. ఇంక వెళ్దామన్నట్లుగా మిత్రుడిని తట్టాడు కైలాష్.

జీవంలేనట్లుగా యాంత్రికంగా లేచి నడిచాడు శ్రీహరి.

ఇద్దరూ కల్సి కొంచెం దూరంగా నడిచాక ''అరే నా కర్చీఫ్ మర్చిపోయానక్కడ తెచ్చుకుంటానని'' వెనక్కు వెళ్ళాడు కైలాష్.

వంటరిగా నిలబడ్డ శ్రీహరి మనసు మళ్ళీ ఆలోచనల మయమయింది. ఎందుకు శ్రావణి తొందరపడ్డావు. భౌతికంగా నువ్వు నాకు దూరమయినా, మానసికంగా నీ స్థానం ఎప్పుడూ నా గుండెల్లోనే వుంటుంది. నువ్వీ లోకంలో లేకపోయినా, నీ కన్యాయంచేసి ఆ స్థానాన్ని మరే ఆడదానికి ఇవ్వనని, మనస్సాక్షిగా నువ్వు పుట్టిన ఈ వూరిమీద ప్రమాణం చేస్తున్నాను.

ఇంతకాలం నల్గురి దృష్టిలో భార్యను ఒదిలినవాడిగా రూపొందాడు. కానీ ఇప్పుడా స్థానం భార్యాహీనుడుగా మారింది. అమ్మకీ విషయం తెలియనివ్వకూడదు. తెల్సిందంటే మళ్ళీ పెళ్ళి పేరుతో నన్ను గొడవ చేస్తుంది.

''సారీ! ఆలస్యం అయింది. పాపం ఆ ముసలివాళ్ళ బాధ'' అన్నాడు ఆలస్యంచేసి నందుకు సంజాయిషీగా.

శ్రీహరి రానని మొండికేస్తున్నా వినకుండా ఒక వారం రోజులపాటు తనింట్లోవుంటే మనశ్శాంతి ఏర్పడుతుందని, ప్రస్తుత పరిస్థితిలో అతను పడే మనోవ్యాధికి మనశ్శాంతే ఔషధమని కైలాష్ మరీ మరీ చెప్పటంతో మూర్ఖంగా కాదనలేక ఒప్పుకున్నాడు శ్రీహరి

## 47

''రెండు రోజులనుంచీ ఎడమకన్ను ఒకే మాదిరిగా అదురుతోందక్కా'' అంది శ్రావణి.

''ఎడమకన్ను అదిరితే శుభం జరుగుతుం దంటారు. సడన్‌గా మీ ఆయనొచ్చి బయలుదేర మంటాడేమో చూసుకోమరి'' అంది నవ్వుతూ ప్రమీల.

'హాస్యాలాడటానికి నేనే దొరికానా?' అంది చిన్నపోయిన ముఖంతో ''హాస్యం కాదు. అబద్ధం కాదు. ఒకవేళ వచ్చి రమ్మంటే వెడతావా?'' అంది మళ్ళీ.

''ఎలారమ్మంటారు? ఎందుకురమ్మంటారు? ఇంత జరిగాక. అసలింకా ఆయన దృష్టిలో నేను బతికి వున్నానా?'' అంది గద్గదికంగా.

''నిన్నసలు మీ ఆయన మర్చిపోతేకదా''

''ఈ రోజు వేళాకోళాలాడటానికి నేనే దొరికినట్లున్నానుగానీ ఇదిగో నువ్వు ఫెయిర్ చెయ్యమన్న నవలలు పూర్తయినాయి, బుక్స్‌కూడా కట్టేశాను'' అని తెచ్చి ప్రమీల కిచ్చింది.

''వెరీ గుడ్!'' అని ఆమెను అభినందిస్తూ దగ్గరకురమ్మని చెయ్యి పట్టుకుని కూర్చోపెట్టి ''నేను కొన్ని ముఖ్యమయిన విషయాలు చెపుతాను జాగ్రత్తగా విను.''

శ్రద్ధగా వింటోంది శ్రావణి.

''మేము వూరు వెళ్ళి వచ్చేటప్పుడు కైలాష్ నన్ను తను చిన్ననాటి ఫ్రెండింటికి తీసుకెళ్ళారు. అతనికి అన్నీ వున్నాయి. అంటే సిరీ—సంపదా. కానీ లేనిదల్లా ఒక్క శ్రీమతి మాత్రమే.

''కొంపదీసి తనకి రెండోపెళ్ళి చెయ్యాలని కాదుకదా ఈ వుపోద్ఘాతం''అనుకుని భయపడింది శ్రావణి.

''ఆ మిత్రుడు తన భార్యను పుట్టింటికి పంపాడట'' అంది ప్రమీల.

''ఏ కారణంచేతో?'' అంది అప్రయత్నంగా శ్రావణి.

''నీకు తెల్సు'' అంది ప్రమీల.

''ఆయనెవరో తన భార్యని పుట్టింటికి పంపితే దానికి కారణం నాకెలా తెలుస్తుంది. ఏదన్నా నవలకి కొత్త ప్లాటా?'' అంది.

''కాదు ఇది జీవితమే'' అంది.



## ఇవేమన పద్యాలు






ధనమెచ్చిన మదమెచ్చును
మదమెచ్చిన దుర్గుణంబు మానకహెచ్చున్
ధనముడిగిన మదముడుగును
మదముడిగిన దుర్గుణంబు మానును వేమా.

"ఎవరిదో ?" అంది ఆసక్తిగా.

"ఇంకెవరిది నీదే" అంది.

ఉలిక్కిపడింది శ్రావణి. నిశ్చల తటాకంలో రాయి విసిరినట్లుగా ఆమె అంతరంగం అల్లకల్లోలమయింది. ఒకవైపు సంతోషం, మరోకవైపు దుఃఖం పొంగిరాగా "మీరు ఆఇంటికి వెళ్ళారా ? ఆయనెలా వున్నారక్కా ? మళ్ళీ పెళ్ళి చేసుకున్నారా ? మా అత్తగారు బాగున్నారా ? నా గురించి ఏమన్నా అడిగారా" అని ప్రమీలను కుదిపేస్తూ ఒక్కసారిగా ప్రశ్నల వర్షం కురిపించింది ఒళ్ళు తెలియని సంతోషంలో.

"ఆగాగు ! ఒక్కసారిగా నువ్వడిగిన ప్రశ్నలకు నేను ఎలా సమాధానం చెప్పను. మీ ఆయన క్షేమం. కానీ మరొక భార్యని మాత్రం తెచ్చుకోలేదు. మీ అత్తగారు యాత్రలకు వెళ్ళిందట, చాలా ఈ విశేషాలు" అంది.

"నా గురించి ఏమీ అడగలేదా ?" అంది పాలిపోయిన ముఖంతో.

"ఎందుకు అడగలేదు ? జరిగే తతంగం అంతా నీ గురించే. నువ్వు చాలా అదృష్టవంతురాలివి శ్రావణీ. పెళ్ళాలుండగానే మళ్ళీ పెళ్ళికొడుకులుగా తయారవుతున్న ప్రబుద్ధులున్న ఈరోజుల్లో, ఏదో కోపంతో నిన్ను పంపిన మీ ఆయన అనుక్షణం నిన్నే తల్చుకుంటున్నాడు. నీపేరే జపిస్తున్నాడు. నీమీద ఆయన ప్రేమ ఏమాత్రం తరగలేదు. కానీ జరిగిన దానికే అతని బాధ."

"ఏమాత్రంగా అయినా ఈ విషయం నాకు తెలిస్తే అసలు నేను పెళ్ళికే అంగీకరించేదాన్ని కాదు ఆయన్నింత క్షోభపెట్టేదాన్నికాదు" అంది శ్రావణి.

"నీ విషయం నాకు తెల్సుగా. నే చెప్పేది పూర్తిగా విను మరి. నిన్ను పుట్టింటికి పంపినందుకు మీ ఆయన చాలా బాధను వ్యక్తం చేశాడు.

కానీ శ్రావణి పుట్టింటికే ఎందుకు వెళ్ళిందని మీరనుకోవాలి. ఏ ఆత్మహత్యకో తలపడి వుండవచ్చుగా" అన్నాన్నేను.

"అంతే ! మీ ఆయన అదిరిపోయి నిన్ను చూడాలని మీ వూరు వెళ్ళాడు. వెంట ఈయన కూడా వెళ్ళారు." అంది.

"అయ్యో ! ఎంతపని జరిగింది. ఆయన కూడా నేను పోయాననే అనుకుంటారు. నేను ఉత్తరం రాసి రావటం ఎంత పొరపాటయ్యింది. ఇప్పుడెలా ?" అంది కంగారుగా.

"నువ్వు ఇల్లు వదిలి పెట్టటం పొరపాటే అయినా. అదే నీకు మంచి అయింది."

"నేనిక్కడవున్నట్లుగా మీరు చెప్పలేదా ? అంది చటుక్కున గుర్తుకువచ్చి."

"చెపితే నీ కాపురం చక్కపడుతుందా ?" అంది ప్రమీల.

"ఏమోనక్కా ! నా మనసంతా చాలా గజిబిజిగావుంది. నువ్వు చెప్పేది అర్థం అయి కాకుండావుంది. నాకేదో భ్రమలా అన్పిస్తోంది. నాకసలు పిచ్చెక్కేటట్లుగా వుంది." అంది తల చేత్తో పట్టుకుని.

"ఈ కాస్తకే ఇలా అయితే ముందు వినబోయే విషయాలకు ఎలా తట్టుకుంటావు. నీకు మాట ఇచ్చినట్లుగా నీ కాపురం ఒకదారికి చేరుస్తానన్న రోజు ఇంత త్వరలోనే రావటం నాకు చాలా ఆనందంగా వుంది. నువ్వేం తప్పు చెయ్యలేదు. కొన్ని దుష్టశక్తుల ప్రభావంగా నువ్విలా అయ్యావు. అవన్నీ మీ ఆయన దగ్గర చెప్పి నిన్ను మీ ఇంటికి పంపుతాను" అంది ప్రమీల.

ఈసారి మరింతగా విస్తుపోయిన శ్రావణి "నాకేం జరిగిందో నీకు తెల్సునా?" అంది ఆతృతగా.

"రేపు అంతా చెపుతాను. తెల్లవారేసరికి మీ వాళ్ళందరూ వస్తారు. అందరి సమక్షంలో నిజం నిరూపిస్తాను. కాస్త ఓపికపట్టు. కానీ ఒక్క మాట నువ్వు మాత్రం మరికొంతసేపు అజ్ఞాతవాసం చెయ్యక తప్పదు." అంది.

ప్రమీల మాటలకు మనసు మొద్దుబారిన శ్రావణి మౌనంగా తల వూపటంతప్ప ఏం మాట్లాడలేదు.

**(ఇంకా వుంది)**






'మహాసంగ్రామం'లో కృష్ణ, అన్నపూర్ణ

## కన్నుల పండుగగా జరిగిన "బొబ్బిలి బ్రహ్మన్న" విజయోత్సవం!

మన రాష్ట్రం నలుదిశలనుంచి వచ్చిన కృష్ణంరాజు అభిమానుల కోలాహలంతో, క్రిక్కిరిసిన జన సమూహంతో సెప్టెంబర్ 2న విజయశేష్ మహల్ కళకళలాడి పోయింది. "కృష్ణంరాజుగారి ఇమేజ్‌ని, డైరెక్టర్ కె. రాఘవేంద్రరావుగారి కీర్తిని, గోపీకృష్ణా మూవీస్ నిర్మాత యు. వి. సూర్యనారాయణరాజుగారి ప్రతిష్ఠను మరింత పెంచిన అపూర్వమూ, అసాధారణమూ అయిన చిత్రం – బొబ్బిలి బ్రహ్మన్న." అన్నారు విజయోత్సవానికి అధ్యక్షత వహించిన ప్రముఖ హిందీ నటుడు దిలీప్‌కుమార్. ఈయన కళాకారులకు, శివాజీ గణేశన్ సాంకేతిక నిపుణులకు మొమెంటోలు అందజేశారు.

"ఈ చిత్రం సమిష్టి కృషి. ముఖ్యంగా బ్రహ్మన్న పాత్రను సృష్టించి, తీర్చిదిద్దిన రచయితలు పరుచూరి సోదరులు, డైరెక్టర్ రాఘవేంద్రరావుగార్లకు ధన్యవాదాలు." అంటూ హీరో కృష్ణంరాజు తనకు జన్మనిచ్చిన తండ్రి సత్యనారాయణరాజుగారిని, నటుడుగా జన్మనిచ్చిన డైరెక్టర్ కె. ప్రత్యగాత్మగారిని ప్రత్యేకంగా సన్మానించిన అనంతరం "బొబ్బిలి బ్రహ్మన్న" చిత్రానికి సాంకేతిక శాఖలో సహాయకులుగా పని చేసిన వారికి, వివిధ పాత్రలు ధరించిన వారికి బంగారు ఉంగరాలు బహూకరించారు.

అంతకు ముందు ఈ చిత్ర విజయానికి పూర్తి సహకారాన్నిచ్చిన పాత్రికేయులను గోపీకృష్ణా మూవీస్ కార్యాలయంలో కృష్ణంరాజు, కె. రాఘవేంద్రరావు, యు. వి. సూర్యనారాయణరాజు, పరుచూరి సోదరులు ప్రత్యేకంగా కలుసుకున్నారు. "31 కేంద్రాలలో వందరోజుల ప్రదర్శన పూర్తి చేసుకున్న ఈ చిత్రాన్ని కె. రాఘవేంద్రరావుగారు హిందీలో నిర్మించడానికి సన్నాహాలు చేస్తున్నారు. అలాగే ఇతర దక్షిణ భారత భాషల్లో కూడా ఈ చిత్ర నిర్మాణం జరుగుతుంది. అసలు ఈ చిత్రాన్ని ఇంగ్లీషులోనూ నిర్మించాలన్న తలంపు మా డైరెక్టర్‌గారికి లేకపోలేదు .... ఈ చిత్రం ప్రారంభించినప్పట్నుంచీ మాకు సంపూర్ణ సహకారాన్నిచ్చిన పాత్రికేయులందరికీ మా కృతజ్ఞతలు." అన్నారు హీరో కృష్ణంరాజు.

## హీరో కృష్ణంరాజు నూతన చిత్రావళి

దాసరి నారాయణరావు రచన, దర్శకత్వంలో అయిదు చిత్రాలు .... మాధవీ పిక్చర్స్ "తిరుగుబాటు" పూర్తి కావొచ్చింది. తారక ప్రభు ఫిలిమ్స్ సంస్థలో కృష్ణంరాజు నటించే ప్రథమ చిత్రం "ఉగ్ర నరసింహం" షూటింగ్ అక్టోబర్‌లో మొదలవుతుంది. యూనివర్సల్ ఫ్రెండ్స్ సమర్పించే "తాండ్ర పాపా-

'కుటుంబ గౌరవం'లో మురళీమోహన్, విజయశాంతి



'పగబట్టిన పులి బిడ్డలు'లో విజయకాంత్, విజ్జి





## "ఓ ఇంటి కాపురం"లో బొమ్మల కొలువు

రచన : రాజశ్రీ.... గాయని : సుశీల... సంగీతం : రమేష్‌నాయుడు....

అభినయం : సంగీత, భానుప్రియ

పల్లవి : ప్రతి ఏడూ రావాలీ బొమ్మల కొలువు

బొమ్మల కొలువు

ప్రతి ఇల్లూ కావాలీ నవ్వుల కొలువు

నవ్వుల కొలువు

పేరంటాలే పిలవాలీ – ఇరుగు పొరుగు చేరాలీ

మనసు మమత పెరగాలీ – మంచి హారతి ఇవ్వాలీ "ప్రతి"

చరణం : ప్రాణులు అన్నీ పరాశక్తే ప్రతి రూపాలూ

ఆ రూపాలకు ప్రతిబింబాలే మట్టి బొమ్మలూ

వదనం కోటి ప్రభలుగా

అభయం వెన్నెల జల్లుగా

ముగురమ్మల రూపంగా వెలిసేనూ

కొలిచేటి వారి తోడై నిలిచేనూ "ప్రతి"

చరణం : వేకువతో నే లేచే ఆడది ఇంటికి వెలుగు

బొట్టూ కాటుక పెడితే మగని కంటికి వెలుగు

సహనం పెట్టని నగలైతే

వినయం వాటికి తోడైతే

ఇల్లాలికి కావలసిన దేముంది

ఆ ఇంట దేవీ కొలువై ఉంటుంది "ప్రతి"



రాయుడు" సినిమా స్కోప్ చిత్రానికి ఎ. అశోక్‌రెడ్డి, కె. సాయిమోహన్‌రెడ్డి నిర్మాతలు . . పారిశ్రామికావేత్త కరాటం కృష్ణమూర్తి నిర్మించే కె.కె. మూవీస్ చిత్రం ... యలమంచిలి శాయిబాబు, పి జె ప్రభాకరరెడ్డి నిర్మించే సాయిప్రభ ప్రొడక్షన్స్ చిత్రం.

కె. రాఘవేంద్రరావు దర్శకత్వంలో రెండు చిత్రాలు ... యు. వి. సూర్యనారాయణరాజు నిర్మించే గోపీ కృష్ణా మూవీస్ 6 వ చిత్రం, ఎం. అర్జునరాజు నిర్మించే రోజా మూవీస్ చిత్రం

ఎ. కోదండరామిరెడ్డి దర్శకత్వంలో రెండు చిత్రాలు.. . సినిమా స్కోప్‌లో ఆర్. కొతినేని నిర్మించే కొతినేని పిక్చర్స్ "వీర పాండ్య కట్ట బ్రహ్మన్న" డి. సత్యనారాయణరాజు సమర్పించే శ్వేత మూవీస్ తొలి చిత్రానికి డి రామరాజు నిర్మాత.

కె. బాపయ్య దర్శకత్వంలో రెండు చిత్రాలు.... బి. హెచ్. విజయ నరసింహరాజు నిర్మించే ఎస్. బి. బి. ప్రొడక్షన్స్ చిత్రం . డి. రామమోహనరావు సమర్పించే శ్రీ వెంకటేశ్వరా ఆర్ట్స్ తొలి చిత్రానికి వై. సుబ్బారాయుడు, వి శివరామప్రసాద్ నిర్మాతలు.

తాతినేని ప్రసాద్ దర్శకత్వంలో కృష్ణంరాజు నటించే తొలి చిత్రాన్ని గణపతి పిక్చర్స్ పతాకంలో నిర్మాత జి. సత్యనారాయణరాజు నవంబర్‌లో ప్రారంభిస్తారు. జయసుధ నాయిక. సత్యం సంగీత దర్శకుడు.

బాపు దర్శకత్వంలో అక్టోబర్‌నుంచి చిత్రీకరణ జరిగే చిత్ర కల్పనా ఫిలిమ్స్ "బుల్లెట్" చిత్రంలో కృష్ణంరాజు సరసన సుహాసిని తొలిసారిగా నాయికగా నటిస్తుంది. ముళ్ళపూడి వెంకటరమణ రచన. కె.వి. మహదేవన్ సంగీతం. థామస్ జేవియర్ ఛాయాగ్రహణం తెరవెనుక హంగులు.

ప్రసాద్‌రావు దర్శకత్వం వహించే నాగార్జున ప్రొడక్షన్స్ 5వ చిత్రానికి ఎ. సారథి నిర్మాత. ఎ. వి. ఎం. ప్రొడక్షన్స్ చిత్రానికి ఎం. కుమరన్. కె. షణ్ముగం నిర్మాతలు. దేవీ కమల్ మూవీస్ "సామ్రాట్" చిత్రానికి కె. సి. శేఖర్‌బాబు నిర్మాత.

### సుమన్‌తో విజయ బాపినీడు దర్శకత్వంలో ఎ. సారథి చిత్రం

"సుమన్ తొలిసారిగా ద్విపాత్రలు నిర్వహిస్తున్నా రు." అన్నారు. విజయ బాపినీడు. ఈయన దర్శకత్వంలో బత్తుల వెంకట నారాయణ సమర్పించే నాగార్జున ఆర్ట్ పిక్చర్స్ వారి తాజా చిత్రంలో విజయశాంతి నాయిక. సత్యనారాయణ. ప్రభాకరరెడ్డి, గొల్లపూడి మారుతీరావు, రాళ్ళపల్లి ఇతర పాత్రధారులు. మాటలు : సత్యానంద్. గీతాలు : వేటూరి. గోపి. సంగీతం : ఎస్. పి బాలసుబ్రహ్మణ్యం. ఛాయ: ఎం. వి. రఘు. సహకార దర్శకత్వం : పి. పుల్లారావు. "సెప్టెంబర్ 20 నుంచి నెలాఖరు వరకు. తిరిగి అక్టోబరు 15 నుంచి నెలాఖరు వరకు జరిగే రెండు షెడ్యూల్స్‌తో షూటింగ్ పూర్తయిపోతుంది." అన్నారు నిర్మాత ఎ సారథి.

### వేజెళ్ల దర్శకత్వంలో చలం సమర్పించే "ఎవరికీ సిగ్గు లేదు"

"నేటి సమాజంలో స్వార్థం కోసం ఎంతటికైనా దిగజారే కుటిల వ్యక్తులు సృష్టించే జటిల సమస్యలకు పరిష్కార మార్గం చూపే ఇతి వృత్తం. అన్నారు నటుడు చలం. ఈయన "సత్తెకాలపు సత్తెయ్యా. సంబరాల రాంబాబు, మట్టిలో మాణిక్యం, బుల్లెమ్మ బుల్లోడు, దేవుడమ్మ, తోట రాముడు" అనంతరం సమర్పించే శ్రీ రమణ చిత్ర వారి "ఎవరికీ సిగ్గులేదు" చిత్రానికి వేజెళ్ల యూనిట్ పని చేస్తుంది.

# వీళ్లూ మనుషులే!

వింధ్యవాసిని

ఆ ప్రదేశం ఆధునిక జన జీవనానికి దూరంగా, ప్రకృతి రమణీయతకు చేరువలో ఉంది. అక్కడ సూర్య చంద్రులనూ, నీలాకాశాన్ని, కళ్ళాపి చల్లిన నేల మీద ముగ్గుల్లా ఆకాశాన పరచుకునే నక్షత్రాల సరాలనూ దర్శించడానికి ఏ కష్టమూ పడనవసరం లేదు. రక రకాల పూవులు, పళ్ళు, ఆకుల తాలూకు సువాసనల్ని మోసుకొచ్చే పిల్ల గాలుల కయితే కొఱత లేనే లేదు.

ఆ ప్రదేశంలో ఒంటరిగా, ధీమాగా నిలుచుని ఉన్న ఆ నీలి రంగు బంగళా, పెంకుల కప్పుగానీ లేకపోతే, వెనకాతలి ఆకాశపు నీలి రంగులో కలిసి పోయేదే! తెల తెల వారుతుండగా బంగళా తలుపు లోపలి గడియ తీసిన శబ్దం అయింది.

పక్షుల కుహూరవాలు వింటూ, మైమరిచి బీడి కాలుస్తూ, చాప మీద ముణగ దీసుకు కూర్చున్న వాచ్‌మన్ అబ్దుల్ ఖాదర్ తలుపు తెరిచిన శబ్దానికి బీడీ విసిరేసి చేతులు కట్టుకుని నిలుచున్నాడు.

ఒక మధ్య వయస్కురాలు, తెల్లటి మంచు లాంటి చీరె మీద, గంధం రంగు శాలువ భుజాన చుట్టూ కప్పుకుని – ఇవతలికి వొచ్చింది. ఆమె – డా. మృదుల, తలుపు దగ్గరగా లాగి, దండం పెడుతున్న వాచ్‌మన్ వయిపు చిరు నవ్వుతో చూసి, ముందుకు సాగింది.

ఆవిడ వెళ్ళిన తర్వాత కూడా కొన్ని క్షణాలపాటు, అతను జోడించిన చేతులు అలాగే ఉన్నాయి. అతని చూపులో ఉన్నది, కేవలం యజమానురాలన్న భావం ఒక్కటే కాదు. దివి నుండి భువికి దిగివచ్చిన దేవతను కళ్ళారా చూస్తున్న భక్తి భావం ఉంది; అనుభూతి ఉంది.

డా: మృదుల వైద్య వృత్తికి తన జీవితాన్ని అంకితం చేసుకుంది దాదాపు పదిహేను సంవత్సరాల క్రితం, తను పుట్టి పెరిగిన నగర జీవనానికి స్వస్తి చెప్పి, దూరంగా విసిరి వేయబడినట్లున్న ఈ కొండ ప్రాంతంలో,,స్థిరపడిపోయింది.

అప్పట్లో ఆ చుట్టు పక్కల అయిదారు పల్లె-టూర్లలో, కొత్త రకం అంటు వ్యాధి ఏదో ప్రబలంగా వ్యాపించి, ప్రాణాలు తీస్తున్నదని తెలిసి, అక్కడి వారికి సహాయం చేయాలని వచ్చింది డా: మృదుల. ఆ జనంతో కళ్ళారా చూసిన మొదటి డాక్టరు ఈమే! ఒకసారి వచ్చిన తర్వాత, మరక్కణ్ణుంచీ కదిలి వెళ్ళ-లేక పోయిందామె.

అక్కడి వాతావరణం, ప్రకృతి సౌందర్యం, జనుల ప్రీతి విశ్వాసాలు, వైద్య శాస్త్రంలో రెండు విదేశీ పట్టాలు పుచ్చుకున్న డాక్టర్ను ఆకట్టేసుకున్నాయి. అక్కడే ఆ నీలి బంగళా కట్టించుకుని స్థిర నివాసం ఏర్పరచుకుంది. అప్పట్లో అదే ఆమె నివాసమూ, ఆసుపత్రీ కూడానూ.

తర్వాత అయిదు సంవత్సరాల్లో, అక్కడికి బొమ్మరిళ్ళవలె కనిపించే, కను చూపు మేరలోని తెల్లని కట్టడాల సముదాయం, డా. మృదుల ఆసు-పత్రిగా, 'ఆనంద నిలయం' పేరుతో వెలిసింది.

కంటికి కనిపిస్తున్నట్లే ఉన్నా, బంగళానుంచీ, ఆనంద నిలయానికి, నిదానంగా నడిస్తే పది నిము-షాల నడక. డా. మృదుల అంత దూరం నడిచి, గేటు దగ్గరున్న ఆస్పత్రి వాచ్‌మన్‌ని పరామర్శించి లోపలికి దారి తీసింది. ఆమె అడుగుల్లో వేగం ఉంది. నడకలో ధీరత్వం, ఆత్మ విశ్వాసం ఉన్నాయి.

ప్రతీ రోజూ ఉదయం లేవగానే, డా. మృదుల చేసే పని ఇదే. ఆసుపత్రి అంతాఒక చుట్టు చుట్టి, రోగు-లను, తన కింది ఉద్యోగులను పలుకరిస్తుంది. ఆమె కోసం డ్యూటీ రూంలో సిస్టర్లు తయారు చేసిన కాఫీ సువాసన, గేటు దాటి వస్తున్న డాక్టరుకు స్వాగతం చెప్పింది.

*　　　*　　　*

మధ్యాహ్నం ఒంటి గంట అయి ఉంటుంది డా. మృదుల ఆ పూటకు చేయవలసిన పనంతా అయి-పోయింది. కార్బాలిక్ సబ్బుతో కడుక్కుంటూ ఉండగా, ఆనంద నిలయం గేటు దగ్గర ఏదో గోల జరుగుతున్న శబ్దాలు విన వచ్చాయి.

ఆశ్చర్యంగా కిటికీలోంచీ బయటికి చూసింది. వాచ్‌మన్ రంగయ్య ఎవరితోనో తగువు పెట్టు-కున్నట్లుంది. గట్టిగా కేక లేస్తున్నాడు. ఆయా జాలమ్మను పిలిచింది డాక్టరు. టవలుతో చేతులు తుడుచుకుంటూ, "ఏమిటి గొడవ?" అని అడిగింది.

"మీకు తెలీదుగానమ్మ, ఈ చుట్టు పక్కల ఈ తోడేలు బాధొకటి వచ్చి పడింది. జనం నిశ్చింతగా నిద్దర్లు పోలేకుండా అయింది." జాలమ్మ అక్కడికి అయిదు కిలో మీటర్లు దూరంలో ఉన్న గురు-గుంట్లపల్లెనుంచీ వస్తుంది.

"తోడేలా?"

"అవునమ్మగారు, నలుగురు మనుషుల్ని తినేసిం-దండి ఇప్పటికే"

"అరెరే! నాకసలీ విషయమే తెలీదే?"

"మాలో చాలా మందికి తెలుసమ్మ కొందరయితే ఉత్త పుకారు లెమ్మంటారు అయినా ఇట్టాంటి విషయం రహస్యంగుంటేనే మేలు ఆస్పత్రిలో రోగులు భయపడిపోతే పట్టలేం అందుకని మేమంతా మాట్లాడుకుని, ఈ సంగతి ఎక్కడా పొక్కకుండా చూస్తున్నాం"

అప్పుడు గుర్తొచ్చింది డా. మృదులకు, తను మొదట అడిగిన ప్రశ్నకూ, జాలమ్మ చివరి మాటలకూ, ఎక్కడా పొంతన లేదని

చిరాకుగా అడిగింది, అస లక్కడ గేటు దగ్గర గొడవేమిటని

"ఆదేనమ్మా ఇద్దరు బంది పోటోళ్ళు, ఒచ్చి లోపలికి రావాలని జబర్దస్తీ చేస్తున్నారు."

"ఎవరు వాళ్ళు? వాళ్ళకేం పనిక్కడ?"

"అదుగో, ఇద్దర్లో నల్లగా తారు డబ్బా ముఖం ఉందే .. వాడి జబ్బలో కండలన్నీ చీల్చి లాగేసిందట తోడేలు. లబ లబ లాడుతున్నాడు"

మరుక్షణం ఆగలేకపోయింది, డా. మృదుల. జాలమ్మ వంక గానీ, అప్పటికో అక్కడికి గుంపు చేరిన మరో ఇద్దరు ఆయాలు, ఇద్దరు నర్సుల వయిపుగానీ చూడకుండా, వడి వడిగా గేటు దగ్గరికి నడిచింది

"ఏయ్ రంగయ్యా, ఏమిటి గలభా? వాళ్లను లోపలికి రానివ్వు" గట్టిగా అరచింది డా. మృదుల. అల్లంత దూరం నుంచే, ఆమె కళ్ళు వచ్చిన వాళ్ళిద్దర్నీ పరిశీలిస్తున్నాయి.

జాలమ్మ తారు డబ్బా ముఖం అని వర్ణించిన మనిషి దెబ్బ తిన్న కుడి జబ్బ మీద, ఎడం చెయ్యి ఆన్చి పెట్టుకుని, బాధ అణుచుకుంటూ నిలుచుని ఉన్నాడు అతను, అతని మిత్రుడూ కూడా ఎర్ర రంగు చొక్కా లేసుకుని ఉన్నారు. అతని మురికి పట్టిన నీరు కావి పంచ చేతినుండి కారుతున్న రక్తంలో తడిసి, ఎరుపు రంగు అద్దినట్లుగా అయిపోయింది. ఇద్దరూ ముప్పయ్యేళ్ళు దాటిన వాళ్ళే. కానీ పక్కన దెబ్బతిన్న మిత్రుడికి ఆసరాగా నిలుచుని ఉన్న మనిషి, పసి పిల్ల వాడికన్నా అధ్వాన్నంగా ఏడుస్తూ రంగయ్యను బ్రతిమాలు-తున్నాడు.

రోదిస్తూ నిలుచుని ఉన్న వ్యక్తి ఊతంగా మరొక చేతిలో నేల కాన్చి నిలుచుని ఉన్న వస్తువు పెద్ద తుపాకీ అని, వాళ్ళకు బాగా దగ్గరికి వెళ్ళాకగానీ డా మృదులకు తెలియలేదు. ఎర్రటి చొక్కా మీద నడుంకు బిగించిన బెల్టు వెంబడే, తూటాల పట్టీ ఒకటి బిగించి ఉండటం కూడా, ఆమె గమనించింది. కాస్త జంకు కలిగింది. ... అదయినా అర క్షణం సేపు మాత్రమే!

"రంగయ్యా! వాళ్ళిద్దర్నీ లోపలికి రానివ్వు" అని ఆజ్ఞాపించింది. అక్కడ నిలుచుని ఉన్న వారెవరు, ఎలాంటి వారు అన్నది అప్రస్తుతం వారికి తన

అవసరం ఉంది. దాని తీర్చటం తన కర్తవ్యం. అంతే! ఆమెకు తెలిసిన న్యాయం.

"మీకు తెలీదమ్మా. వీళ్ళిద్దరూ దారి దోపిడీగాళ్ళు. తుపాకి చూపి బెదిరించి దొంగ పనులు చేస్తుంటారు. ప్రాణాలు అయినా తీసే రకం. వాళ్ల మానాన పోనివ్వండి" రంగయ్య సమాధానం.

"వాళ్ళు ప్రాణాలు తీయటం ఏమో గానీ, నువ్వు మాత్రం ఒక నిండు ప్రాణం తీసే లాగున్నావు" చిరాకుగా, కసిరింది డా. మృదుల. రంగయ్య వయ-



సులో చాలా పెద్దవాడు. అందుకని అతన్ని తిట్టా-లన్నా ఆమెకు నోరు రాదు.

చిట్ట చివరి ఆధారం దొరికిన వాడిలా, "వీళ్ళను-లోపల చేర్చుకుంటే, మిగతా రోగులంతాభయంతో పరుగెత్తిపోతారు చూడండి. వద్దు. నా మాట వినండమ్మా" అన్నాడు.

'అలాంటిదేం జరగదు. నేను చూసుకుంటాను. వాళ్ళను రానివ్వు. ఇదుగో అబ్బాయి నీ పేరేమిటి?" అని అడిగింది.

"నా పేరు కాళయ్య. వీడేమో రోసయ్య అమ్మగారు" వినయంగా జవాబిచ్చాడా వ్యక్తి.

"కాళయ్యా, నీ దగ్గరున్న తుపాకి, తూటాల పట్టీ రంగయ్య కిచ్చేసి, రోసయ్యను తీసుకుని నాతో రా." అని ఆపరేషన్ థియేటరు ఉన్న కేంద్ర భవనం వయిపు అడుగు వేసింది డా. మృదుల.

అంత దాకా ఎట్లా ఓర్పు వహించి ఉన్నాడో కానీ; లోపల పడుకోబెట్టగానే, రోసయ్యకు స్పృహ తప్పి పోయింది.

అతని గాయాన్ని శుభ్రం చేసి, కుట్లు వేసి, కట్టు కట్టడానికి డాక్టరుకు అర గంట పట్టింది. ఒక ఇంజక్షను కూడా ఇచ్చిన తర్వాత, "ఇదిగో కాళయ్యా, నీ మిత్రుడికేం భయంలేదు. నువ్వు పోయి వాళ్ల ఇంటి నుంచీ ఎవర్నయినా పంపించు. నాలుగు రోజులు ఇక్కడే ఉండాలిసొస్తుంది."

"వాడి కెవరు లేరమ్మగారు. వాడికి నేనూ, నాకు వాడూ అంతే వాడు బయటొచ్చే దాకా, నేను పోయి ఏం చేసేది? నేనూ వాణ్ణి చూసుకుంట ఈడే ఉంటా" అన్నాడు కాళయ్య.

పేరుకు మిత్రులయినా, వాళ్ళిద్దరూ కవలలో, అన్న దమ్ములో అనిపించేలా ఉన్నారు. తలకు నూనె రాసుకుని ఎన్ని నెల లయిందో, మెడల దాకా పెరిగి రింగులు తిరిగి పోయిన ఎరుపు రంగు జుట్టు, చెవుల దాకాపెరిగి మెలి తిరిగిన మీసాలు, బండబారిన మోటు పెదవులు, ఎర్ర బారిన కళ్ళు; రంగు ఇద్దరిదీ నలుపే అయినా కాళయ్య కొంచెం మేలు. పూర్తిగా కారు నలుపు కాదు – ఎండకు ఎండీ, వానకు నానీ గట్టి పడిన శరీరంతో, వాళ్ళిద్దరూ ప్రత్యేకం 'అడవి మనుషులు' అని చెప్పాల్సిన అవసరం లేని విధంగా ఉన్నారు.

డా మృదుల కాస్త ఆలోచించి, ఎందుకయినా మంచిదని, మామూలుగా వంద మంది దాకా రోగు-లుండే వార్డుకు దూరంగా ఉన్న చిన్న షెడ్డులో పడక ఏర్పాటు చేయించింది. రోసయ్యను అక్కడికి తరలించారు అతను పడకలో ఉన్నాడు కాబట్టి ఫరవాలేదు కాళయ్యదే సమస్య. వెళ్ళిపొమ్మన్నా పోయేలాగ లేదు ఉండనిస్తే ఎట్లా ప్రవర్తిస్తాడో అని అనుమానం ఎందుకయినా మంచిదని ఇద్దరు వార్డు బోయ్‌లను ప్రత్యేకం కాపలా పెట్టింది. వాళ్లిద్దరికీ తెలియకుండా, ఓ కంట కనిపెడు-తుండమని జాగ్రత్తలు చెప్పింది.

రోసయ్యను పడకలో చేర్చిన తర్వాత, వాచ్‌మన్

## వీళ్ళూ మనుషులే!

రంగయ్య మాటలు గుర్తొచ్చాయి డా మృదులకు.

అంతే కాకండా, ఆ సాయంత్రం, రోగులను చూడవచ్చిన డా. మృదులకు, వార్డుల్లో గోల, మాటలు వింటే పరిస్థితి అర్థం అయింది. వాళ్ళలో చాలా మంది రోసయ్య, కాళయ్యలను గురించి భయపడుతున్నారు. కొందరికి తనమీద కోపంగా కూడా ఉంది. అయినా ఎందుకో డాక్టరుకు తను తప్పు చేస్తున్నట్లు అనిపించటం లేదు.

ఉదయం రోసయ్య అక్కడి కొచ్చినప్పుడున్న స్థితిలో, డాక్టరు అనేమిటి, మానవత్వం ఉన్న ఏ మనిషయినా, సహాయం' చెయ్యాల్సిందే. అట్లా చెయ్యకపోతే, రక్తస్రావంతో, ఆ మనిషి ప్రాణం పోయినా ఆశ్చర్యం లేదు అలాంటిది. తను డాక్టరు అయి ఉండీ, సహాయం చేయక ఎట్లా వెనక్కు పంపుతుంది? ఆవిధంగా చెయ్యటం తన వల్ల కాదు. అందుకు తన అంతరాత్మ అంగీకరించదు.

చాలాసేపు తను కూచునే గది కిటికీలోంచి, బయ-టికి చూస్తూ నిలుచుంది డా. మృదుల కొత్తగా వచ్చి పడిన తోడేలు భయం గుర్తొచ్చింది. అయినా, ఆసుపత్రికి రక్షణ గురించి సమస్య లేదు చుట్టూ ముళ్ళున్న ఇనుప తీగలతో మూడడుగుల ఎత్తు కంచె కట్టబడిఉంది. పగలు ఒకరు, రాత్రి ఒకరు చొప్పున వాచ్‌మెన్ ఉంటారు. ఇద్దరి దగ్గరా ఆయుధాలు తయారుగా ఉంటాయి. ఇద్దరూ మిలటరీనుంచీ రిటయిరయిన జవాన్లు, మంచి ధైర్య సాహసాలు గల వారు.

డా మృదుల ఆ వేళకు, డ్యూటీ ముగించుకుని బయల్దేరుతుండగా ఇద్దరు చిన్నారి బాబులు వచ్చారు. "అమ్మా" అంటూ. రాము, శ్యాము అనే ఆ బాబు లిద్దరూ డా మృదులకు పెంపుడు కొడుకులు. పుట్టకముందే తండ్రినీ, పుట్టిన వెంటనే తల్లినీ

## నత్తికి చూచి వ్రాత మందు!

మాస్కో ఆస్పత్రిలోని వైద్య సిబ్బంది నత్తిని నయం చేయడానికి ఒక అపూర్వమైన చికిత్సా పద్ధతిని కనిపెట్టారు. రోగులు ప్రతి నిత్యం ఒక పాఠ్య గ్రంథంలోని అనేక పేజీలను పెద్ద పెద్ద అక్షరాలతో గుండ్రంగాచూచి వ్రాత వ్రాయాలి దీనివల్ల వారి మాట తీరు పెరిగి, నత్తి పోతుంది. అక్షరాలను నెమ్మదిగా, పొందికగా రాస్తూ వుండడంవల్ల రోగులలో మానసికో-ద్వేగం పునర్వ్యవస్థీకరించబడి, వారి మానసిక సమతూకం, సంకల్ప శక్తి పెరుగుతుందని, చూసి వ్రాతను పొంకంగా వ్రాయడంతో పాటు, వారి శబ్ద ఉచ్చారణను సరిదిద్దడం జరుగు-తుందని వైద్యులు చెప్పారు. అపూర్వమైన ఈ చికిత్సా పద్ధతిని ప్రముఖ వైద్య వేత్తలు, విద్యా-వేత్తలు సైతం ఆమోదించారు

పోగొట్టుకున్న వాళ్ళను ఈమె పెంచుకుంది. ఆమె ఇంట్లో ఉంటే ఇంట్లో, ఆసుపత్రిలో ఉంటే ఆసు-పత్రిలో ఆమె వెంబడే ఉంటారు.

ఇద్దరూ ఆమె చేతులూ చెరొకటి పుచ్చుకుని "రామ్మా పోదాం" అని బయల్దేర దీశారు.

డాక్టరు గది దాటి వచ్చేసరికి, నలుగురు వ్యక్తులు లేచి నిలుచుని ఉన్నారు వాళ్ళు వార్డుల్లో ఉండే రోగులకు ప్రతినిధులు. డాక్టరమ్మతో మాట్లాడాలని వచ్చారు.

వాళ్ళలో కొంచెం వయసులో పెద్దాయన, "డాక్ట-రమ్మగారిట్లా జేసినారేం అనుకుంటున్నారమ్మా అంతా!" అన్నాడు.

"కాళయ్య, రోసయ్యల సంగతేనా?" తాపీగా అడిగింది డా. మృదుల కొంచం మోటుగా కని-పిస్తున్న మరొక మనిషి, "ఆ గూండాగాళ్ళనిక్కడ జేరుస్తే, మేమంతా ఇక్కడ ఎట్లా బతికేదమ్మ? ఆళ్ళిద్దర్నీ పంపించేయిస్తే బాగు" అన్నాడు.

జవాబు డా. మృదుల దగ్గర తయారుగా ఉంది.

"ఉండొద్దనుకునే వాళ్ళంతా వెళ్ళిపోవచ్చు బలవంతంగా ఎవరూ ఉండనక్కరలేదు. వాళ్ళిద్దరూ ఇక్కడున్న వాళ్ళెవరికీ హాని చెయ్యకుండా చూసే పూచీ నాది సరేనా? అయినా మీ బయమేగానీ, వాళ్ళిద్దరూ ఈ ఆవరణలో ఉన్నన్నాళ్ళు ఏవిధ-మయిన పాడు పనీ చెయ్యరు అడవుల్లో సింహం, పులి వంటి క్రూర జంతువులు, చిన్న జంతువులను చంపి తినడం మామూలే! అవునా?"

ఆమె ఏం చెప్పబోతున్నదీ వాళ్ళకు తెలియదు. అయినా 'అవును' అన్నట్లు తలలూగించారు.

"అలా అని అదే పనిగా ఇరవయి నాలుగ్గంటలూ అవి చిన్న జంతువులను చంపుతూ పోతే, కొన్నాళ్ళకు అడవుల్లో క్రూర జంతువులు మాత్రమే మిగలాలి."

మొదట మాట్లాడిన పెద్దాయన, అబ్బే, అట్లా ఎందుకు చంపుతాయి? ఆకలయినప్పుడు, ఆహారం అవసరం అయినప్పుడు మాత్రమే చంపుతాయి. మిగతా అప్పుడు వాటి పాటికి అవి ఉంటాయి" అన్నాడు.

"ఈ రోసయ్య, కాళయ్య అలాంటి క్రూర జంతువు-లతో సమానం అనుకోండి. ఈ ఆవరణలో ఉన్నంత కాలం వాళ్ళకు మరొకర్ని దోచుకునే అవసరం రాదు. రాకుండా నేను చూస్తాను. అయినా మీకు తెలీదేమో వాళ్ళ దగ్గిర ఆయుధా లేమీ లేవు. అన్నీ స్వాధీనం చేసుకున్నాన్నేను. మీరు నిశ్చింతగా ఉండండి" అంటూ అడుగు అవతల పెట్టింది డా. మృదుల.

* * *

రోసయ్య పరిస్థితి మెరుగు పడింది. లేచి మరొక మనిషి సహాయం లేకుండా, తిరుగుతూ, స్వయంగా అన్ని పనులూ చేసుకో గలుగుతున్నాడు. ఆసు-పత్రిలో మిగతా రోగులు, వారి బంధువులు, మునుప టంతగా రోసయ్య, కాళయ్యలను చూసి భయ-పడటం లేదు అందుక్కారణం వాళ్ళ సాధు ప్రవర్తనే "డాక్టరమ్మ మాటలు నిజమే", అను-

కున్నారు. ఆ రోజు ఆమెతో పోట్లాడవచ్చిన పెద్ద-లంతా.

తోడేలు భయ మింకా తీరలేదు రోసయ్య దాని-మీద పగ బట్టాడు ఆసుపత్రి నుండి బయటకు రాగానే, ఎలాగయినా మాటు వేసి, దాన్ని చంపాలని ఉంది అతనికి. ఆ మాట డాక్టరుతో కూడా అన్నాడు అతనికీ, కాళయ్యకూ డాక్టరుతో ఒకటి రెండు కబుర్లాడేంత చను వేర్పడింది. ఆమె వాళ్ళ వృత్తిని గురించేమీ అడగలేదు. మనిషి మరొక మనిషికి నీతి పాఠాలు చెప్పి ప్రయోజనం లేదని ఆమెకు తెలుసు. ఉపయోగం లేని మాటలు మాట్లాడే అలవాటు ఆమెకు లేదు. రోగిని రోగిలా తప్ప, ఆఫీసరుగానో, కూలీలానో, రైతుగానో, జమిందారుగానో, దొరగానో, దొంగగానో చూసే పద్ధతి కాదామెది

వాతావరణంలో హఠాత్తుగా మార్పు వచ్చింది. ఆవేళ ఎప్పటిలాగే ఉదయించిన సూర్యుడు, మిట్ట మధ్యాహ్నం అయేసరికి మబ్బుల చాటున దాక్కు-న్నాడు. వేడిలో ఒళ్ళంతా చమటలు పట్టిస్తున్న వాతావరణం క్రమంగా చల్లబడిపోయింది. మధ్యా-హ్నం మూడు గంటలకు తుంపరగా మొదలయిన వర్షం, సాయంత్రానికి కుండపోతగా మారింది.

డా. మృదుల ఇంటి దగ్గర రాత్రిళ్ళు కాపలా ఉండే అబ్దుల్ ఖాదర్‌కు, ఆరోజు ఉదయం వెళ్ళేటప్పటికే జ్వరంగా ఉంది. డాక్టరు మందు ఇచ్చి, విశ్రాంతి తీసుకొమ్మని పంపింది. ముందే అనారోగ్యం పైన ఉరుములు, మెరుపులతో ఉధృతమయిన వర్షం. ఆవేళకిక ఖాదర్ వచ్చే అవకాశం లేదు.

అందుకని ఆసుపత్రిలో పనిచేసే ఎవర్నయినా వచ్చి తనకు తోడుగా ఉండమందామనుకుంది డా. మృదుల. కానీ రాత్రిళ్ళు అక్కడ ఉండిపోయే వారి సంఖ్యే తక్కువ. ఉన్న వాళ్ళందరికీ పని ఉంటుంది ఇళ్ళకు వెళ్ళే వారిని ఉండిపొమ్మని కోరడం ఇష్టం లేదు. వాళ్ళంతట వాళ్ళే, ఒకరిద్దరు మేం ఉంటాం అని అడిగినా, ఆమె వద్దనేసింది. "నాకేం భయం? పదహైదు సంవత్సరాలనుంచీ ఇక్కడ ఉంటున్నాను" అని చెప్పి పంపించేసింది రాము, శ్యాములతో ఇల్లు చేరుకుంది.

చీకటి పడి, రాత్రవుతూ ఉండగా, వర్షం తగ్గే సూచనలు కన్పించలేదు.

డా మృదులకు అర్ధ రాత్రి మెలకువ వచ్చింది. అప్పుడు లేచి చూస్తే, వర్షం ఆగిపోయింది. ఆకా-శంలో మబ్బులు కూడా తేటబడి, అక్కడక్కడ నక్ష-త్రాలు కన్పిస్తున్నాయి. కిటికీ దగ్గిర నిలబడి ఆకాశాన్ని చూస్తున్న డా. మృదులకు ఎందుకో హఠాత్తుగా, ఆ ప్రాంతంలో పెద్ద భయాన్ని సృష్టిం-చిన తోడేలు గుర్తొచ్చింది. వెంటనే మరో ఆలోచన లేకుండా అన్ని కిటికీలు మూసేసింది. తలుపుల గడియలు అన్నీ సరిగ్గా వేసున్నాయో లేదో పరీక్షించు-కుంది. మళ్ళీ మంచం ఎక్కి నిద్ర కుపక్రమించ-బోతుండగా, బయట వరండా అవతల ఎవరివో గుస గుసలు విన్పించాయి. ఉలిక్కి పడింది. మరింత జాగ్రత్తగా చెవులప్పగించి విన్నది. తర్వాతేం విన్పించలేదు. ఖాదర్‌కు బదులుగా మరెవర్నయినా తోడుంచుకోకుండా పొరబాటు చేశానా అన్పించింది ఆమెకు పిల్లలిద్దరికీ దుప్పటి సరిగా కప్పి, వాళ్ళ మీదొక చెయ్యి వేసుకుని పడుకుని కళ్ళు మూసు-కుంది తర్వాత చాలాసేపు డా. మృదుల మేలుకునే ఉంది. కానీ తర్వాత మరింకేం శబ్దాలు విన్పించలేదు

మళ్ళీ మెలకువ వచ్చేసరికి తెల్లవారిపోయింది. పిల్లలిద్దరినీ సరిగ్గా పడుకోబెట్టి, లేచి వెళ్ళి ముఖం కడుక్కుంది డా. మృదుల. తెల్లని ఇస్త్రీ చీర తీసి కట్టుకుని, అలవాటుగా భుజాల చుట్టూ శాలువ కప్పుకుంది.

'బయట ఖాదర్ ఉండడు కద' అనుకుంటూ, తాళం చేతిలోకి తీసుకుంది. తలుపు తీసుకుని బయటి కొచ్చిన డా. మృదుల శిలా ప్రతిమే అయి-పోయింది. వరండా అవతల మెట్లమీద రోసయ్య, కాళయ్య ముడుచుకు కూచుని బీడీలు కాలుస్తు-న్నారు.

తలుపులు తెరిచిన శబ్దం విని, ఇద్దరూ బీడీలు పారేసి లేచి నిలుచున్నారు. వాళ్ళిద్దరి బట్టలు తడి తడిగా ఉన్నాయి. నిద్ర లేమి వల్లనేమో, మామూలు-గానే ఎర్రగా ఉండే కళ్ళు చింత నిప్పుల్లా అయాయి. రోసయ్య అనారోగ్యం, బలహీనంవల్ల మరింతగా వణుకుతున్నాడు. డాక్టరు ముఖంలోకి చూడ-కుండా, ఇద్దరూ తప్పు చేసిన వారిలా తలలు వంచు-కుని నిలుచున్నారు.

ఆశ్చర్యంలోనుండి తేరుకున్న వెంటనే, "ఏం చేస్తున్నారిక్కడ?" అని అడిగింది డా. మృదుల

ఇద్దరూ స్కూలు ఎగ్గొట్టిన కుర్రవాళ్ళలాగా ముఖ ముఖాలు చూసుకుంటున్నారే తప్ప, మాటలు పెగలడం లేదు.

"మాట్లాడరేం అస లెల్లా వచ్చారు? ఎప్పటినుంచి ఇక్కడున్నారు?" గదమాయించింది డాక్టరు.

"అమ్మగారూ.... మరి....' ఇద్దరూ ఒకేసారి ప్రారం-భించి ఆగిపోయారు. రోసయ్య నువే చెప్పు అన్నట్టు కాళయ్యకు సైగ చేశాడు.

"రాత్రి మీ రొక్కరే ఉన్నారని తెలిసి భయ-పడినామమ్మ. ఖాదర్ బాబాకు జొరమంట గద. అసలే మాయదారి తోడేలు ఆగడం ఎక్కువయింది. మీరు వంటరిగ ఉంటారంటే నిలువలేకపోయినాం తల్లీ. అందుకే రాత్రి రంగయ్యను ఏమార్చి, మెల్లిగా వొచ్చి ఇక్కడ కూర్చున్నాం.... రాత్రి ఒక పొద్దులో, ఎక్కడో-తోడేలు శబ్దం కూడావిన్నాం. రానిమ్మని కాసు-క్కూచున్నాం. ఒక్క దెబ్బతో చంపితే పీడా బొయ్యేది. ముదనష్టపుది రానేలేదమ్మా. ఇట్టనే కూర్చుని చూస్తున్నాం"

నిశ్చేష్టురాలయి వింటోంది డా. మృదుల. ఆమెకు తెలీకుండానే ఆమె కళ్ళు తడి అవుతున్నాయి. కాళయ్య నోట వస్తున్న ఒకొక్క మాట, సూటిగా ఆమె హృదయాన్ని తాకుతున్నాయి.

"అది నిజంగా వస్తే దేంతో చంపే వాళ్ళు?" అడిగింది, వాళ్ళ ఆయుధం తను స్వాధీనం చేసు-కున్న విషయం గుర్తొచ్చి.

నడుంకు కట్టుకున్న తుండు ముక్కల్లోంచి చెరొక చురకత్తి బయటికి తీసారు. "ఇదుగో నమ్మా ఇవి లేవూ?" అన్నాడు రోసయ్య.

డా. మృదుల మరింకేం మాట్లాడలేక పోయింది.

ఆ రాత్రి తన ఇంటికి కాపలాగా, తనకు తోడుగా ఉండి చలిలో, వర్షంలో అవస్థలు పడిన వారిద్దరికీ ధన్యవాదాలు చెప్పాలని ఉంది; కానీ మామూలు మాటలు అందుకు చాలవేమో అన్పించిం దామెకు.

ముందుకు వెళ్ళకుండా, వెనక్కు తిరిగి, "రండి లోపలికి, కాఫీ తాగుదురు" అని, తలుపులు బార్లా తీసి వంట గదిలోకి నడిచింది డా. మృదుల. □



## హత్యలకి దారితీసిన అసభ్య ప్రవర్తన!

ఢిల్లీ జమియా మిలియా కాలేజి విద్యార్థుల్లో ముగ్గురు విద్యార్థులొక అమ్మాయిని అసభ్య మాటలతో వేధించేస్తే ఆమె వెళ్ళి తన అన్నగారితో ఫిర్యాదు చేసిందట ఆ అన్నగారు హుటాహుటిన పది మందితో వచ్చి ఆ ముగ్గుర్ని కత్తులతో పొడిచాడట ఇద్దరక్కడికక్కడే చనిపోయారట

## ఒకసారి తప్పించుకున్నా తప్పని మరణ శిక్ష!

దక్షిణ ఆర్కాటుకు చెందిన అత్తి మాలకులప్పట్టి గ్రామానికి చెందిన ఏకాంబరశెట్టియార్ అనే అతను 17 ఏళ్ళ క్రితం తన మేనమామను చంపి, యావజ్జీవ శిక్ష అనుభవించి, మొన్న 1981లో విడుదలై వచ్చి అదే వూరిలో తన అన్న చంద్రన్‌చెట్టియారున్న యింటి క్రింది వాటాలో వుంటూ, కరెంటు విషయంగా తన అన్నతో వాగ్వాదంలో పడ్డాడట. ఈ ఘర్షణ తారకస్థాయికి చెంది, దాంతో అతనికి ఆవేశం వచ్చి నిద్ర పోతున్న తన అన్నగారిని, ఆతని యిద్దరు కొడుకులను, వో కూతుర్ని నరికి చంపివేశాడట. అడ్డొచ్చిన ఆ చంద్రన్ చెట్టియార్ పెద్ద కూతురు చెయ్యి నరికేశాడట ఈ రాక్షసునికి కోర్టు మరణ శిక్ష విధించిందట. 17 ఏళ్ళ క్రితమే అతనికి ముందు క్రింది కోర్టు మరణ శిక్ష విధిస్తే హైకోర్టు దాన్ని మార్చి యావజ్జీవ శిక్షగా మార్చిందట. ఆలనాడు తప్పిన శిక్ష యీనాడు మళ్ళీ పడిందన్న మాట.

## హత్యకి దారి తీసిన ప్రేమలేఖ!

తంజావూరుకు చెందిన వో ప్రయివేటు పాఠశాలలో ప్లస్‌టు చదువుతున్న 16 ఏళ్ళ అముద అనే అమ్మాయికి ఆమె క్లాస్ మేట్ రాజేష్ అనే అతను వో ప్రేమ లేఖ రాశాడట అంతకు ముందు అతను చేసిన అనేక చిలిపి చేష్టలను భరించిన అముద





అతనిచ్చిన ప్రేమ లేఖను నూటొక్క ముక్కలుగా చింపి, ఆతని ముఖం మీద విస్సిరికొట్టి "ఈ పిచ్చి ఆటలు కట్టిపెట్టు" అని హెచ్చరించిందట. ఆ మర్నాడు రాజేష్ వో క్లాసు వదిలాక ఛెంగున వో గంతులో ఆమెను సమీపించి, తాను రెడీగా తెచ్చుకున్న కత్తితో ఆమె కుత్తుకలో కసకసా పొడిచి ఆమెను చంపివేశాడట.

## అక్రమ సంబంధం-హత్య!

వాణియంబాడికి చెందిన వెళ్ళైకుడై అనే గ్రామంలో ఏడుగురు పిల్లల తల్లి 48 ఏళ్ళ నీలావతి తన మరిది 45 ఏళ్ళ వెంకటేశన్‌తో ప్రేమ కలాపాలు పెట్టుకుని, ఆతనితో లేచిపోయి, పెళ్ళయిన తన పెద్ద కూతురు యింట్లో చేరిందట పెద్ద కూతుర్ని చూడ వచ్చిన నీలావతి భర్త 52 ఏళ్ళ గోవిందసామి అక్కడ తన భార్య ప్రేమ క్రీడలు చూసి ఆవేశంతో వారిద్దర్నీ కొట్టబోయేసరికి పారిపోయారట. ఆ మర్నాడు వెంకటేశన్ పీకమొయ్యా త్రాగి, అన్న యింటి మీద పడి బండ బూతులు తిట్టనారంభించేసరికి ఆ గోవిందసామికి వొళ్ళు మండి చేతి కందిన దుడ్డు కర్రతో అతని బుర్ర పగలేసి చంపేశాట్ట.

## పట్టుబడి ప్రియురాలితో సహా ఆత్మ హత్య చేసుకున్న దొంగ

తమిళనాడు పోడూరుకు చెందిన కడలాడి గ్రామానికి చెందిన మునుస్వామి మద్రాసు, నగరంలో అనేక దొంగతనాలు చేశాడట., తాళాలు పగలేసి, యిళ్ళు దోచుకోవడం అతని స్పెషలు సబ్జక్టట. అంత బ్రతకూ బ్రతికి మొన్న పోలీసులకు దొరికి అరెస్టయి. హైకోర్టు ద్వారా బైలు పొంది తనకి దొంగతనాలలో చేదోడు వాదోడుగా వున్న తన ప్రేయసి 24 ఏళ్ళ మరికణ్ణు యింటికి వెళ్ళి, అక్కడ యిద్దరూ కలసి వో నిర్ణయానికి వచ్చి ఆ విషయం వ్రాసి, విషం త్రాగి చనిపోయారట.

## సినిమా హాళ్ళలో అగ్ర స్థానంలో ఉన్న ఆంధ్ర ప్రదేశ్!

భారత దేశంలో సుమారుగా పదకొండువేల థియేటరు లున్నాయట. వీటిలో సుమారు ఏడువేలు శాశ్వతమైనవిట. వీటిలో 2052 థియేటరులు మన ఆంధ్ర రాష్ట్రంలోనే వున్నాయట. అనగా దేశం మొత్తం మీద ఆంధ్ర రాష్ట్రంలోనేఎక్కువ థియేటర్లున్నాయట.

## నకిలీ గొలుసుతో మోసం!

బెంగుళూరు బసవనగుడి ప్రాంతానికి చెందిన సవిత అనే వో యిల్లాలు మార్కెట్టుకెళ్ళి దారిలో వో యిద్దరు రాడవాంద్రను కలిసిందట. వారు కొంచెంసేపటికి ఆమెకు చాలా సన్నిహితంగా అయిపోయారట. మార్కెట్టు నుంచి ముగ్గురూ కలసి సవిత యింటికి వచ్చారుట. మాటల సందర్భంలో అందులో బిహమి తన మెడలోని పది తులాల బంగారు గొలుసు తీసి సవిత చేతిలో పెట్టి, ఏదీ మీ



గొలుసు చూద్దాం అని, నాలుగున్నర తులాల గొలుసు సవిత దగ్గర్నుంచి తీసుకుందిట. మరి కాస్సేపు మాటా మంతీ అయ్యాక, ఆ గొలుసు మెళ్ళో వేసుకుని, వెళ్ళొస్తామని, నా గొలుసు పది తులాల్ది రేపిచ్చెయ్యండి అంటూ పోయారట ఆనక సవిత యీ నగను కంసాలికి చూపిస్తే అతను (తన) పెదిమ చప్పరించి "ఇది నకిలీ నగ, రోల్డు గోల్డు... హవుడు" అన్నాట్ట –

## బాబోయ్! బాయ్ ఫ్రెండ్స్!

ఈక్విడార్‌కు చెందిన విడా అనే వో సుందరికి పెడ్రో బసి అనే అబ్బాయికి చర్చిలో వివాహ తతంగం జరుగుతూండగా వో పదిహేడుమంది యువకులు వచ్చి ఆ 'విడా'ను చుపుక్కు చుపుక్కున ముద్దులతోను కౌగిలింతలతోను ముంచెత్తారట వాటీజ్దిస్ అని లోకల్ భాషలో ప్రశ్నించిన ఈ పెళ్ళి కుమారుడు వారంతా తన కాబోతున్న భార్యామణిగారి మగ స్నేహితులని తెలిసి బావురుమన్నాడట □

సీరియల్

# ఒకే అమ్మ కథ

అన్నపూర్ణ

(గత సంచిక తరువాయి)

అనుకున్న ప్రకారం మధు వివాహం దేదీప్యమానంగా జరిగిపోయింది... పెళ్ళికూతురి పేరు పద్మ. స్కూల్‌ఫైనల్ వరకూ చదివింది. మధువాళ్ళ ఊరుకు దగ్గరలోనే ఉంది వాళ్ళ పల్లెకూడా. కొద్దిగా స్థితిమంతులవటంమూలాన అడక్కుండానే అన్ని లాంఛనాలు ముట్టచెప్పి ఘనమైన ఏర్పాట్లతోనే పెళ్ళితంతు జరిపించేశారు పద్మ వాళ్ళ పెద్దలు.

పెళ్ళి ఐపోయిననాడే ‘‘మధూ, నేను మా ఇంటికి వెళ్ళిపోతాను’’ అన్నాడు ఆనంద్. అందుకు మధు ఒప్పుకోలేదు, ‘‘మా ఊరు వచ్చి ఇంకో రెండు రోజులుండి వెళ్ళ్దగానిలే’’ అంటూ అతణ్ణి ఆపుచేశాడు. ఏమిటో పక్కనే ఆనంద్ ఉంటే మంచి కాలక్షేపంగాను, ధైర్యంగాను ఉంటోంది మధుకు. అలాంటిది అతడు వెళ్ళిపోతే ఆ వెలితిని ప్రస్తుత పరిస్థితిలో తను భరించగలడా ? అన్నది మధు అనుమానం.

మిత్రుడి మాటను అంత సులభంగా తీసివేయలేక పోయాడు ఆనంద్.

అదేం చిత్రమో ! ఆ రోజు రాత్రే వాంతులు ప్రారంభమైనాయి ఆనంద్‌కు. మరునాటి ఉదయానికి జ్వరంతో పేలిపోతోంది అతడి ఒళ్ళు.

ఖంగారుపడి మధు వెళ్ళి డాక్టర్ని తీసుకువచ్చి చూపించాడు. జ్వరం తీవ్రంగా ఉందని ఇంజక్షన్ చేసి ఏవో మందులు, మాత్రలు ఇచ్చి గంటకు ఒకటి చొప్పున మింగించమన్నాడు ఆయన.

‘‘ఆ టేబ్‌లేట్స్ ఇటుతే మధు బాబూ, ఆనంద్ సంగతి నేను చూసుకుంటాను’’ అంది అమృత డాక్టరును సాగనంపి లోపలికి వచ్చిన మధుతో. అలాగే వాట్ని ఆమె చేతిలో పెట్టాడు అతడు.

మూడు నిద్రల ఆచారంమీద వచ్చినతాను అప్పుడే కాపురానికి వచ్చేసినట్లు అటూ ఇటూ పచార్లు చేస్తూ అందరికీ పనులు పురమాయించేస్తోంది పద్మ. నిన్నటివరకూ ఎవరు ఎవరో తెలియని మధుతో పూర్వ పరిచయమున్నట్లే మాట్లాడేస్తోంది. మధ్యలో పరిహాసాలు చేసి తను నవ్వుతూ మధునూ నవ్వించటానికి ప్రయత్నిస్తోంది.

ఇంట్లో ఉన్న బంధువులకు, కొత్త పెళ్ళికూతుర్ని చూసి పోదామని వచ్చిన ఊళ్ళో అమ్మలక్కలకు పద్మ ప్రవర్తన తీరు ఆశ్చర్యకరంగానూ ఉంది. ‘‘మా కాలంలో ఇటువంటివి మేం ఎరుగమమ్మా’’ అని నిన్నటి తరానికి చెందిన ఒక ముత్తయిదువ వ్యాఖ్యానిస్తే, ‘‘మీ కాలం చెల్లిపోయిందిలేవే పెద్దమ్మా. ఆరోజుల్లో కూపస్థమండూకం. ఇప్పుడు అలాకాదు. చాలావరకు చదువుకుంటున్నారు. నాగరికత తెలిసిన వాళ్ళు, నలుగురిమధ్య తిరగటానికి అలవాటు పడినవాళ్ళు మీలా మూలన గదిలో సిగ్గుపడుతూ ఎలాకూర్చుంటారు ?’’ అంటూ నేటి సమాజానికి చెందిన ఓ యువతి పద్మ ప్రవర్తనను మెచ్చుకొంది.

అన్ని గమనించిన నాంచారమ్మ, ‘‘అమ్మా, పద్మా ! ఇంట్లో ఇంత మందిమి ఉన్నాం కదా? నువ్వెందుకు తల్లీ హైరానపడతావ్ ? వెళ్ళి విశ్రాంతిగా గదిలో కూర్చో’’ అని బామాలుతూ చెప్పింది, ‘కొత్త పెళ్ళికూతురు మూడు నిద్రలకు వచ్చి అత్తగారింట్లో వ్యవహరించవలసిన తీరు ఇది కాదు’ అని గట్టిగా చెప్పలేక. అందులో సంప్రదాయాలకు, ఆచారాలకు ప్రాణం ఇచ్చే వ్యక్తి నాంచారమ్మ. పద్మ చొరవ, ప్రవర్తన చూస్తుంటే ఆవిడ ఒంటిమీద తేళ్ళు, జెర్రులు పాకుతున్నయ్ మరి.

పెద్దావిడ మాటను తీసివేయలేక తన గదిలోకి వచ్చింది పద్మ. తీరుబడిగా కూర్చొని ఆలోచించిన ఆమెకు ‘ఎవరో పరాయి వ్యక్తి మంచంలోపడి ఉండటము, అతణ్ణి కంటికి రెప్పలా చూసుకొంటూ అమృత అక్కడే ఒక కుర్చీలో కూర్చోవటము’ ఏమిటో వింతఅనిపించింది.

‘అమృత వయసుమీరిన మనిషి కాదు. మంచంలో ఉన్న అతడూ కాటికి కాళ్ళు చాచ

**జరిగిన కథ–6 :** మూర్తి భార్య బలవంతంపై భార్య మణి, కుమారుడు ఉదయ్‌లో కలసి కొండపాడు ‘అమ్మ’ ఆశ్రమానికి వెళతాడు. అక్కడ ‘అమ్మ’ భక్తుల ప్రశ్నలకు ఇచ్చిన సమాధానాలు అతనికి నచ్చాయి. తన అనారోగ్యం గురించి ఆమెకు నివేదించుకొని ఆమె సలహా ప్రకారం ఆ ఆశ్రమంలోనే కొద్ది రోజులు ఉండను నిశ్చయించుకున్నాడు. పై విషయాలన్నీ స్నేహితుడు జగన్‌కు ఉత్తరం ద్వారా తెలియపరచి అతనిని ఒకసారి వచ్చి ఆశ్రమం దర్శించమని రాసాడు. ఆశ్రమానికి వచ్చిన జగన్ అమ్మను అమృతగా గుర్తిస్తాడు. అమృత తన విచిత్ర కధను మూర్తి దంపతుల కోరికపై చెప్పసాగింది — వేణుగోపాలస్వామి గుడిలో అర్చకుడు గోవిందయ్య కూతురు అమృత. ఊరి పెద్దల సలహాపై కూతురిని ఒక రెండవ పెళ్ళివాడికి ఇచ్చి పెళ్ళి జరిపించను అంగీకరిస్తాడు గోవిందయ్య. అమృత వివాహం రోగిష్టి అయిన సుందరరామయ్యతో జరిగిపోతోంది. సవితి కొడుకు మధుకి అమృతంటె జాలి. అతను ఆమెను చదువుకోమని ప్రోత్సహిస్తాడు. మధు, అమృత మాటలు చాటు నుంచి విన్న సుందరరామయ్య ఆలోచనలో పడ్తాడు. సుందరరామయ్యగారు మధుతోపాటు అమృతనీ పట్నంలో ఉంచి ట్యుటోరియల్ కాలేజీలో చేరుస్తారు. అమృత వాళ్ళింటిప్రక్క మేడలోని ఆనంద్ అమృతకు ప్రేమలేఖ రాస్తాడు. పిన్ని ఆదేశానుసారం ఆనంద్‌ను తమ ఇంటికి ఆహ్వానిస్తాడు మధు. ఇంటికి వచ్చిన ఆనంద్‌ను తన మాటలతో పాశ్చాత్తాప పడేటట్లు చేస్తుంది అమృత. రాజారావు అమృత మధులకు అక్రమ సంబంధముందని ప్రచారంచేస్తాడు. ఈ వార్త విని అవమాన భారంతో ఇల్లు విడిచిపెట్టి వెళ్ళిపోతాడు అమృత తండ్రి. ఇంటికి వచ్చిన రాజారావుకి బుద్ధి చెప్పి పంపిస్తుంది అమృత. పిన్ని మేలుకోరి పెళ్ళికి అంగీకరిస్తాడు మధు. రాజారావు మోసంతో అమృత శీలాన్ని హరించబోగా డ్రైవర్ సింహాద్రి ఆమెను రక్షిస్తాడు.

లేదు. ఇద్దరూ వయసులోనే ఉన్నారు... అలాంటిది ఆ పరాయి యువకుడికి జ్వరం తగిలినంతమాత్రాన ఇరవై నాలుగ్గంటలూ అతడి ప్రక్కనే కూర్చోవటమా!? ఆవిడగారికి సిగ్గు లేకపోతే మాత్రం? ఇంట్లో పెద్దలు అంతా చూసీ చూడనట్లు ఊరుకుండిపోవడమేమిటి! వాళ్ళను చూసి ఎవరు ఏమనుకుంటారో అని వీళ్ళు ఆలోచించనక్కర్లా?... అసలు తన అత్తగారి (అమృత) ఆంతర్యమేమిటో తెలుసుకోవాలి. అవసరమైతే, తన భర్త, మామగారు, అమ్మమ్మగారు చేయలేని సాహసం తను చెయ్యాలి. వాళ్ళకు బుద్ధి చెప్పాలి' అనుకొని ఆనంద్ ఉన్న గదిలోకి వెళ్ళింది.

ఆ సమయంలో ఆనంద్ కళ్ళు మూసుకొని మగతగా పడుకొని ఉన్నాడు. అతడివైపే జాలిగా చూస్తూ కూర్చొనిఉన్న అమృత పద్మనుచూసి, ''రా పద్మా... పాపం, ఆనంద్‌కు ఇంకా జ్వరం తగ్గలేదు'' అంది లేచి నిలబడి.

''మీరు దగ్గిరే కూర్చొని స్వయంగా మందు మాత్రలు మింగిస్తున్నా తగ్గలేదా జ్వరం!'' వ్యంగ్యంగా ధ్వనించింది పద్మ కంఠం.. అర్థం చేసుకొంది అమృత.

''మందు మాత్రలు ఎవరు మింగిస్తే మాత్రం?... జ్వరం తగ్గొద్దూ?'' అంది.

''అదే అంటున్నాను నేనూను... మీరే ఇంత శ్రద్ధ తీసుకొని అతడికి సపర్యలు చేయ చేయవలసిన అవసరమేమిటి?... ఆనంద్‌గారు మావారికి మాత్రం మిత్రులుకారా?... తన మిత్రుడి ఆరోగ్యం గురించిన బాధ్యత వారికి లేదా?''

''నిజమే పద్మా! ఆనంద్ అనారోగ్యం గురించి నాకంటే మీవారే ఎక్కువ శ్రద్ధ తీసుకోవాలి... మరి అలా జరగలేదు.''

''ఎందుకని?''

''ఇంతకూ నీ మాటల తాత్పర్యం?''

''ఆనంద్‌గారిని గురించి మీకంత ఇంట్రెస్ట్ ఏమిటి అనే నేను అడుగుతున్నది.''

''మా అనుబంధం గురించి అడగవలసిన అవసరం నీకు, చెప్పవలసిన అవసరం నాకూ లేదు పద్మా.''

''ఈ ఇంటి గౌరవం, మర్యాద...?''

''వాట్ని గురించి మాట్లాడే అర్హత నీకు ఎక్కడిది?''

వాళ్ళ మాటలు విని బయటి నుంచీ మధు వచ్చాడు. నిద్ర మెలకువ వచ్చిందిగామలు ఆనంద్ లేచి కూర్చున్నాడు.

''పద్మా!... ఇందాకటినుంచి వింటున్నాను.. బుద్ధి జ్ఞానంలేకుండా ఏమిటి అనవసరమైన మాటలు? నువ్వు చదువుకున్నదానివి కాదూ? అనుబంధాలను అర్థం చేసుకోలేకపోతే నోరు మూసుకొని కూర్చోవాలి. అంతేగాని అభాండాలు వేసెయ్యటమేనా?'' అంటూ భార్యను గట్టిగా మందలించాడు మధు.



"మీరూ, నన్నే అంటున్నారన్నమాట! అనండి...అనండి..." ఉక్రోషంతో కన్నీటి పర్యంతమై అక్కణ్ణుంచి వెళ్లిపోయింది పద్మ.

"సారీ, మధూ! నావల్ల అనవసరమైన ఘర్షణలు...నువ్వు వేరేవిధంగా భావించుకోవద్దు ...నేను ఈరోజు సాయంత్రమే వెళ్ళిపోతాను మా ఊరు" అన్నాడు ఆనంద్.

"ఎవరో ఏదో తెలిసీ తెలియక వాగినందుకు నువ్వు బాధపడకు ఆనంద్. ఈరోజువరకు చూసి జ్వరం తగ్గిపోతే రేపు ఉదయం వెళ్లిపోదుగాని." అన్నాడు మధు ప్రాధేయపడుతున్నట్లే.

"ఔను ఆనంద్! మధుబాబు మాట విను. నామాటా అదే" అంది అమృత.

అలా అన్న ఆమె వైపు జాలిగా చూస్తూ గట్టిగా నిట్టూర్చాడు ఆనంద్. తర్వాత,

"మధు ముఖంమీదే చెబుతున్నాను పిన్నీ నీకు... వీడి భార్య వాలకం చూస్తూంటే నాకంతా అయోమయంగా ఉంది. ఎప్పుడైనా నీకు ఏమాత్రం కష్టం కలిగినా నన్ను గుర్తు పెట్టుకో...ఏరా, మధూ! నా మాటలు బాధ పెడితే నన్ను క్షమించు. రేపు ఏదో ఒకనాడు నువ్వు అటు నీ భార్యకు సర్ది చెప్పకోలేక, ఇటు పిన్నిని నోరుతెరిచి ఏమీ అనలేక సందిగ్ధ పరిస్థితి ఏర్పడవచ్చు. పిన్నీ నీకెంతో నాకూ అంతే. ఏంపిన్నీ, నన్ను గుర్తు పెట్టుకుంటావుగా?" అని తిరిగి నీరసంగా పడుకుండిపోయాడు ఆనంద్.

అతడి మాటలకు 'సరే' అనేశారు అమృత, మధులు.

ఈలోగా "అమృతా! మాట ఉంది ఇలారా. మధూ, నీవు ఉండు ఆనంద్ దగ్గిర" అని ఏదో తొందరపని ఉన్నట్లు అమృతను పిలిచాడు సుందరరామయ్య.

ఆమె ఇవతలికివచ్చాక, "నువ్వు లోపలికి వెళ్లి పనులు చూసుకో అమృతా! ఆనంద్ దగ్గిర మధు ఉంటాడులే" అని పక్కకు తప్పుకున్నాడు సుందరరామయ్య. భర్త ఆంతర్యాన్ని గ్రహించిన అమృత అతడు చెప్పినట్లే చేసింది.

ఆ సాయంత్రానికి జ్వరం తగ్గింది ఆనంద్‌కు. రాత్రికి పథ్యం తినిపించారు.

మర్నాడు తెల్లవారేసరికల్లా ప్రయాణానికి సిద్ధమై కూర్చున్నాడు ఆనంద్.

మధు "బస్‌స్టేజీదాకా నేనూ వస్తా పద ఆనంద్" అని బయలుదేరాడు.

"పిన్నిని నా దగ్గిరికి రావద్దని మీ నాన్నగారు శాసించినట్లున్నారు ... నేను వెళ్లినట్లు చెప్పు మధూ ... నువ్వు కూడా నన్ను గుర్తు పెట్టుకో ఏం?"

"అలాగే ఆనంద్ ... పిన్నిని నీ దగ్గిరికి రావద్దని మా నాన్నగారు శాసించి ఉంటారని నేను అనుకోవటంలేదు. ఉండు పిన్నిని పిలుస్తాను."

"వద్దు మధూ పద వెళ్దాం" మొండిగా ముందుకు అడుగు వేశాడు ఆనంద్. అనుసరించాడు మధు.

## 18

పెళ్ళై పదహారు రోజుల పండుగ వెళ్ళటంతోనే శోభనం చేసేశారు. మంచి హంగు ఆర్భాటంతో కాపురానికి వచ్చింది పద్మ.

అందమైన పద్మతో తనకు వివాహం జరగటం, ఆమె కాపురానికికూడా వచ్చెయ్యటం ఎలాంటి కొత్త అనుభూతి, ఆనందము లాంటిది కలగలేదు మధులో... అతడిదంతా ఒకటే ధ్యాస. ఎక్కడో పొందగూడని పరాభవంపొంది, అస్తవ్యస్త పరిస్థితుల్లో ఇంటికివచ్చిన అమృత ఆ దృశ్యమే అతని కళ్ళముందు కదలాడుతోంది. ఎంత ప్రయత్నించీ ఆ షాక్‌నుంచీ తేరుకోలేక పోతున్నాడు... 'పిన్ని పరిస్థితి అలా మారిందంటే అందుకు పూర్తి బాధ్యత తనదే. ఆమెను అనవసరంగా ఊబిలోకి దింపాడు... పాపం, పిన్ని ఏమీ తెలియని అమాయకురాలు' ఇలా లోలోపల కుమిలిపోతున్నాడు మధు.

కొడుకు ముఖ కవళికలు, నడవడినిబట్టి అతడిలో ఏదో మార్పు వచ్చిందని అనిపించింది సుందరరామయ్యకు. ఐనా 'నీ దిగులు ఏమిటి' అని నిలదీసి అడగలేకపోతున్నాడు.

ఇటీవల ఆర్టిస్ట్స్ అసోసియేషన్ (విజయవాడ) వారు ప్రదర్శించిన శ్రీ మాడుగుల రామకృష్ణ రచన "పండగొస్తుంది బహుపరాక్" నాటికలో ఒక దృశ్యం.



మధు అలా మారిపోవటానికి కారకురాలు తానే. ఆనాటి దుస్సంఘటన అతడిని మానసికంగా దెబ్బదీసింది. అందుకే దాన్ని మరిచిపోలేక పోతున్నాడు. తనతో అదివరకటిలా మనసువిప్పి మాట్లాడలేక పోతున్నాడు... మధులో తిరిగి వెనుకటి ఉత్సాహం పుంజుకోవాలంటే, మానసికమైన నిస్తబ్ధత తొలగిపోవాలంటే తను కనిపించకుండా ఎటో వెళ్ళిపోవటమే మంచిదేమో? ఇలా తీవ్రంగా ఆలోచిస్తోంది అమృత.

ఇక పద్మ అమృత పేరు వింటేనే అగ్గిమీద గుగ్గిలంగా మారుతోంది. తను మూడు నిద్రలకు వచ్చినప్పుడు పరాయి మగవాడు, ఆనంద్ దగ్గిర కూర్చొని భార్యలా సపర్యలు చేయటం, ఇది మర్యాదకాదు అని చెప్పబోయిన తనతో పేచీకి దిగటం ఇవి ఆమె నేరాలు. దాంతో అమృత సిగ్గు ఎగ్గు విడిచేసిన ఆడదిగా స్థిరపడిపోయింది పద్మహృదయంలో. మరికొంత చెప్పాలంటే ముసలి భర్తవల్ల సుఖాలు పొందలేక అమృత పరపురుషులకోసం గాలం విసురుతోంది. ఆమె నీతిమాలిన వ్యక్తి. అటువంటి హీనురాలితో మాట్లాడటమే మహాపాపం. అమృత ఈ ఇంట్లో ఉన్నంతవరకు తనకు మనశ్శాంతే ఉండదు ఇలా ఉన్నయ్ పద్మ ఆలోచనలు.

ఎవరెలా భావించుకున్నా,కొన్ని సందర్భాలలో నిందాపూర్వకంగానే మాట్లాడుతున్నా మానసికంగా ఎలాంటి అలజడి చెందటంలేదు అమృత. కేవలం మధులో కొంత పరిమార్పు తీసుకురావటానికి తను ఎటైనా వెళ్ళిపోతే బాగుండునని అనుకొంటోంది తప్పితే పరిస్థితులకు భయపడి, తనమీద తాను అసహ్యం పెంచుకొని, విరక్తితో అలా చేయాలనుకోవటంలేదు. పద్మ తనమీద కినుక వహించటం అది ఆమె అమాయకత్వం, కొంత తన దురదృష్టంగా భావించుకొంటోంది. సందర్భం వచ్చినప్పుడు పద్మకు తను సర్ది చెప్పకోగలదనే అమృత నమ్మకం.

* * *

ఎప్పటిలానే ఆ రోజు రాత్రి దేవాలయానికి వెళ్ళింది అమృత.

ఎండాకాలం ఆరుబయట పడుకున్న సుందరరామయ్యకు ఏమిటో అశాంతి అనిపించి ఆమె వెళ్ళిన కొంతసేపటికి తనూ వెళ్ళాడు దేవాలయానికి.

చూస్తే మంటపంలో చేతులు జోడించి, కళ్ళు మూసుకొని స్థిర మనస్కతతో కూర్చొని ఉంది అమృత. అటువంటి ఆమె నిశ్చలతను పాడుచేయటం ఇష్టంలేక తనూ మంటపంలో ఒక ప్రక్కగా కూర్చుండిపోయాడు నిశ్శబ్దంగా.

దాదాపు రెండు గంటల తర్వాత అమృత కళ్ళు తెరిచి సుందరరామయ్యను చూసి,

''మీరు ఎప్పుడు వచ్చారు !'' అడిగింది ఆశ్చర్యంతో.

''చాలాసేపైంది. ఓ కునుకుతీసి ఇప్పుడే లేచాను కూడా'' ఉన్నమాట చెప్పేశాడు సుందరరామయ్య.

''నాతో ఏమైనా మాట్లాడాలనా ?''

''ఔను అమృతా ! ఈ వయసులోనే నీలో ఇంత వైరాగ్యం ఎలా ఏర్పడింది ?''

''నాది వైరాగ్యం కాదండీ. దైవభక్తి. స్థిరచిత్తం కోసం నేను ఏకాగ్రతగా కూర్చుంటాను ఇలా.''

''నీ పిచ్చిగాని, ఎంత స్థిరచిత్తం సంపాదిస్తేమాత్రం ? వయసు, అందుకు సంబంధించిన వాంఛలు ఎలా సమసిపోతయ్ ? నువ్వు ఉప్పు కారం తినే మనిషివే కదా ?''

''కావచ్చు. కానీ, మీరు అనుకుంటున్నట్లుగా వయసు,దానికి సంబంధించిన కోర్కెలు నన్ను ఏనాడూ బాధించలేదు.''

''ఈ విషంలో నీతో నేను ఏకీభవించలేను అమృతా ! ముసలివాణ్ణి, రోగిష్టిమారివాణ్ణి నువ్వు కట్టుకున్నావ్. నీకు నావల్ల జరిగింది ఘోరమైన అన్యాయం. దీన్ని గురించి నేను ఆలోచించి బాధపడని రోజులేదు. నువ్వు చదువు గురించి పట్నంలో ఉన్నన్ని రోజులూ నేను కొంత ఊపిరి పీల్చుకోగలిగాను. ఇప్పుడు నిన్ను చూస్తుంటే తిరిగి నాలో వ్యాకులత మొదలైంది.''

''ఎందుకని ? ఇక్కడ ఉండకుండా నన్ను ఎక్కడికైనా వెళ్ళిపొమ్మంటారా ?''

''నేను ఎక్కడికి వెళ్ళమంటాను, నీవు ఎక్కడికి వెళ్ళగలవ్ ? కనీసం కన్న తండ్రి అండ కూడా నీకు లేకుండా చేశాను. వయోభేదం చూసుకోకుండా నిన్ను పెళ్ళాడటం నేను చేసిన మొదటి తప్పైతే, ఒకే వయసులో ఉన్న నిన్ను మధును ఒకే ఇంట్లో ఉంచి చదివించటం నా రెండో తప్పు.''

''ఇంతకూ మీరు చెప్పదలుచుకున్నదేమిటి? ఎన్నడూ లేంది ఏమేమో మాట్లాడేస్తున్నారు?''

''ఏంలేదు అమృతా. అసలు నేను ఇక్కడికి వచ్చింది మధును గురించి నీతో మాట్లాడాలని. వాణ్ణి నువ్వూ చూస్తూనే ఉన్నావుగా ? అస్తమానం ఎదో పోగొట్టుకున్నట్లు, దేన్ని గురించో బాధపడుతున్నట్లు కనిపిస్తాడేమిటి ? ఒకవేళ వాడు పట్నంలో వేరే అమ్మాయిని ప్రేమించి''

''అలాంటిదేం లేదు. పద్మను అతడు మన స్ఫూర్తిగానే పెళ్ళాడాడు.''

''మరి ఎందుకు అలా కనిపిస్తున్నాడు ?''

''అందుకు కారకురాల్ని నేనేనండీ !''

'అమృతా ! ?''

''ఔనండీ. మధుబాబులో ఆదర్శాలున్నయ్, ఆలోచనలు ఉన్నయ్. కానీ, వాట్ని ఆచరణలో పెట్టగలిగేంతటి గుండెనిబ్బరమే లేదు అతడిలో. చదువుకొమని ప్రోత్సహించాడు. మీ సహకారంతో నన్ను పట్నం తీసుకువెళ్ళాడు. అంతవరకు బాగానే జరిగింది. పట్నంలో మేమిద్దరం ఒకే ఇంట్లో ఉండటం మొదలుపెట్టాకే అతడిలోని మానసిక బలహీనతలు బయటపడ్డాయి. పల్లెపట్టున ఉంటున్నా, ఆధునికత తెలియక పోయినా, సనాతన ధర్మాలనే విశ్వసిస్తున్నా మీరే నయం. ఒకేవయసులో ఉన్న మేము ఒకే ఇంట్లో మసలుకోవలసిరావటం, మమ్మల్నిగురించి కొందరు వ్యాఖ్యానాలు చేయటంతో అతడిలో ఘర్షణ మొదలైంది. మా ఇద్దరి మీద వేయకూడని నిందలు వేసి మా నాన్న ఇల్లు వదిలి వెళ్లిపోవటంతో అది పరాకాష్టకు చేరుకొంది. విన్నతరువాత మీరు ఎలా అభిప్రాయపడతారో గాని ఈమధ్య మరో ముఖ్యసంఘటన జరిగింది. అదే అతణ్ణి మానసికంగా దెబ్బకొట్టింది.''

''ఏమిటది ?''

''నన్ను ఎవరో బలాత్కరించారనీ, నా జీవితం నాశనం ఐపోయిందనీ అభిప్రాయపడుతున్నాడు మధుబాబు. అదే అతడి హృదయంలో పాతుకుపోయింది.''

''అసలేంజరిగింది ?''

జరిగింది జరిగినట్లేచెప్పి, ''నా గురించిన వ్యాకులతే మనసులో పెట్టుకొని పరీక్షలు బాగా వ్రాయలేడేమోనని నేను మర్నాడే ఇక్కడికి బయలుదేరి వచ్చేశాను. 'మధు పరీక్షలు పూర్తైందాకా ఉండమన్నానుగా, అప్పుడే వచ్చేశావేం ?' అని మీరడిగితే, 'ఏమిటో అక్కడ ఉండబుద్ధి కావటంలేదండీ' అని సమాధానమిచ్చాను మీకు. గుర్తుందా ?'' అడిగింది అమృత.

''గుర్తుంది. ఇదన్నమాట అసలు విషయం !'' అన్నాడు సుందరరామయ్య పైకి.

''మరి ఇప్పుడు మీరేమంటారు నా గురించి ?''

''నేనేమంటాను, అమృతా ! ఏమీ జరగలేదంటున్నావుగా ? పొరబాటున ఏమైనా జరిగినా అందుకు బాధ్యురాలివి నీవెలా ఐతావ్ ?''

''నిజంగా మీదెంత మంచి మనసండీ ! మీలో పదోవంతు ఆత్మస్థైర్యం ఉన్నా మధుబాబు ఆనాటి షాక్ నుంచి తేరుకోగలిగేవాడేమో ? ''

''విషయం తెల్సింది కద ? మధుకు నేను సర్దిచెబుతాలే అమృతా, కాకపోతే కోడలిదే సమస్య. ఆమెకు నీమీద సదభిప్రాయమున్నట్లు లేదు.''

''నేనూ గమనించానండీ.''

''కోడలి విషయంలో కొంచెం మెలకువగా ఉండు అమృతా ! ఆమె వొట్టి తొందరపాటు మనిషిలా ఉంది. పద్మ వల్ల కూడా అశాంతి మొదలైతే మధు లేతగుండె తట్టుకోలేదు.''

''పరిస్థితి అంతవరకు రానివ్వనులెండి.''

ఇద్దరూ మాట్లాడుకొంటూనే దేవాలయం నుంచి ఇవతలికి వచ్చేశారు.

## 19

''మధూ ! దక్షిణం వైపు పొలంలో గట్లు పెడుతున్నారు. పని ఎంతవరకు వచ్చిందో చూసి వద్దాం పద'' అన్నాడు సుందరరామయ్య ఆ సాయంత్రం.

''మీకు అసలే ఆరోగ్యం బావుండలేదుకద ? నేనువెళ్లి చూసివస్తాలే నాన్నగారూ'' తాను ఒక్కడే పొలం వెళ్లిరావటానికి ఉద్యుక్తుడయ్యాడు మధు.

''నా ఆరోగ్యానికేం ? బాగానే ఉన్నానుగా? ఐనా ఇంటిదగ్గర కూర్చుంటే ఏమిటో తోచటం లేదు. పద ఇద్దరం కలిసివెళ్దాం'' అంటూ మధుతో కలిసి పొలం దగ్గిరికి వచ్చాడు సుందరరామయ్య.చేనుకు గట్టు పెడుతున్నవిధానం చూసి, పాలేళ్లకు ఏవో సలహాలిచ్చి, ''కాసేపు చల్లగాలికి కూర్చొని వెళ్దాం...రా'' అంటూ కొద్దిదూరం తీసుకువెళ్లాడు. ఒక చెట్టు నీడన తీరుబడిగా కూర్చున్నారు ఇద్దరూ. కొంతసేపు ఒక్కరూ



పెదవి విప్పలేదు. ఎవరి ఆలోచనలో వాళ్లు ఉండి పోయారు.

"మీ పిన్నిని గురించి నీ అభిప్రాయమేమిటి మధూ ?"

ఉన్నట్లుండి తండ్రి అడిగిన ఆ ప్రశ్నకు కలవరపాటు చెందాడు మధు.

"పిన్ని...పిన్నికేం ? ఎంతో ఉత్తమురాలు నాన్నగారూ ఆమె !"

"ఈమధ్య నీవు అదివరకటిలా ఉత్సాహంగా కనపడటంలేదు. ఏదో పోగొట్టుకున్న వాడిలా ఆలోచిస్తున్నావ్. ఎందుచేత ?"

"అలాంటిదేమీలేదు. నేను మామూలుగా ఉత్సాహంగానే ఉంటున్నాను నాన్నగారూ."

"బుకాయించి ప్రయోజనంలేదు మధూ ! అమృత నాకు అంతా చెప్పేసింది."

"ఏం చెప్పింది ?"

"తాను టేక్సీలో వెళ్లటం, కొందరు దుర్మార్గులు పరాభవించబోవటం ... అందుకు అనుకూలించిన పరిస్థితులు, తర్వాత నీలో వచ్చిన మార్పు..."

"అంతా చెప్పేసిందన్నమాట ! ఏ విషయం ఎవరికి చెప్పాలో, ఎవరికి చెప్పకూడదో గూడా తెలియకుండాపోయింది ఆ మనిషికి."

"ఏం ? నిజం నాకు తెలియకూడదనా ?"

"తెలిసినందువల్ల కలిగేఫలితం ? మీరూ మానసికంగా అశాంతిపాలు గావటమేగా ?"

# ఒక అమ్మ కథ

నిజమే అనిపించింది సుందరరామయ్యకు. 'జరిగింది ఇది' అని చెప్పినప్పుడు 'అంతే గామాల్సును' అని సరిపెట్టుకున్నాడు. తర్వాత తీరుబాటుగా ఆలోచించినప్పుడు అమృత చెప్పిం దాంట్లో ఎంతవరకు నిజం ఉందన్న మీమాంస బయలుదేరింది. 'ఒక ఆడదానిగా తన్ని తాను కాపాడుకోవటంకోసం కథలు వినిపిస్తోందేమో ? కావచ్చు... ఏమీ జరగలేదంటోంది గాని, ఏదో జరగకూడనిది జరిగే ఉంటుంది. అది ఆమె స్వయంకృతాపరాధం కాకపోవచ్చు. విధికృతమే కావచ్చు... కానీ ఏర్పడింది మాయని మచ్చ ... నిజం నిప్పులాంటిది. ఏనాటికైనా సంగతి బయటికి పొక్కితే తను, తన పరువుప్రతిష్ఠ ఏమైపోవాలి ?" ఇలా ఒకటే ఇదైపోతున్నాడు తనూను అప్పట్నుంచీ.

మధు చెప్పినట్లు అమృత జరిగిన సంగతి తనలోనే దాచుకోకుండా ఎందుకు బయట పెట్టాలి ? గట్టిగా నిట్టూర్చాడు సుందర రామయ్య కానీ పైకి ఏమీ అనలేక పోయాడు.

"అయితే పిన్నిపట్ల కలిగిన అభిప్రాయ మేమిటో మీరే చెప్పాలి నాన్నగారూ, ఇప్పుడు."

తను ఎక్కుపెట్టిన బాణం తనకే వచ్చి తగిలినట్లు కొంచెంసేపు గిలగిల తన్నుకున్నాడు సుందరరామయ్య. తర్వాత,

"అమృత ఒక విచిత్రమైన వ్యక్తి మధూ! ఆమె మనస్తత్వం మనలాంటి వాళ్ళకు అంతు పట్టదు. మనవల్ల జరిగింది అన్యాయమే ఐనా, తను జీవచ్ఛవంలా బ్రతుకుతున్నా అమృతకు కావలసింది నా సంపూర్ణ ఆరోగ్యం, నువ్వు ఉల్లాసంగా కనిపిస్తూ హాయిగా బ్రతకటం ఇంతకుమించి మనల్నుంచీ మరేమీ ఆశించటం లేదు ఆమె. అమృత కావాలని ఏ తప్పు చేయదు. నాకు తెలుసు. ఇప్పటికీ నేను ఆమెను విశ్వ సిస్తాను. ఐతే ఇది కుళ్ళులోకం. ముందుముందు అది మనపట్ల ఎలా వ్యవహరిస్తుందోననే కొంత భయపడుతున్నాను" అన్నాడు.

"మొత్తానికి మీరూ నా మనస్థితికే వచ్చారు నాన్నా. పిన్నిని గురించిన శంకలు నాలోనూ లేవు. కాకపోతే బ్రతుకులు ముడి పెట్టబడి ఉన్న ఈ సంఘటనలో ముందు ముందు ఎలా తల ఎత్తుకు తిరగటమా అనే నేను ఆలోచిస్తున్నాను. దీనికి అంతటికీ మూలం నేనేకద ? అందుకే మూగ వేదన అనుభ విస్తున్నాను నాన్నగారూ."

"మరి ఈ సమస్యకు పరిష్కారం ?"

"మన చేతుల్లో లేదు. కాలమే నిర్ణ యించాలి నాన్నగారూ" అంటూ లేచి నిల బడ్డాడు మధు. తప్పదన్నట్లే కొడుకును అనుస రించాడు సుందరరామయ్య.

## దసరా స్వాగత గీతిక

వెన్నెలంటి సొగసుతోడ
వెన్నపూస మనసుతోడ
అలనల్లన నరుగుదెంచె
అందమైన నవరాత్రులు

నీలవర్ణపు నభములో
ధవళ తారలు ఉదయించెను
విరిసిన విరజాజులు
వనితల తలలో విలసిల్లెను

ముచ్చటైన ముగ్గులతో
ముంగిలిలు మురిసెను
ముగ్ధ మనసు హర్షముతో
ముకురమై శోభిల్లెను

పారిజాత పందిరి క్రింద
నెమిలి నాట్యమాడెను
తెల్లని రోజా మొగ్గలు
ఇంపుగ రేకులు విప్పెను

ప్రతి మనమ్మున చల్లని
నవ్వుల జల్లు కురిసెను
రమ్ము రమ్ము వేగమ్మున
నీకిదే మా స్వాగతమ్ము !

—కె. వి. నాగేశ్వరరావు

## దసరా స్వాగతం

**మకుట పింఛము తలన మరిచంక నొక విల్లు**
**మ్రొక్కి బంట్లన మొక్క జొన్న చేలు,**
**ముత్యాల పొదిగింది మురిపాన నూపెడు**
**పసిడి జెండలు యన పజ్జొన్న చేలు,**
**బారులై నిలిచి భరత నాట్యాన కులికెడు**
కుంద వదన లనగ కంది చేలు,
ముదినిండ తేనియల్ మత్తుగా నింపుకొని
చెలిమిగా పిలిచేటి చెఱకు చేలు
ఎత్తు పల్లాలపై వేసి పచ్చని పైట
కన్నె ప్రకృతి కను విందు గొలిపి
రక్తాక్షి దారిన రారాజు దసరకు
స్వాగతాలిచ్చినవి సంతసమున !

—**పూట్ల భద్రయ్య**

## 20

''రాజా ! వచ్చావా నాయనా ! నువ్వు ఎటు వెళ్ళిపోయేవో అని ఈ నెల రోజుల నుంచీ ఒకటే దిగులుపడి చస్తున్నాం కదరా...'' అంటూ తన కొడుకు రాజారావు కళ్ళకు కనిపించటంతో ఏనుగంత బలం వచ్చినట్లై ఎదురు వెళ్ళింది అతడి తల్లి సావిత్రమ్మ.

''నేను వచ్చేశాను. ఇక దిగులుపడకే అమ్మా. అసలు జరిగిందేమిటంటే మా పరీక్షలు పూర్తైపోయాయి. ఈ పల్లెకు వచ్చి పొలం పుట్ట పట్టుకు తిరిగేకంటే దేశయాత్ర చేసి నాలుగు ప్రదేశాలు చూడటం మంచిదని పరీక్షలైపోయిన మర్నాడే ట్రెయిన్ ఎక్కేశాను, మా మిత్రులతో కలిసి... మంద్రాస్, బెంగుళూరు, కన్యాకుమారి, తిరుపతి—సౌత్ ఇండియా అంతా తిరిగేశాను. మేం బయలుదేరినప్పుడు నా దగ్గిర ఐదువందలే ఉంది. అవి చాలక నా మిత్రుడు రమేష్ దగ్గిర మరో వెయ్యి తీసుకున్నాను అప్పుగా. నాన్నగారికి చెప్పి ఆ డబ్బు నాకు ఇప్పించే ఏర్పాటు నువ్వే చెయ్యాలమ్మా...'' అంటూ విషయం చెప్పుకొచ్చి చివరికి తల్లి గడ్డం పట్టుకున్నాడు రాజారావు.

''అలాగేలేరా నాయనా... ముందు స్నానం చేసి భోంచెయ్. తర్వాత అన్నీ తీరుబడిగా మాట్లాడుకోవచ్చు'' చెప్పకుండా ఎటో వెళ్ళిపోయాడనుకున్న ఒక్కగానొక్క కొడుకు భద్రంగా తిరిగిరావటమే వరప్రసాదంగా భావించుకొంటోంది సావిత్రమ్మ. ఆ సంతోషంలో అతడు అడిగిన దానికి వెంటనే ఓ. కె. అనేసింది ప్రేమకొద్దీ.

తల్లిమాట అన్నదంటే ఇక దానికి తిరుగే ఉండదని రాజారావుకు తెలుసు. అందుకే అమితోత్సాహంతో సావిత్రమ్మ చెప్పినట్లే చేశాడు... అతడు భోజనం చేస్తూండగా లక్ష్మీపతి ఇంటికి వచ్చాడు. కొడుకురాక ఆయనకూ సంతోషాన్ని కలుగచేసింది. తృప్తిగా నిట్టూర్పటం మినహా 'నువ్వు ఎక్కడికివెళ్ళావ్ ? ఎందుకు వెళ్ళావ్ ?' అని రాజారావును గదమాయించలేదు ఆయన.

భోజనమైన తర్వాత, ''ఒరేయ్ రాజా !.. మా రమణి కూతురి పెళ్ళైందిరా!'' అంటూ గుర్తుకువచ్చి చెప్పింది సావిత్రమ్మ.

''ఏమిటీ ! రమణి పిన్నికూతురు పద్మ పెళ్ళైందా !'' అంటూ ఆశ్చర్యం, ఆనందం వ్యక్తం చేశాడు రాజారావు. తర్వాత, ''పెళ్ళి ఎప్పుడు జరిగింది ? అత్తగారు ఏ ఊరు ? మీరు వెళ్ళారా పెళ్ళికి ?'' అని అడిగాడు.

''వెళ్ళలేదు. ఎక్కడా సంబంధాలు దొరకనట్లు మన మోచేతిక్రింద నీళ్ళు త్రాగి బ్రతికిన గుడిపూజారి గోవిందయ్య ! కూతురే మన పద్మకు అత్తగారైంది !'' లక్ష్మీపతి కలుగజేసుకొని ఈసడింపుగా అన్నాడు.

''ఔనురా ! అమృత మారుటి కొడుక్కేనట మన పద్మనిచ్చింది ! అందుకే దాని పెళ్ళికి ఆయన వెళ్లలేదు, నన్ను వెళ్ళనీయలేదు పాపం, రమణి ఎంత బాధపడిందో ?'' తలుచుకొని ఇదైపోయింది సావిత్రమ్మ.

''పద్మను చేసుకున్నది మధేనన్నమాట !'' అని అక్కణ్ణుంచి బయటికి వెళ్ళిపోయాడు రాజారావు. ఆ తర్వాత అతడి మనసునిండా అమృతకు సంబంధించిన ఆలోచనలు చుట్టుముట్టాయి.

తనకు స్వయానా పిన్ని కూతురు పద్మ. ఆమెను చూసే నెపంతో తను మధు వాళ్ళ ఊరు వెళ్ళాలి. అక్కడ అమృతను ఓ ఆట ఆడించాలి. ఇంకెక్కడ తప్పించుకుంటుంది అది?

**(ఇంకా వుంది)**

## వ్యక్తిగతం



ప్రపంచ క్రికెట్ చరిత్రలో ఎన్నో రికార్డులు నెలకొల్పిన సునీల్ గవాస్కర్ (35)ని ఆస్ట్రేలియాతో, పాకిస్తాన్‌తో ఆడే భారత క్రికెట్ జట్టు నాయకనిగా భారత క్రికెట్ కంట్రోలుబోర్డు నిర్ణయించింది. తమ నియామకం తమకి ఆశ్చర్యాన్ని కలిగించినా, గతంలో తాము ఎప్పుడు భారత జట్టుకి నాయకత్వం వహించే అవకాశం వచ్చినా తమకి గర్వకారణంగా భావించామని అన్నారు.తమకి అప్పగించిన బాధ్యతకి న్యాయం చేకూర్చగలమని ఆయన చెప్పారు. గతంలో గవాస్కర్ సాధించిన విజయాల దృష్ట్యా ఆయన నాయకత్వాన భారత క్రికెట్ జట్టు ఆస్ట్రేలియాకి గట్టి పోటీని, అక్టోబర్‌లో పాకిస్తాన్‌లో జరిగే టెస్ట్ సీరీస్‌లో ప్రతిభని ప్రదర్శిస్తుందని ఆశించవచ్చు.....



ఆట, పాట, ప్రాణంగా భావించే శ్రీమతి నీలం బాయి (83) ఇప్పుడు బొంబాయిలో ఉంటున్నారు. ఈమెకి శాస్త్రీయ నృత్యాలలోనే కాకుండా డిస్కో, పాప్ వంటి అధునాతన సంప్రదాయాలలో కూడా చక్కని ప్రవేశం ఉన్నది. గతంలో ఈమెకి శ్యామ కళ్యాణరాగం పాడినందుకు పది వేల రూపాయల బహుమతి లభించింది. మూవీ చిత్రాల నటిగా ఈమె ఎన్నో చిత్రాలలో నటించారు. 'ఆన్' హిందీ చిత్రంలో దిలీప్ కుమార్ తల్లిగా నటించింది. సంగీత, నృత్యాలు తమ సర్వస్వంగా భావించిన ఈమె ఇటీవల ఢిల్లీకి చెందిన శ్రీరామ్ భారతీయ కళా కేంద్ర, సాహిత్య పరిషత్ వారు నిర్వహించిన సంగీత మహోత్సవాలలో ముఖ్య అతిథిగా గౌరవాన్ని అందుకున్నారు. శ్రీమతి నీలంబాయి సంఘ సంస్కర్తగాకూడా చక్కని పేరు తెచ్చుకున్నారు.....




### 12-10-1984 శుక్రవారం మొదలు 18-10-1984 గురువారం వరకు

★ **మేషం :** రాజకీయ రంగాన మీకు అనుకూలత సంభవం. విద్యా రంగాన అనుకూలత సిద్ధింపనున్నది. సాహిత్యపరంగా కొందరకు, నటనా విధానంగా కొందరకు లాభదాయకం. స్త్రీలకు : సర్వత్రా దిగ్విజయం.

★ **వృషభం :** మిత్ర వర్గంతోగాని, బంధువులతో గాని అనవసరంగా ఘర్షణ రావచ్చు. ఉపకారం పొందినవారే అపకారం తల పెట్టగలరు. స్వల్పంగా ధనాదాయానికి అవకాశముంటుంది. స్త్రీలకు : నూతన వస్తు సేకరణ, కుటుంబానందానికి అవకాశం.

★ **మిథునం :** ప్రభుత్వ పరంగా జరుగవలసిన పనులందు జాప్యం. పరిష్కారం కావలసిన వ్యవహారాలు వాయిదా పడటం, ఆరోగ్య లోపం. ఆశించిన ద్రవ్యం చేతికి అందకపోవటం గమనించగలరు. స్త్రీలకు : నగల సేకరణకు, వృత్తియందు అభివృద్ధికి అనుకూల వారం.

★ **కర్కాటకం :** వృత్తియందు పెంపు కనిపిస్తుంది. వ్యాపారమందు సదవకాశాలు లబ్ధం కాగలవు. ఎన్నడో చేసిన వ్యవహారాలు ఈ వారం మీకు అనర్ధదాయకాలు కాగలవు. స్వల్పాదాయంగలదు. స్త్రీలకు : అనవసర కాలక్షేపం. కార్య విఘ్నం సంభవం.

★ **సింహం :** మీకుగల వ్యవహార పరిజ్ఞానం ఈ వారం భాసించనున్నది. కొందరు మిత్రుల వలననో, పరిచితుల వలననో మోసానికి గురి కాగలరు. ఏమయినా అవకాశవాదులను దాపునకు రానీయకండి. స్త్రీలకు : సభా సమావేశాలందు కొందరకు, శుభ కార్యాలలో కొందరకు ప్రవేశముంటుంది.

★ **కన్య :** దూర ప్రాంతాలనుండి, హితులో, సన్నిహితులో, బంధువర్గీయులో, పరిచితులో యింటికి రాగలరు. రాజకీయంగా అనానుకూలత చెప్పదగినవారంగా గ్రహించేది. ఆశించిన ధనం చేతికి అందకపోవచ్చు. ఎవరో మేలు చేయగలరని ఆశించి కూర్చో తగదు, గ్రహించాలి. స్త్రీలకు : అనవసర ప్రయాణాలుంటాయి. ఉద్యోగ యత్నాలు కూడా ఫలదాయకాలు కావని గ్రహింపగలరు.

★ **తుల :** రాజకీయంగా ఏమంత మంచి వారం కాదు. మీరు ఆశించిన వ్యవహారాలు ఏవీ అనుకూలంగా, జరుగవు. అందుతుందన్న ధనం రాకపోవటం గమనించగలరు. శుభ వ్యవహారాలు వాయిదా పడుతాయి. ఏవో చికాకు వెన్నాడుతాయి. స్త్రీలకు : కుటుంబ యిబ్బందులు, చికాకులుండగలవు.

★ **వృశ్చికం :** లేనిపోని వ్యవహారాలలో జోక్యం కలుగ జేసికోనున్నారు. అనవసరం కదా, రాజకీయ మిత్రులను కలిసికొన్నందువలన కలిగే ప్రయోజనం ఏమీ లేదు. మీరే గ్రహిస్తారు. స్త్రీలకు : ఉద్యోగ మందు హాయి, ప్రశాంతత చిక్కుతుంది.

★ **ధనుస్సు :** అనుకొనని విధాన కావలసినవారు, బంధువర్గీయులు, మిత్రులు యింటికి రానున్నారు. వారికై కాలం వ్యయించవలసి ఉంటుంది. సాహితీరంగానుభవంగల వారికి, నటనానుభవంగలవారికి ధనాదాయానికి అవకాశం గల వారం. స్త్రీలకు : కొందరకు గృహ మార్పు, కొందరకు ఉద్యోగ మార్పూ చెప్పవచ్చు.

★ **మకరం :** అన్ని రంగాలలో మేలు, ఆదాయమున్నా, ఏదో కారణంగా ఆనందం లోపించటం, అదొక మాదిరిగా కాలం వ్యయించవలసి రావటం గ్రహింపగలరు. ఉద్యోగరీత్యా చేసిన యత్నం విఫలం కాగలదు. స్త్రీలకు : అప్రయత్న ధనలబ్ధి, అవసరాలు తీరటం గమనించగలరు.

★ **కుంభం :** నూతన మిత్రులను కలిసికొని నూతనాంశాలు గ్రహింపనున్నారు. అందు మూలాన వ్యాపార వృద్ధికి మార్గం చిక్కుతుంది. రాజకీయంగా ఏ విధంగా మీకు మేలైన వారం గాదు. పైగా చిక్కులుండగలవు. స్త్రీలకు : కళారంగాన అవకాశాలు చిక్కినట్లే చిక్కి జారిపోతాయి.

★ **మీనం :** సుఖ శాంతులకు లోపం. ఆశించిన ద్రవ్యం అందకపోవుటం, అనుకూలించగలదన్న వ్యవహారం వ్యతిరేకం కావటం గమనించగలరు. వస్తు సేకరణకు అవకాశం గల వారం, ఆరోగ్య రీత్యా కూడా జాగ్రత్త. స్త్రీలకు : ఆశించిన 'ప్రమోషన్' లభ్యం కాగలదు. అత్యవసర పరిస్థితులందు తప్ప, ప్రయాణించుట మేలు గాదు. గ్రహించండి.

–విద్వాన్ కోట సత్యరంగయ్య శాస్త్రి

విజయదశమి శుభాకాంక్షలతో!

గ్రామ్సు: ఫైనాన్స్  ఫోన్: 345

# శ్రీరామా ఫైనాన్స్ కార్పొరేషన్

మోటార్ & జనరల్ ఫైనాన్సియర్స్

పి.బి. నెం: 6 **బొబ్బిలి**-532 558

విజయనగరం జిల్లా

పి.బి.నెం: 2020
30-15-35, డాబాగార్డెన్స్
**విశాఖపట్నం**-530020
ఫోన్: 64466, 65656
గ్రామ్సు: ఫైనాన్స్ టెలెక్స్: 0495-330

32-C సెకండ్ ఫ్లోర్
సౌత్ బోగ్ రోడ్
టి. నగర్
**మద్రాస్**-600017
ఫోన్: 446746, 445726
గ్రామ్సు: రామ్‌ఫిన్

మేజర్: పికె. దాస్ బిల్డింగ్స్
నయాచౌక్,
**కటక్**-753010 (ఒరిస్సా)
ఫోన్: 20752
గ్రామ్సు: ఫైనాన్స్

సులభమైన షరతులపై కమ్మర్షియల్ వాహనములకు ఋణములు యివ్వబడును.

ఆకర్షణీయమైన వడ్డీరేట్లపై ఫిక్సడ్ డిపాజిట్లు అంగీకరించబడును.

**సి.వి. సీతారామస్వామి**

మేనేజింగ్ పార్టనర్

సీరియల్

# దాగుడుమూతలు

## కప్పగంతుల మల్లికార్జునరావు

( గత సంచిక తరువాయి )

### 17

'సర్. పక్కవూళ్లో పెళ్లి జరగబోతోంది. మన 'సీన్స్' కొన్ని అక్కడ తీసేస్తే ? నేచురల్‌గా వుంటుందిగదా ?'

ఫోటోలు చూస్తున్న గోపీచంద్ తలెత్తి అసిస్టెంట్ డైరెక్టర్ కళ్లల్లోకి చూచాడు. ఆ అసిస్టెంట్ డైరెక్టర్ పేరు మధు. మంచి 'విజన్' వున్నవాడు. చాకులాంటి కుర్రాడు. కొద్ది రోజుల్లోనే అతని పట్ల మంచి అభిప్రాయం ఏర్పడింది గోపీచంద్‌కు.

'మళ్లీవాళ్ల పర్మిషన్ యివ్వవద్దూ? పైగా మన స్క్రిప్టులో ఎన్విరాన్‌మెంట్‌కు అనుగుణంగా వుండొద్దూ అక్కడ వాతావరణం.'

'నేను చూచొచ్చాను సార్. వాతావరణం మీరనుకున్నట్లే వుంది.'

'నేనేమనుకున్నానో మీకెలా తెల్సు ?'

'స్క్రిప్టు చదివేను కదా సార్.'

'అది చాలదు. ఈ ఫోటోలు చూడండి. యిందులో వాతావరణం నాకు కావాలి. యీ వొక్క ఫోటో మీ వెంట తీసుకెళ్లండి. సూటబుల్ అనుకొంటే ఏర్పాట్లు చేయించండి.'

'సర్. యీ ఫోటోలు... యిందులో...'

గోపీచంద్ సౌంజ్ఞ చేసేడు. 'మాట్లాడొద్దు. పని చూచుకో' అని ఆ సౌంజ్ఞకు అర్థం.

**జరిగిన కథ—9 :** సులోచన స్నేహితురాలు అరుంధతి తన భర్త కాంతారావుతో చెప్పి, గోపీచంద్‌కు సన్మానం చేయిస్తుంది సుప్రసిద్ధ సినీ దర్శకుడు శ్రీమన్నారాయణ నుంచి అర్జంటుగా రమ్మని కబురందుకున్న గోపీచంద్ సులోచనను వాల్తేరు బండెక్కించి తను మద్రాసు బండెక్కుతాడు. గోపీచంద్ నవల ఆధారంగా డైలాగులు కూడ అతనే రాసిన సినిమా సక్సెస్ అవుతుంది. భర్త నుంచి ఏ కబుర్లూలేక బాధపడుతుంది సులోచన— గోపీచంద్ పూర్తి సినిమా వ్యామోహంలో పడిపోతాడు. సులోచన ఉత్తరం చదివిన గోపీచంద్ సులోచనను, తన తల్లితండ్రులను మద్రాసు తీసుకు రావాలని నిశ్చయించుకొన్నట్లుగా సులోచన బాబాయి రామారావుతో చెప్తాడు. గోపీచంద్ దగ్గర నుంచి సులోచనకు ఉత్తరం వస్తుంది. ''నెత్తురుకూడు'' సినిమా కథా రచయితగా గోపీచంద్‌కు ప్రభుత్వ బహుమతి వస్తుంది. గోపీచంద్ సాహిత్యాభిమానులు ఏర్పాటు చేసిన సభలో తను ప్రస్తుతం దర్శకత్వం వహించి తీస్తున్న సినిమాలో ముఖ్య పాత్రను వేసే వ్యక్తిగా మూగ వెంకన్నబాబుని సభవారికి పరిచయం చేస్తాడు గోపీచంద్. వెంకన్నబాబుని రమేశ్ ఇంట్లో దిగవిడుస్తాడు గోపీచంద్. తమ పెళ్లి రోజున గోపీచంద్ సులోచనను ఆమె 'తప్పు కథ'ను చెప్పమని అడుగుతాడు. అందు కామె నిరాకరిస్తుంది

ఆ ఫోటోలు రామారావు తన పెళ్లిలో తీసినవి.

రమేశ్‌కు సంబంధించిన దృశ్యాలన్నీ తీసేసి సులోచనకు ప్రెజెంట్ చేసేడు. రమేశ్‌కు సంబంధించిన ఫోటోలు, ఎదురుకోల దృశ్యాలు ... యిత్యాది ఆ పెళ్లికి సంబంధించిన ప్రతివొక్క ఫోటోను రామారావు దగ్గరినుంచి మెల్లగా సంపాదించాడు గోపీచంద్. పూర్తి సీక్వెన్స్ తయారయింది.

'ఇవన్నీ ఎందుకండీ మీకిప్పుడు ?' రామారావు అడిగేడు.

సవ్వే సమాధానం స్క్రిప్టు మధుకుతప్ప ఎవరికీ తెలియదు.

వో గంట తర్వాత మధు వచ్చి ఆ పెళ్లి యిల్లు అన్ని విధాల సినిమా పర్పస్‌కు సూటవుతుందని చెప్పేడు.

'ముందు విడిదింట్లో పేకాట సన్నివేశం తియ్యాలిగదా ? ఆ ఏర్పాటు చూచారా ?'

'చూచాను సార్. అక్కడ పెళ్లివాళ్లే కొందరు పేకాట ఆడుతున్నారు. వాళ్ల మీద వో షాట్ తీస్తేసరి. మిగతా అంత వెంకన్న బాబుది. శెకండ్ హీరోదేకదా ?'

'వెల్. సీన్ రెడీ చేయండి. వెంకన్నబాబుతో నేను మీ వెనుకే వస్తాను.'

వెంకన్నబాబుది సినిమాలోకూడా మూగవాడి పాత్రే. పైగా ఆ పాత్ర అతనికి బాగా పరిచయమైనది. అంచేత సులభంగా అవలీలగా చేసేస్తున్నాడు.

వెంకన్నబాబు, పరబ్రహ్మమూర్తి యింట్లో వున్న కొద్దికాలం తన సత్తా ఏమిటో ఆ యింట్లో వాళ్లందరికీ నిరూపించాడు. వాడిలో వచ్చిన మార్పుకు పరబ్రహ్మమూర్తి కుదేలయ్యాడు.

'నా ఆస్తి కాజేయాలనుకొంటున్నావేమో ! నీకు పైసా యివ్వను. యిదిగో, నా పొలం చేసేవాళ్లకు రాసిన వుత్తరాలు. నువ్వు వెళ్తే యీసారి మక్తాలు నీకివ్వరు. నా ఆస్తి నేను మేనేజ్ చేసుకోగలను ? కావాలంటే తిండి పెట్టినందుకు నెలకింత అని డబ్బు యిస్తాను మీకు.'

అలా కొరకరాని కొయ్య అయిన వెధవను గుండెలమీద కుంపటిలా యింట్లో పెట్టుకుని ఏంలాభం ? తనకెందుకీ కంచి గరుడసేవ ?

'యిదేం హోటలనుకొన్నావుర్రా వెధవా ? '

'ఎలా అనుకొంటాను ? అన్నంపెట్టి డబ్బు వసూలు చేస్తారు ? నువ్వు నా డబ్బు తింటూ, నాచేత చాకిరీ చేయించుకొంటూ నా కన్నం పెట్టటం దేశసేవ అనుకుంటావు కదా ?' పలక మీద రాసేడు.

'ఛ ! మూగవెధవకు నీకెంత పొగర్రా ? ఏంచూచుకొని నీకింత మిడిసిపాటు ? నా మాట వినేట్లయితే నా యింట్లో వుండు లేకపోతే బయటికి నడువ్. నామీద గౌరవం లేని వెధవలకు నా యింట్లో స్థానం వుండదు. తెల్సిందా ? '

అంతే. వెంకన్నబాబు గోపీచంద్‌కు వుత్తరం రాసేడు. గోపీచంద్ తన మనిషిని పంపేడు.

'మామయ్యా, నువ్వు కావాలనుకొన్నావని వచ్చాను. వెళ్లమన్నావు.

వెళ్తున్నాను. మళ్లీ వచ్చేసరికి నేనిలా పలకలు, కాగితాల ద్వారా, సంజ్ఞల ద్వారా మాట్లాడే అవసరం వుండదులే. అప్పుడు నా తడాఖా ఏమిటో యింకా బాగా చూస్తావు. అంతవరకు శెలవు.'

అలా గోపీచంద్‌ను చేరుకొన్నాడు. అతనింట్లోనే మకాం.

'వెంకూ, నీ వేషమేమిటి ? '

ఆ ప్రశ్న ఎవరడిగినా జవాబివ్వడు. ఆ సినిమాను గురించి యింట్లో మాట్లాడవద్దన్నది గోపీచంద్ ఆజ్ఞ.

'నాకేంతెల్సు, ఏంచెయ్యమంటే అది చెయ్యటమే ! ' మరీగట్టిగా అడిగితే జవాబిస్తాడు.

'వెంకన్నబాబుగారు వచ్చారు సార్'

వెంకన్నబాబును కెమేరా ముందు నిలబెట్టినందుకు తన పాత్రకు పూర్తి న్యాయం చేకూర్చాడు. సినిమా రిలీజ్ అవగానే అతని డిమేండ్ పెరగడం ఖాయం. అంత సింపతీ గెయిన్ చేసే పాత్ర.

'వెంకన్నబాబూ, యివాళతో యిక్కడ నీ పని అయిపోతుంది. రేపు మద్రాసుకు వెళ్తున్నావ్, సినిమాలో నువ్వు కన్పించే మొదటి దృశ్యం యిది. షూటింగ్‌లో చివరిది. బాగా చెయ్యాలి. నీకు తెల్సిన దృశ్యమేలే.'

వాళ్లు విడిది యింటి ముందు కారు దిగేసరికి సీన్ రెడీ చేసుకొని సిద్ధంగా వున్నారు మిగతా వాళ్లు. రామారావు మద్రాసులోనే అర్జంట్ పనిమీద వెళ్లటంవల్ల ఆ సీన్‌ని ఆయన సీనియర్ అసిస్టెంట్ ఆపరేటింగ్ కెమెరామేన్ షూట్ చేయటానికి సిద్ధంగా వున్నాడు. రిఫ్లెక్టర్స్‌ని వెంకన్నబాబుమీద ప్రాజెక్ట్ చేసేరు. వెంకన్నబాబు దూరంనుంచి వచ్చి ఆ యింట్లోకి ప్రవేశించిన 'బిట్' షూట్ చేసేరు.

తర్వాత బిట్ యింటి లోపల.

ఇంటి లోపలికి గోపీచంద్ ప్రవేశించేసరికి పేకాటసీన్ రెడీగా వుంది. కెమేరాలోనుంచి పేకాట టేబిల్ ముందున్న వాళ్లను చూచి వులిక్కిపడ్డారు. వాళ్లు లోకాన్ని మర్చిపోయినట్లు గదిలో జరిగేదేమీ కూడా పట్టించుకోకుండా ఆట ఆడుతున్నారు.

'లైట్స్' మెల్లగా మధుతో అన్నాడు. అతను డైరెక్టర్ ఆంతర్యాన్ని గమనించి మిగతా వారికి గొడవ చెయ్యవద్దని సౌంజ్ఞ చేసేడు.

లైట్లు వెలిగేయి. 'స్టార్ట్' మెల్లగా అన్నాడు.

కేమేరామేన్ బదులు కెమేరాను గోపీచంద్ ఆపరేట్ చేస్తున్నాడు.

గోపీచంద్ ధోరణి అర్థంకాక అంతా అలాగే నిలబడి చూస్తున్నారు. సెకండ్ హీరో, వెంకన్నబాబు ఎవరి స్థానాల్లో వారు నిల్చొని వున్నారు.

'షో' అన్నాడు పేకాట ఆడుతున్న వాళ్లల్లో వొకడు.

యిదేం బాగాలేదురా. ప్రతిసారీ 'షో' నీదేనా ? నీ పెళ్లికి యింత దూరం వచ్చింది, పేకాటలో నీచేత క్షౌరం చేయించుకుందామనా ? ఐ ప్రొటెస్ట్. ఇందులో ఏదో మోసం వుంది' భీమసేన్ అన్నాడు.

'అవును. నాలుగు రౌండ్స్‌గా నావన్నీ ఫుల్ కౌంట్సే !'

'పూర్వం కూడా విడిలాగే చేశాడురోయ్. గుర్తులేదూ ?

'అప్పుడు అందుకే పెళ్లి ఆగిపోయింది.'

'ఒరేయ్. ఏంటి మీ గోల ? అటు చూడండి. సినిమా తీసేస్తున్నట్టున్నారు కూడా. ఒరేయ్... అటుచూడండి. వాడు ... గోపీచంద్‌గాడు...'



'ఓ. కే. కట్' అన్నాడు గోపీచంద్. కెమేరాను అప్పచెప్పి కెమేరామేన్‌కు ఏదో సౌంజ్ఞ చేసేడు.

లైట్లు ఆరిపోయాయి. వెలిగేయి. ఆరేయి. మళ్లీ వెలిగేయి

'థేంక్యూ ఫ్రెండ్స్. మీ నటన చాలా సహజంగా వుంది.'

'ఒరేయ్... నువ్వు...'

'ఆశ్చర్యపోవాల్సింది మీరు కాదు. నేను. రమేశ్‌గాడి పెళ్లికి పిలవకపోయినా రెండవసారి కూడా యిలా వస్తాననుకోలేదు.'

'యిది అన్యాయం. మాకు తెలీకుండా మమ్మల్ని షూట్ చేయటం...'

'అన్యాయమో న్యాయమో నాకు తెలీదు. కానీ ఇది నా అదృష్టం...'

'ఏది ? పెళ్లికి రావటమా ? మమ్మల్ని షూట్‌చేయటమా?'

'రెండూను. అరేయ్. పెళ్లికూతుర్ని చూచొచ్చారా ? మీరు ఆడుతుండండి. నేను వెళ్లి చూచొస్తాను.'

'గోపీచంద్. యిటీజ్ టూ మచ్.'

'కోప్పడకండోయ్. ఆనాడు మీరు చూచొచ్చి పెళ్లికూతురు రహస్యాన్ని చెప్పి రమేశ్‌గాడి పెళ్లి చెడగొట్టేరు. యివాళ నేనలాంటి పనిని చేయనులే. రమేశ్ రహస్యాలు పాపం పెళ్లివారికి తెల్సో లేదో ? వెళ్ళి పెళ్లికూతుర్ని చూచి చెప్పొస్తాను.'

'మిత్రద్రోహీ' రమేశ్ ముందుకొచ్చి కోపంగా అతని చొక్కా పట్టుకొన్నాడు.'

'కట్' అన్నాడు నవ్వుతూ గోపీచంద్.

'అంటే ? యిదికూడా షూట్ చేశారా మీవాళ్లు ?'

'షూట్ చేసేరు. మన మాటల్ని రికార్డుకూడా చేసేరు. యింకా చేస్తూనేవుంటారుకూడా. కనుక ఎనర్జీ వేస్ట్ చేసుకోకు. నాకు చాలా పనుంది. గుడ్‌బై.'

క్షణంలో ఆ యిల్లు నిరామయమయిపోయింది !

*　　　*　　　*

మంగళ వాద్యాలు మోగుతున్నాయి. పురోహితుడు మంత్రాలు చదువుతున్నాడు. పెళ్లి పందిరంతా అతిథి అభ్యాగతులతో కళకళలాడుతోంది.

పరబ్రహ్మమూర్తి పెళ్లి పందిట్లోకి వచ్చాడు. ఎవ్వరో పన్నీరు చల్లి మర్యాద చేసేరు. అగ్నిలో ఆజ్యం పోసినట్లు మండిపడ్డాడు.

'ఆపండి.' అని బిగ్గరగా అరిచాడు. కానీ ఆ అరుపులవ్వుడే వుచ్చై స్వరంతో విన్పించిన మంత్రాలలో, మంగళ వాద్యాలలో కల్సిపోయింది. మంగళ సూత్రధారణ అయింది. అంతా అక్షింతలు చల్లేరు.

''ఏమిటండీ యీ ఫార్సు ? అవతల ముహూర్తం టైమ్ అయిపోతుంటే యీ సినిమా వేషాలేమిటి ? మగపెళ్లివారి ఆలనా పాలనా చూచేవారన్నా లేకపోతే ఎలా ? మీకు సినిమా షూటింగ్ ముఖ్యమా ? పెళ్లివాళ్ల మర్యాద ముఖ్యమా ?'' వియ్యంకుడిమీద విరుచుకుపడ్డాడు పరబ్రహ్మమూర్తి.

'అన్నింటికన్నా మాకు మా మర్యాద ముఖ్యం. మీరు మా వూరికి, మా యింటికి వచ్చారు. మర్యాదగా మాట్లాడటం నేర్చుకోండి ముందు?'

'మర్యాద ! మీ మర్యాద యిదేనా ? మా అతీ గతీ పట్టించుకోకుండా యీ సినిమా షూటింగ్‌లో మునిగిపోతారా ?'

'సినిమా షూటింగా ? అయితే? నా కూతురు పెళ్లి జరుగుతోంది, వాళ్లు ఆ దృశ్యాన్ని ఫోటో తీసుకుంటామని మర్యాదగా అడిగేరు. అంగీకరించాను. యిందులో అమర్యాద ఏముంది ?'

'మీ అమ్మాయి పెళ్లే ! మా అబ్బాయి లేకుండా ? నేను లేకుండా ?'

'మీరు లేనిదే ఏమీ జరగదా ? నేనెవరనుకొన్నారు ? నన్నే మోసం చెద్దామనుకొన్నారా ? సమయానికొచ్చి ఆ డైరెక్టర్‌గారు. మీ కథంతా చెప్పబట్టి సరిపోయింది. లేకపోతే నా కూతురు గొంతు కోసేవాడివేగా ? నన్ను మోసం చేయటానికి. మధ్యపెట్టటానికి మీకెంత ధైర్యం ?' పెళ్లికూతురు తండ్రి మీసాలు మెలేసి కోపంగా అంటుంటే భయమేసింది పరబ్రహ్మమూర్తికి.

'అదికాదండీ మధ్యలో ఎవరిమాటల్నో నమ్మి...'

'ఆయన్నొక్క మాటంటే మూతిపళ్లు రాలకొట్టాను. నేనంటే ఎవరనుకొన్నావో ? ఎవరో చెప్తే నమ్మటానికి నేనంత వెర్రివాడిని కాదు. యివిగో ఆ పెళ్లి ఫొటోలు. ఆ రోజు మీరు ఆ పిల్లను వదిలేసి లేచిపోయారు. కానీ యివాళ ? మీ కళ్లముందే నేను నా కూతురు పెళ్లి చేసేను. మేమిప్పుడు భోజనాలు చేస్తాం. కానీ మీకు భోజనాలు కాదుకదా మంచినీళ్ళు కూడా యీ వూళ్లో దొరకవు. యీ వూరునుంచి బయటికి పోలేరు నా అనుమతి లేకుండా. మీ అన్యాయపు బుద్ధికి యిది దండన కాదు, మీ పాపాలకిది ప్రాయశ్చిత్తం. అన్నట్లు అప్పుడు ఆ పిచ్చి పెద్దమనిషంటే ముందిచ్చిన డబ్బు దస్కాలను వదిలేసుకొన్నాడు. కానీ నేనంత మంచివాడిని కాను కట్నం డబ్బు మర్యాదల పేరిట ముట్టచెప్పిన వస్తువులు, యింతవరకు మీరు తిన్న తిండీ, తాగిన కాఫీల ఖరీదులతోసహా లెక్కకట్టి డబ్బు సిద్ధంగా వుంచండి. అన్నట్లు వడ్డీ మర్చిపోవద్దు. అలా యివ్వకపోతే అడామగా అందరినీ బట్టలిప్పదీసి యీ వూరినుంచి వుద్వాసన చెప్తా. తెల్సిందా? ఖబడ్దార్. యీ గోపురాల వీరభద్రయ్యనే మధ్యపెడ్దామనుకొన్నావ్ ? నా కళ్ళు కప్పి నాతో వియ్యమందుదామనుకొన్నావ్ ?'

కుదేలయిపోయిన పరబ్రహ్మమూర్తి చేతిలో ఎవరో అక్షింతలు వుంచబోయారు.

'వద్దు. నా కూతుర్ని ఆయన ఆశీర్వదించలేడు. గొంతు కోద్దామని వచ్చినవాడు వేసే అక్షింతలకు విలువేముంది ? ఆయనకు అక్షింతలు యివ్వకు.'

పరబ్రహ్మమూర్తి నీరసంగా నేలమీద కూలబడిపోయాడు.

'కట్' అని అరిచేడు గోపీచంద్ !

## 18

'డియర్ అరూ,

తల్లివయినావన్న వార్త నా కెంత సంతోషాన్ని కలిగించిందో ? బాబు నీ పోలికా ? మీ ఆయన పోలికా ? ఇద్దరిలో ఎవరిపోలికైనా మంచిదే కదా ? ఎందుకంటే మీ యిద్దరిమధ్యా వేవ్ లెంగ్త్ ఖచ్చితంగా కుదిరింది. ఎంత అదృష్టవంతురాలివే ?

నేను మళ్లీ ఉత్తరాలు రాయటం లేదని కోపం వచ్చింది కదూ ? నీ అక్షరాలలో ప్రేమతో కూడిన కోపం కన్పిస్తూనే వుంది. కానీ జీవితం నాతో దాగుడుమూతలాడుకొంటున్నదే ! గర్భిణిగా వున్న నిన్ను నా విషాద వార్తలతో ఎలా బాధ పెట్టగలను ? అందుకే రాయలేదు.

ఆ మధ్య మా పెళ్లిరోజు అన్న మిషతో గోపీచంద్ నన్ను వో కాస్ట్‌లీ హోటల్‌కి తీసుకెళ్లేడు. తీసుకెళ్లి ఏంచేసేడో తెల్సా ?

... ... ... ?

ఆ విశ్వరూపం చూచి నేను జడుసుకొన్నానంటే నమ్ము.

ఆయన ఎత్తిన అవతారాన్ని గురించి అప్పుడెప్పుడో రాసేవు. ఆ అవతార స్వరూపాన్ని తెల్సుకొన్నాను. కానీ ఏంలాభం ?

ఆ అవతారాన్ని అంతంచేయటం ఎలాగో నాకు తెలియదు.

చిత్రమేమంటే ఆయనాక్షణంలో తన విశ్వరూపాన్ని వుపసంహరించుకొన్నాడు. నన్ను పిలిపించాడు. కొన్నాళ్లు మామూలుగానే వున్నాడు.

యీ మధ్య ఔట్‌డోర్ షూటింగ్‌కు వెళ్లివచ్చారు.

వచ్చినదగ్గరినుంచి మళ్లీ పాతపాట ఆరంభమయింది.

నేను ఎదురుపడ్తే తప్పించుకు తిరుగుతున్నాడాయన. యింటికే రావటంలేదు. ఎప్పుడొస్తారో ? ఎప్పుడెళ్తారో ?

మొన్నోరోజు ఆయన్ని పట్టుకొన్నాను.

'మళ్లీ ఏమయిందండీ ? యీ ఆట ఏమిటి ? నా జీవితంతో ఎందుకిలా దాగుడుమూతలాడుతారు ?'

అప్పుడాయన మొహంచూస్తే ఎవరికైనా జాలి వేస్తుంది. ఏదో గొప్ప దోషం చేసి, పశ్చాత్తాప జ్వాలలో మాడి మసి అయిపోతున్నవాడిలా కన్పించాడు. 'పురుషులంతా భార్యల దగ్గర పెద్ద నటులు' అని నువ్వు అనేదానివి ఆ మాటలు గుర్తుకొచ్చాయి.

'మీ మనసులో నామీద ఏదో అయిష్టం వుంది. నేనంటే అంత యిష్టంలేకపోతే నన్ను...'

'లేదు సులోచనా. నువ్వంటే నాకు ప్రేమ. కానీ...'

కానీ తన ప్రవర్తన ఆంతర్యమేమిటో ఆయన చెప్పకుండానే తప్పించుకువెళ్లేడు.

'డబ్బింగ్‌లో బిజీగా వున్నానని చెప్పమన్నాడొదినా అన్నయ్యా.'

డబ్బింగ్‌లు, మిక్సింగ్‌లు, ఎడిటింగ్‌లు ఎన్నిమిషలో.

అన్ని మిషలూ అయిపోయాయి. అయినా నా మొహం చూడటానికి ఆయనకు తీరిక చిక్కలేదు. మళ్లీ యింటికొస్తూనే వున్నారు. తలిదండ్రులతో, చెల్లెలితో, తమ్ముడితో మామూలుగానే వుంటున్నారు. నేనొక్కదాన్ని ఏంపాపం చేసేనో !

మొన్న మూడురోజుల క్రితం తను దర్శకత్వం వహించిన పిక్చర్ ప్రీవ్యూ జరిగిందట. యింట్లో వున్న మమ్మల్నెవరినీ పిలవలేదు.

'ఆ ప్రీవ్యూ డిస్ట్రిబ్యూటర్లకోసం రమా. ప్రొడ్యూసర్ బిజినెస్సుకోసం వేసింది' రమాదేవి నిలేస్తే అన్నాట్ట.






# దాగుడు మూతలు

నిన్న మళ్ళీ వో ప్రీవ్యూ వేశారుట. ముందుగానే తెల్సుకొని అడిగింది రమాదేవి. యీ ప్రీవ్యూ జర్నలిస్టులకి రమా. ప్రచారం అంతా పత్రికల మీదే కదా ఆధారపడివుంది. దానికి మరెవర్నీ ఆహ్వానించరు' అని తప్పించుకెళ్లేట్ట నిన్న.

'అన్నయ్య చెప్పిందంతా అబద్ధం వదినా. ప్రీవ్యూకు చాలా మంది ప్రముఖుల్ని ఆహ్వానించారుట. దర్శకుడి ఫేమిలీ మెంబర్స్ ప్రముఖుల లిస్టులో చేరరా? పోనీ మా సంగతం టే వదిలెయ్. ఆ పిక్చర్ ఆరంభంలో ముహూర్తంనాడు పూజచేసి హారతిచ్చింది నువ్వుకదూ? నువ్వు ప్రముఖుల లిస్టులో వుండవద్దూ?'

అవును. నాకో రోజు ప్రముఖ స్థానాన్ని వద్దనేకొద్దీ యిచ్చాడు.

యివాళ నాపట్ల వుదాసీనం వహిస్తున్నాడు.

చీకటి — వెలుగు! ఎన్నాళ్లని యీ దోబూచులాట!

నాకేం అర్థంకావటంలేదు అరూ. ఏం చేయాలో, ఎలా ఆయన్ని కల్సుకోవాలో తోచటంలేదు.

ఆ రోజు రాత్రి హోటల్లో ఆయన అడిగిందానికి, కొత్తగా తీసిన సినిమాకి, ప్రీవ్యూలకి మమ్మల్ని తీసుకుపోకపోవటానికి ఏదో సంబంధం వుందని నాకెందుకో అనిపిస్తున్నది.

ఆ — తాజా వార్త. రమాదేవి యిప్పుడే చెప్పింది.

మరో మూడు రోజుల్లో ప్రీవ్యూ వుందిట. దానికి చెల్లెల్ని రహస్యంగా తీసికెళ్తానన్నాట్ట ఆయన. నాతో చెప్పవద్దన్నాట్ట!

'అన్నయ్య అలా అనటం నా కాశ్చర్యంగా వుంది వదినా. అన్నయ్య కసలు యీలాంటి చాటు మాటు వ్యవహారాలు నచ్చవు. అంతా ప్లెయిన్. నన్ను తీసుకెళ్లగలిగినవాడు నిన్నెందుకు తీసుకెళ్లలేదు? ఎందుకు నిన్నా సినిమాకు దూరంగా వుంచాలి?' రమాదేవే అంది.

యిదీ అరూ నా జీవితం. సాగరమథనం జరుగుతోంది. అది క్షీరసాగరమో, విషసాగరమో తెలియదు. అందులోనుంచి అమృతం వుద్భవిస్తుందో గరళమే వుద్భవిస్తుందో తెలియదు.

కానీ వొక్క సత్యాన్ని గ్రహించాను అరూ.

ఆ విషయంలో యిప్పటికీ నేనూ నీతో విభేదిస్తున్నాను.

శీలాన్ని గురించి ఆడది చేసిన తప్పు ఆమెను జీవితాంతం ఏదో రూపంలో వెంటాడుతూనే వుంటుంది. ఆ నిప్పు మండకపోవచ్చు. కానీ ఆరిపోనూపోదు. నివురుగప్పిన ఆ నిప్పును వొళ్లో పెట్టుకొని ఎంత కాలమని బ్రతకగలదు స్త్రీ?

నేను యిప్పుడే వో నిర్ణయానికొచ్చాను.

ఆయనతో ఆ విషయం తేల్చుకొంటాను. ఆయన వున్నతుడే కావచ్చు అన్ని విషయాల్లో. కానీ నన్నిలా మానసికంగా చిత్రహింస పెట్టే అధికారం ఆయనకు లేదుగా?

ఆ సినిమాను నేను ఎలాగోలాగా చూస్తాను.

ఆయన అవతార స్వరూపాన్ని పూర్తిగా అర్థం చేసుకొంటాను.

ఆ తర్వాత ఆయన అవతారమో నా అవతారమో అంతం కావాలి. యీ దాగుడు మూతలాటను నేను భరించలేను. నివురుకప్పిన నిప్పు నన్ను మెల్లగా దహిస్తోంది.

యీసారి వుత్తరం ఎలా వుంటుందో? యీ వుత్తరం నీకు చేరేసరికి ఆయన అవతార రూపం తెల్సుకొంటానేమో!

చిరంజీవి బాబుకు నా ముద్దులు.

మీవారికి నమస్కారాలు.

నీ
లోచన్.

ఉత్తరం చదివి నిలువునా నీరైపోయింది అరుంధతి.

ఆత్రంగా వుత్తరం రాసిన తేదీ, పోస్ట్ చేసిన తేదీ అన్నీ చూచింది. ఫర్వాలేదు. యింకా టైమ్ మించిపోలేదు.

కానీ వెంటనే బయలుదేరాలి. లేకపోతే...

సమయానికి చేరుకోలేకపోతే...

ఆమె కళ్లముందు ఏమేమో దృశ్యాలు తిరగసాగేయి.

ఆమె భర్తకు ఫోన్ చేసింది. ఎడిటోరియల్ బోర్డు మీటింగ్‌లో వున్నారని సమాధానం.

'ఏం మీటింగ్‌లో ఏ పనిలో వున్నాసరే. యిది నా జీవన్మరణ సమస్య, వెంటనే ఆయన్ని యింటికి రమ్మనండి. అర్జంట్...'

మెసేజ్ అందుకొని బిత్తరపోయాడు కాంతారావు.

ఫోను చేసే టయిము లేదు. యిల్లు చేరేడు.

అప్పటికే అంతా సర్దుకొని సిద్ధంగా వుంది అరుంధతి.

'లోచన చాలా ప్రమాదస్థితిలో వుంది. మనవల్లే. మనం వెంటనే వెళ్లాలి.'

కాంతారావు ప్రశ్నలు వెయ్యలేదు.

'వొక్క నిముషం. ఆఫీసుకి ఫోన్‌చేసి వస్తా.'

అతను ఎక్కడికీ కదలగల స్థితి కాదప్పుడు. కానీ అరుంధతి ప్రయాణం అయిందంటే అది అత్యంత ముఖ్యమే అయ్యుండాలి.

'పద అరుంధతీ...'

'అతను నాకు అబద్ధం చెప్పేడండీ. మోసం చేసేడు.' ఏడుస్తూ తనే అంది అనుంధతి.

కాంతారావుకు అతనెవరో, జరిగిన మోసమేమిటో అర్థమయింది ! కానీ దానికీ లోచనకు ప్రమాదంగా వుండటానికి రిలేషన్ షిప్ మాత్రం పూర్ణంగా అర్థం కాలేదు !

* * *

నాయుడు మాంచి హుషారులో వున్నాడు.

ప్రీవ్యూ థియేటర్‌కు ఆహ్వానితులై వచ్చినవారిని నవ్వుతూ ఆహ్వానిస్తున్నాడు. అతని మనుష్యులు పన్నీరు, గంధ పుష్పాలతో శాస్త్రోక్తంగా రిసీవ్ చేసుకొంటున్నారు. అతిథులు లోపలికి అడుగు పెట్టి తమ స్థానాల్లో కూర్చోగానే డ్రింక్స్ సర్వ్ చేస్తున్నారు.

పిక్చర్ నాయుడికి నచ్చింది. కానీ తనకి నచ్చి ఏం లాభం ?

డిస్ట్రిబ్యూటర్లకి నచ్చాలిగా ?

వారు పిక్చర్‌ని చూచి మొదట్లో బెట్టుగా మాట్లాడకుండా వున్నా వారి మొహకవళికల్ని బట్టి గ్రహించాడు నాయుడు. వాళ్లకి పిక్చర్ నచ్చింది. ధైర్యంతో తెలివితేటలుపయోగించి రిలీజ్ కి ముందుగానే మంచి బిజినెస్ చేసేడు. పిక్చర్ హిట్టయినా డబ్బే. హిట్ కాకపోయినా డబ్బే !

కానీ అలా తృప్తిపడి వూరుకోలేడుగా మనిషి ?

అందులో సరుకు మంచిదాయె.

హిట్ అయితే డబ్బుకు డబ్బు పేరుకు పేరూ పెరుగుతుంది. తను పెద్ద ప్రొడ్యూసర్ల లెక్కలోకి చేరుతాడు.

'పత్రికలవారికి రేపే ప్రీవ్యూ ఏర్పాటు చేయండి నాయుడుగారూ.'

గోపీచంద్ మాట నాయుడికి వేదవాక్కే. కానీ...

'అది క్వాలిటీ పిక్చర్‌కూడా. బాక్సాఫీస్ దగ్గరేకాదు అవార్డుల దగ్గరకూడా రికార్డుల్ని బద్దలు కొడ్తుంది. చూస్తారుగా ?'

పత్రికలవాళ్లు ముఖ్యంగా సినిమా పత్రికలవాళ్లు చిత్రమైన వాళ్లు. ప్రొడ్యూసర్లనుంచి రాచ మర్యాదలన్నీ అడిగి చేయించుకొంటారు. తింటారు తాగుతారు. పేకాట ఆడి డబ్బులు గెల్చుకొంటారు. యిన్ని జరిపించుకొనికూడా ఏకగ్రీవంగా పిక్చర్ బాగుందని అనరు. ఎవరి ధోరణిలో వారు రాస్తారు. చాలా మంది పిక్చర్‌ను ఎంత పొగిడినా ఏదో వంకపెట్టక మానరు.

'అది మా వృత్తి ధర్మమండీ.' అంటారు అదేమంటే. అలాంటిది పిక్చర్ చూచి ఏకగ్రీవంగా అంతా బాగున్నదన్నారు. 'కళాఖండం' అని పొగిడేరు ముఖ్యంగా దర్శకుడిని.

వాళ్ల పొగడ్తలు విన్నాక నాయుడికి కంగారు పట్టుకొంది.

రచయితను చేసిన శ్రీమన్నారాయణను, కాస్త పైకిరాగానే కాదు పొమ్మన్నాడు. పొగుడుతున్నట్లు పొగుడుతూనే శ్రీమన్నారాయణను తిట్టి అప్రతిష్టపాలు చేసేడు.

తనకు కాలిలో సుడివుండి ఆ రోజు ఆ ఆలోచన వచ్చింది. అతడిని దర్శకుడిని చేసేడు. యీ పిక్చర్ సక్సెస్ అవుతే తనకు మాత్రం అందుతాడా గోపీచంద్ ? పైగా డబ్బుకూడా పెద్దగా ముట్టచెప్పలేదు. పైగా వో పిక్చర్ సక్సెస్ కాబోతోందని తెలిస్తే మిగతావారు ఎగబడరూ?

'డైరెక్టర్‌గారూ. వొక్కమాట.'

గదిలోకి తీసుకెళ్లేడు గోపీచంద్‌కు డబ్బిచ్చాడు.

'మిమ్మల్ని నేను డబ్బు అడగలేదే ! డబ్బుకోసం నేనీ సినిమాను తీసేననుకొన్నారా ?'

'కాదనుకోండి. కానీ...'

'నాయుడుగారూ. మీరెందుకు యిప్పుడే డబ్బిస్తున్నారో నాకు అర్థమయింది. కానీ వొక్క విషయం. శ్రీమన్నారాయణ రచయితగా నాకు ఛాన్సునిచ్చినా, నా స్వేచ్ఛను హరించాడు. నాలో రచయితకు బురద పూసేడు, తన వూహలతో, కానీ మీరలా కాదు. దర్శకుడిగా నాకు ఛాన్సు ఏ కారణంచేత యిచ్చినా, నాకు స్వేచ్ఛనిచ్చారు. నేనిప్పుడు చాలా ఆనందంగా వున్నాను. యీ పిక్చర్ రిలీజ్ అవుతే నాలోని రచయితకు అసలైన గుర్తింపు వస్తుంది. మీకేం భయంలేదు. మీకు అంగీకరించాకనే దర్శకత్వం వహించటానికి మరెవరికైనా మాట యిస్తాను. సరేనా ? కానీ నాలుగైదు రోజుల్లో జనరల్ ప్రీవ్యూ ఏర్పాటు చేయండి, పరిశ్రమలో ప్రముఖుల నందరినీ ఆహ్వానించండి.






# శరన్మృతి

తెరపి యించుకలేక కురిసి మేఘంబులు
తెలుపారి మింటిపై తేలియాడ–
కలకదేరిన సరస్సులలోని నీళ్లతో
కమలకైరవములు క్రందుకొనియె–
పేదవారల యింటి పెద్ద దీపంబైన
రేరాజు వెలుగులు చూరలిచ్చె–
పచ్చ పచ్చని లేత పచ్చిక ముప్పొద
కబళించి పశువుల కడుపు కొర–
చారు తరమైన శారద సమయ మరుగు
దెంచె నూతన తేజంబు దెసల మించె
విజయ దశమి మహోత్సవ విలసనములు
సాగె మూరూర దేవి కర్చనలు జరిగె

–శనగన నరసింహస్వామి

# దాగుడు మూతలు

ఆహ్వానితుల లిస్టు తయారుచేసేక నాకు చూపటం మాత్రం మర్చిపోకండి.'

లిస్టులో మొదటి పేరు సులోచనదే.

ఆ పేరును కొట్టేసి 'రమాదేవి' అని రాసేడక్కడ.

శ్రీమన్నారాయణ పేరు కొట్టేసి ఆ స్థానంలో 'నెత్తురుకూడు' ప్రొడ్యూసర్ పేరు రాసేడు.

'వాడెందుకండీ. వాడు నన్ను మోసంచేసేడు.'

'నాకింకా కొంతడబ్బు బాకీ వున్నాడు. యీ సినిమా చూచాకన్నా, మీకు రావల్సిన డబ్బు, నాకు రావల్సిన డబ్బూ వసూలవుతుందేమోననీ... వుంచండి.'

'మరి శ్రీమన్నారాయణ పేరు కొట్టేసేరు ?'

'ఆయన నాకు గురువు. మా యిద్దరికీ కల్సి ప్రత్యేకంగా వోసారివేసి చూపించండి పిక్చర్. యిప్పుడు ఆయనొద్దు.'

'ముహూర్తంరోజు ఛీఫ్‌గెస్ట్. మీ శ్రీమతిగారు ఆమె పేరు కొట్టేసేరేమిటి ? మొదటిరోజే తీసుకొస్తారనుకొన్నాను.'

గోపీచంద్ మొహం ముకుళించుకుపోయింది.

'వద్దు.' అంటూ లిస్టు తన చేతికిచ్చి లేచిపోయాడు గోపీచంద్.

'సార్. గెస్టులందరూ వచ్చారు. పిక్చర్ ఆరంభించమంటారా ? '

ఎవరోవచ్చి అడిగారు నాయుడిని.

'నన్నడుగుతారేమిటి ? డైరెక్టర్‌గారినడగండి.'

'డైరెక్టర్‌గారు ఆరంభించెయ్యమంటున్నారండీ.'

'అయితే ఆరంభించెయ్యండి. ఆలస్యందేనికి ? ఎవరైనావస్తే చూచుకొంటానులే. మీరుకూడావెళ్లి చూడండి సినిమా. మళ్లీం ఎవరేసి చూపిస్తారు ? '

సినిమా ఆరంభమయింది.

నాయుడు బయట కూర్చుని కలలుగంటున్నాడు.

డబ్బు...డబ్బు...డబ్బు...

పేరు... పేరు... పేరు

యీ రెండూ అక్కర్లేని మనిషెవరు ?

ప్రతిభ లేకుండానే తనకీ రెండూ రాబోతున్నాయి. ఎలా ?

పెట్టుబడి పెట్టే శక్తి వుండటంవల్లనా ?

ఆ శక్తి వున్న వారందరికీ, డబ్బు, పేరు, వస్తున్నాయా ?

పెట్టుబడి 'కూంబ్'లో కల్సిపోతున్నదే ? మూసీలో మణిగిపోతున్నదే ?

కనుక పెట్టుబడి, డబ్బును వుత్పన్నం చేయదు.

ప్రతిభ... గోపీచంద్ ప్రతిభ డబ్బును సంపాదిస్తున్నది. పేరును సంపాదిస్తున్నది.

కనుక పెట్టుబడిదారుకంటే మేధావి గొప్పవాడు.

డబ్బుకన్నా ప్రతిభ గొప్పది. ఎందుకంటే డబ్బు ప్రతిభను సృష్టించలేదు కానీ ప్రతిభ డబ్బును సృష్టిస్తుంది.

అయితే డబ్బు లేక చాలామంది ప్రతిభ గుర్తింపుకు రావటం లేదుగదా ?

'నాయుడుగారూ...'

ఉలిక్కిపడి ఎదురుగ్గా వున్న వ్యక్తిని చూచాడు.

'అమ్మా ! మీరా !' అన్నాడు లేచి నిలబడ్తూ.

'అవునండీ. నేనే. మా ఆయన దర్శకత్వం వహించిన సినిమాను చూడ్దామన్న కోరికను అపుకోలేకవచ్చాను.'

యిదేమిటి ? యీమెకు సినిమాను చూడ్దామన్న కోరిక వుందిట! మరి భర్తను అడగవచ్చుగదా ? పోనీ భర్తతో రావచ్చుకదా ? యిలా వచ్చిందేమిటి ?

'మీరు నన్ను ఆహ్వానించలేదు. ఆయన రమ్మనలేదు. అయినా రావటం అనుచితమే ననుకోండి. కానీ... ప్లీజ్... యిది నా కోరిక. తీర్చరూ ?' అభ్యర్థన.

అదెంత భాగ్యం ? కానీ గోపీచంద్‌గారు ఆహ్వానితుల లిస్టునుంచి పేరు స్వయంగా కొట్టేసేరు. 'వద్దు' అనికూడా చెప్పేరు. కోరికను తీర్చితే ఆయనేమనుకొంటాడో ? తీర్చలేకపోతే ఆ తర్వాత యీమె ఆయనతో ఏం చెప్తుందో ?

'అయ్యో. మీరు రావటమే భాగ్యమమ్మా. అలాగే కానీ డైరెక్టర్‌గారి పక్కన చోటుందో లేదో ! ఆ ఏర్పాటు చేసివచ్చి తీసుకెళ్తానమ్మా. వొక్కక్షణం యిలా కూర్చొని వుంటారా ? యిప్పడే సినిమా ఆరంభమయినట్లుంది.' అతడు లోపలకు నడవబోయాడు.

'ప్లీజ్. వద్దండీ. ఆయన పక్కనే కూర్చొని సినిమా చూడాలని లేదు. అలాగైతే వారితోనే వచ్చేదాన్ని గదా ? ఆయనకి తెలియకుండా సినిమా చూచి ఆయన్ని సర్‌ప్రైజ్ చేయాలని వుంది. వెనుక ఎక్కడో ఆయనకి తెలీకుండా కూర్చొని సినిమా చూస్తాను. సినిమా పూర్తికాక ముందే వెళ్లిపోతాను. ఆయనకు తెలియన్వికండి.'

'ఏమ్మా ? ఎందుకలా ? నాకేం అర్థం కావటంలేదు. ఆహ్వానితుల లిస్టులో మీ పేరు రాస్తే దాన్ని డైరెక్టర్‌గారు కొట్టేసేరు కూడా.'

'అంతేనండీ. మేం యిద్దరం వో చిన్న ఆట ఆడుతున్నాం. దాగుడుమూతలాట. ప్లీజ్ ..'

యింతాచేస్తే ఆటా ? భలే ...

ఆడుకోనీ. తనకేంనష్టం ?

'నీ కోరిక ప్రకారమే కానీమ్మా. లోనికి రండి వెళ్దాం.'

(ఇంకా వుంది)

# అవీ-ఇవీ-అన్నీ

## రచయితలకు ఆహ్వానం

యువ రచయితలలో సామర్థ్యానికి గుర్తింపు కలగజేయాలని రచనలపట్ల అవగాహన ఏర్పరచాలని, వర్ధమాన రచయితల సఘం ఏర్పడింధి. కొత్తవారికి అవకాశమిచ్చే విధంగా ఓ పత్రిక కూడా నడుపుతున్నారు.

వివరాలకి : స్వంత చిరునామాగల కవరుతో కార్యదర్శి, వర్ధమాన రచయితల సంఘం, భీమునిపట్నం-531163, విశాఖపట్నం జిల్లాకి రాయాలి.

*　　　*　　　*

విజయవాడలోని యువకళా సాంస్కృతిక సంఘము (రిజిష్టర్డ్) వారు "ఇంద్ర ధనస్సు" అనే నూతన సంస్థను ప్రారంభిస్తున్నారు. కార్యక్రమ నిర్వహణకు శ్రీ ఐన్‌స్టీన్, శ్రీ కోట రాంబాబు, శ్రీ కోట వెంకట సుబ్రహ్మణ్యంలతో అడ్‌హాక్ కమిటీ ఏర్పడింది. ప్రసిద్ధ సినీ సంగీత దర్శకులు శ్రీ పెండ్యాల నాగేశ్వరరావుగారి ఆకస్మిక మృతి పట్ల కమిటీ తమ తీవ్ర సంతాపాన్ని ప్రకటించింది.

క్రిస్మస్ రోజున "ఇంద్ర ధనస్సు" నిర్వహణలో జరిగే స్టార్‌నైట్ కార్యక్రమ సందర్భంగా లలిత గీతాల పోటీ, 'నేటి సినిమాల' అనే అంశము మీద మినీ కవితల పోటీలను నిర్వహిస్తారు. మినీ కవితల పోటీ విజేతలకు శ్రీశ్రీ స్మారక బహుమతులను, లలిత గీతాల పోటీ విజేతలు శ్రీ పెండ్యాల స్మారక బహుమతులను ఇస్తారు. ఈ పోటీలకు ఏ విధమైన ఎంట్రీ ఫీజు లేదు. పుత్సాహవంతులైనవార తమ స్వంత చిరునామా కల రిప్లయి కవరును జత పరచి శ్రీ కోట రాంబాబు, శ్రీ రామకృష్ణ భవన్, కె. కె. నగర్, విజయవాడ-520012 అన్న చిరునామాకి పంపి వివరాలు, ఎంట్రీ ఫారాని పొందవచ్చునని సంస్థ ప్రధాన కార్యదర్శి తెలియచేస్తున్నారు. □

MCA/NTC/101/TEL



# హైదరాబాద్ నోట్‌బుక్

తిరుమల రామచంద్ర

## సెప్టెంబర్ 16 :-

వీర గంధము తెచ్చినారము, వీరులెవ్వరో తెలుపుడీ– అని కవిరాజు అర్ధ శతాబ్ది క్రితం ప్రశ్నించారు. ఆ గంధం ఆయన ఎవరికి పూశారో కాని, వీరులకు పూయండని మనకు అందించి పోయారు. ఆ గంధం గందపు గిన్నెలలో అలాగే ఆరని పసిమితో, వీడని గుమ గుమలతో ఉంది. ఆ గంధం సెప్టెంబర్ 16న ఇన్ని దశాబ్దాలకు వినియోగ పడింది. నీతికి, నిజాయితికి, ధైర్యానికి సాహసానికి, సంయమానికి సహకారానికి, త్యాగానికి తెంపరితనానికి గీటురాళ్ళయిన 165 మంది వీర శిఖామణులకు, రాజనీతికి పవిత్రను బంగారు పూతగా పూసిన మేరు నగధీరులకు, తెలుగువారి సచ్ఛీలతను దిగంతాలకు పరుగెత్తించిన పవిత్ర మూర్తులకు, శ్రీ నందమూరి తార్కక రామారావుకు పెట్టని కోటగా నిలిచిన విధాన సభ్యులకు ఆ వీర గంధం పూద్దాం. ఇంతకన్నా సత్పాత్రులు ఆ గంధానికి లభించరు. సిరిరా మోకాలు అడ్డువారు కలరే! అని సామెత. ఆ సామెతకు అపవాదం 165 మంది. సిరి లక్షలలో ముందుకు వచ్చి నాట్యం చేసినా, మోకాళ్ళే కాదు, చేతులూ. కాళ్ళే కాక దేహమంతా అడ్డువేశారు, మనసును దానికి తాళంగా బిగించారు. సిరి నెల రోజులూ తారట్లాడింది. పెదవులు తాటించింది, భయపెట్టింది. భీభత్సాలు చేసింది. 165 మందీ తపస్సమాధిలో ఉన్న తాపసుల లాగ ప్రలుబ్ధులు కాలేదు. తమ వజ్ర సంకల్పాన్ని విడనాడలేదు. ఎంతగొప్ప తపస్సు, ఎంత దొడ్డ మనస్సు! ధనంతో, అధికారంతో ఎవరినైనా కొనగలమనే ఎత్తులవారికి ఎంతటి చిత్తు! శ్రీ రామారావుకన్న వారినే నేను ప్రశంశిస్తాను. ధనరాసులతో భాగ్యనగరానికి వచ్చి, వలలు వేసి గాలించి, మధ్యవర్తులను పుత్తెంచి, బేరసారాలు చేసి, నిరాశతో తిరిగిపోయిన అధికారైక భజనులు కూడ నేడు ప్రజాస్వామ్యం జయించిందని ఇతరులతోపాటు నినాదాలు చేయడం విడ్డూరం! ఏమైతేనేం నాటకం సుఖాంతంగా సమాప్తమైంది. ప్రతి పక్షాలను చీల్చడం, వారిలో కొందరితో లైత్కక్కలాడించడం శ్రీ జవహర్‌లాల్ నెహ్రూ కాలంలోనే ప్రారంభమయింది. వామపక్షాలను అంతగా సమర్థిస్తున్న శ్రీ జవహర్‌లాల్ నెహ్రూ ఉమ్మడి మద్రాసు రాష్ట్రంలో కాంగ్రెసేతర పక్షాలు శ్రీ ప్రకాశంగారి నాయకత్వంలో ప్రభుత్వ నిర్మాణానికి పూనుకున్నప్పుడు శ్రీ రాజగోపాలాచార్యులను దొడ్డిదారిన పంపి, మైనారిటీ ప్రభుత్వాన్ని స్థాపించి ప్రకాశం పక్షాన్ని ఛిన్నా భిన్నం చేశారు. మహామేధావి, తత్త్వవేత్త అయిన భగవాన్‌దాస్ వంటి వారి కుమారుడైన శ్రీ శ్రీ ప్రకాశ వంటివాడు గవర్నరుగా ఉండి కూడా ఏమి చేయలేకపోయారు. ప్రజలకే కాదు, ప్రజా నాయకులకు కూడ మరపు సహజం. కనుక 32 సంవత్సరాల క్రితం (1952) జరిగిన దానిని



సెప్టెంబరు 20న శాసన సభలో తమ బలాన్ని నిరూపించుకున్న శ్రీ ఎన్. టి. రామారావు

ఎవరూ పట్టించుకోలేదు. కనుకనే శ్రీ రామ్‌లాల్ చేసింది కొత్త తప్పని భావించారు. అప్పుడు శ్రీ ప్రకాశంగారి నాయకత్వాన కాంగ్రెసేతర ప్రభుత్వం నెలకొని ఉంటే కొంప మునిగేదా? దానిని చూచిన వారు కూడ నేడు హాహాకారాలు చేస్తున్నారు. అయితే, ఈ నెల రోజుల పంచాగ్ని మధ్య తపస్సు శ్రీ రామారావు మనస్సును, హృదయాన్ని బాగా పరిపాకం పొందించి ఉంటారు. గొడ్డళ్ళ కథ మరువరాదు. కనుక సెప్టెంబర్ 16న మరల అధికారానికి వచ్చిన ఆయన శత్రు మిత్ర పరిజ్ఞానంతో వ్యవహరించడం అవసరం. అవసరాలకొద్దీ అండన చేరి అపార స్తోత్ర పాఠాలు చేసిన వారిలో ఎందరు అధికార గ్రహణ కాలంలో ఎలా ప్రవర్తించారో పరిశీలించాలి. మరీ వింత ఏమిటంటే స్వాతంత్ర్య యోధులనబడేవారి లైత్కక్కలు! ఎవరు అధికారానికి వస్తే తమకేమిటి? తాము స్వాతంత్ర్యం కోసం పాటు పడ్డారు, ప్రతిఫలంగా భూములూ, ఉపకార వేతనమూ పొందుతున్నారు కదా! ఎవరు ముఖ్యమంత్రులయినా అవి పోవు గదా! రామారావు మళ్ళీ రాగూడదనే కాకి గోల ఎందుకు? ఇప్పుడు వారే అవి కావాలి, ఇవి కావాలీ అంటూ వస్తారు. గ్రహణ కాలం నెల రోజులలోను చీకటి పనులు ఎన్నో జరిగాయి. వాటి విమర్శ పరామర్శలతో నూతన మంత్రివర్గం కాలం గడపడం వృధా అవుతుంది. ప్రభుత్వోద్యోగుల వయః పరిమితి 58 ఏళ్ళదాక ఉంటే వచ్చే ప్రమాదమేమీ లేదు. దానిని తిరగదోడి ప్రభుత్వోద్యోగుల అసంతృప్తిని కోరి తెచ్చుకోవడం ఎందుకు? అలాటి వాటిని వదిలి వేయవచ్చు. సాంస్కృతిక వ్యవహారాల విషయంలో ముందు నిర్ణయించినట్టే అకాడెమీలను త్వరలో ఏకం చేయడం మంచిది. ఆస్థాన విద్వాంసులను కొనసాగించదలచుకుంటే, ఆ పదవికి యావజ్జీవితం కాక, మూడేళ్ళో, అయిదేళ్ళో పరిమితి పెడితే, అర్హులైన పలువురికి అవకాశమిచ్చినట్టవుతుంది. తాము త్యాగరాజుకన్నా గొప్ప వాళ్ళమని కాని, భరతమునినే భరతం పట్టించగల వాళ్ళమని కాని భావించే కళాకారులను ప్రభుత్వం పట్టించుకోనక్కరలేదు దేశంలో మహా మేధావులకు, కళోపాసకులక్కు కొరత లేదు. వారి నుంచి సగౌరవంగా సలహాలు పొందవచ్చు. నేను అడుక్కుంటేగాని, ఆంధ్రప్రదేశ్‌లో అడుగు పెట్టను, కచ్చేరీలు చేయను- అనేవారిని ప్రభుత్వం బతిమాలవలసిన అవసరం లేదు. శ్రీ రామారావు ప్రభుత్వం 32 రోజుల పుటపాకంతో పరిశుద్ధమైనది గనుక చేసిన తప్పులు మరి చేయదని, ముందు కన్నా ఎక్కువసేవతో జనానికి మరింత సన్నిహితం కాగలదని నమ్ముతున్నాను. తెలుగుదేశ చరిత్రలోనే కాక ప్రజాస్వామ్య దేశాల చరిత్రలోనే సువర్ణాక్షరాలతో లిఖింపదగిన 1984 సెప్టెంబర్ 16కు, మహా వీరులు 165 సంఖ్యకు ఏ నాటికీ అవమానం కలిగే పనులు జరగవనీ నమ్ముతున్నాను. తక్కిన దినాలలానే సెప్టెంబర్ 16ను ప్రజాస్వామ్య పరి రక్షణ దినంగా యావద్భారతమూ పరిగణించాలని ప్రజా నాయకులను కోరుతున్నాను.

**ఉపశ్రుతి :**

ప్రపంచంలో తొమ్మిదవ అద్భుతం ఏమిటబ్బాయి?- అని ప్రశ్నించాడు ఉపాధ్యాయుడు.

శ్రీ ఎన్. టి. రామారావు మళ్ళీ రాజ్యానికి రావడం సార్. అన్నాడు విద్యార్థి. □

Printed and Published for Nageswara Rao Estates Private Ltd., by S. Nageswara Rao at the

**కొత్తది**

# అద్వితీయ శక్తిదాయక పానీయం.
# జిల్లనిపించే నారింజ రుచిగలది!




గ్లూకోజ్ చేరిన కొత్త గ్లూకోన్-సి. మీ బిడ్డను ఉరుకుల పరుగుల ఉత్సాహంతో నింపి ఉంచే, అనుకూలమైన సత్వర శక్తిదాయక ఆహారం.

ఇది, పిల్లలలో పళ్ళు, ఎముకలు, శరీర ధాతువుల పెంపుదలకు అత్యవసరమైన విటమిన్ సితో పరిపుష్టమైనది.

ఒక గ్లాసు చల్లని ఐస్ వాటర్‌లో నాలుగు టీ స్పూన్ల గ్లూకోన్-సి కరిగించి, జిల్లనిపించే నారింజ రుచిగల ఉల్లాస పానీయాన్ని తయారుచేయండి, రోజుకు రెండుసార్లు మీ బిడ్డకివ్వండి.






# గ్లూకోన్-సి

L-1174

